# సందేహాలు - సమాధానాలు

రచన:

మోపిదేవి కృష్ణస్వామి M. A.



ఉపరల్లు టీచర్ ట్రస్టు ప్రచురణ
విశాఖపట్టణము.

ప్రథమ ముద్రణము ప్రతులు : 1,000

ఆగష్టు 1979

వెల : **8/-**

ప్రాప్తి స్థానము :
కరస్పాండెంట్
ది వరల్డు టీచర్ ట్రస్టు
14-58-2 రాధామాధవమ్
ముప్పిడి కోలనీ
విశాఖపట్టణము

AQUARIAN PRINTING SCHOOL,
SRINAGAR, VISAKHAPATNAM - 16.

# పరిచయము

పరతత్త్వము ఆయా దేశము కాలములలో అప్పటి అవసరములను బట్టి నామరూపాది లక్షణలక్షితమై, అవత రించు చుండును. ఈ అవతరణ వ్యూహము అనేక స్థాయులలో భాసించును. కొన్ని అంశావతారములు, కొన్ని పూర్ణావ తారములు, ఒక్కొకటే భగవానుని స్వయంవ్యక్తి. వీరు కాక ఔపదేశిక మార్గమున సంసార బద్ధజీవులకు సంతరణమును ప్రసాదించుటకు, విజ్ఞానమును వెదజల్లుటకు కొందరు ఉద్భ వింతురు. వీరిని ఆచార్య, దేశిక, మహాత్మాద్యభిజ్ఞలచేత లోకము గౌరవించును. వీరందఱకు సామాన్యమైనది గురు తత్త్వము. వీరు పరతత్త్వమునకు ప్రతీకలై, దార్శనికులై మానవజాతి యెడ సంపూర్ణకరుణను వహించి, వెన్నుతట్టి, వెలుగు చూపి రేపటి తరమును బంగారము చేయుటకై తమ సర్వస్వమును మదుపు పెట్టుదురు. సృష్టియందు పునఃపురావృత మగుచున్న వీరి అవతరణ వృత్తాంతములు, చరిత్ర, భావ ములు, ప్రవచనములు, సాధన—ఈ మొత్తము కలిపికొన్నచో తరతరములకు చెరుగని వెలుగుముద్ద.

అట్టి వెలుగుముద్దకు ఈ యుగమున పేరు E. K.

సాగదీసినచో ఎక్కిరాల కృష్ణమాచార్య. మంత్రముగ ధ్యానించినచో Earth Kundalini లేక Eternal Kingdom. వ్యక్తిగా చెంతచేరి మసలినచో మధుర భావముల తేట, మాటాడినచో తేనె యూట, వ్రేలు చూపినచో అది వెలుగుబాట.

ఆయన సాంప్రదాయిక వేదవిదుల కుటుంబమున పుట్టి, సర్వవిజ్ఞానమును నేర్చి, బ్రహ్మవిదులై లోకశ్రేయము నకు దీక్షపూనినవారు. కవిగా, ఋషిగా, వక్తగా, ప్రవక్తగా, వైద్యునిగా, భవరోగవైద్యునిగా, ఆచార్యునిగా, జగదాచార్యునిగా-ఇన్నిమాట లెందులకు? మన మధ్య మసలుచున్న పరతత్త్వ ప్రతీకగా ఆయన అనన్యులు. సాంఘికా ధ్యాత్మికార్థిక రంగములలో నూతనాధ్యాయము నారంభించి ప్రాక్పశ్చిమ సమన్వయ ద్వారమున, వెలుగుల విరజిమ్మి లోకము నుద్ధరించుటకై ఆయన జగద్గురు పీఠమును స్థాపించినారు. దీనినే ఆంగ్లమున World Teacher Trust అందురు. ఆ సంస్థ పవిత్రాశయముల వలనను, ఉత్తమకృషి వలనను అతి స్వల్పకాలముననే బ్రహ్మాండమంత పెద్దదై విస్తరిల్లినది. ఇంకను విస్తరిల్లును. దానికి ఆయన లోవెలుగు, ఆశ్రితులు వెలివెలుగులు.

అట్టి వెలుగులలో చిరంజీవి కృష్ణస్వామి యొకడు. మాష్టరుగారికడ (ఆయన విశ్వవిద్యాలయమున ఉద్యోగించు దశలో) తొలుత విద్యార్థియై క్రమముగ శిష్యుడైనాడు.

ఎట్టి శిష్యుడు? ఆయన మార్గమున ఊహించి, ప్రవచించి, పనిచేసి ధన్యతనందుచున్న వాడు. కావున గురువు చేయు పనిని నిశితదృక్కులో చూచి, సునిశిత మేధస్సుతో తూచి, ఇంకను సునిశితమైన వాక్కుతో ఎల్లరకు తెలివిడి చేయ యత్నించినాడు. తన చేతి తాయమును నలుగురికి పంచ వలెనని తహతహ పడినాడు కృష్ణస్వామి. అందుచే ఈ యత్నము నెఱవేరినది. కృష్ణస్వామి గడుసరి. ఇతరులు తన గురువుగూర్చి తెలిసికొన వలెననియో, తెలివి తేటలతో తప్పుపట్ట వలెననియో వెలిబుచ్చిన సందేహములను మూట గట్టినాడు. ఒక్కొక్క దానికి తిరుగులేని సమాధానము లను రాబట్టినాడు. సందేహాలు, సమాధానాలు దండగట్టి నాడు.

ఇందు చక్కని తెలుగు వచనమున్నది. భావమును మోయ గలిగినంత భాషయే యున్నది. సూటిగా, తేటగా, నీటుగా తాను చెప్పదలచినది చెప్పిన యొడుపున్నది. అందు చేతనే ఈ పుస్తకము వ్రాతప్రతిని కృష్ణస్వామి నాకీయగా చదువుట మొదలుపెట్టిన వాడను, ఒక్క ఊపుననే ముగించి తిని. ఇది మంచి పుస్తకమునకు గీటురాయి, వ్రాయసకానికి కలికితురాయి.

మాస్టరుగారి సాహిత్యము, వైద్యము, సాధన, జగ ద్గురుపీఠము, మహాత్మ్యాలు — ఇట్లుగా ఎన్నో అంశములను కృష్ణస్వామి సేకరించి, చిత్తశుద్ధితో అనుభవ సాంద్రతతో

చిలికి వ్రాసినాడు. అదృష్టవశమున ఈ పుస్తకము చదివిన వారు మాస్టరుగారి దగ్గరకు చేరి తరింపగలరు లేదా దూరమూ నుండియే ధ్యానించి తరింపగలరు. ఎట్లైనను తరింపక తీరదు. గురువు చేయు మంచిపనులను శిష్యుడు వివరించి చెప్పా చున్నాడు. ఇంతకంటే గురుసేవా భాగ్య మేమున్నది?

వస్తువుయొక్క పవిత్రత, వ్రాయుసకాని చిత్తశుద్ధి, వ్రాతలో చేతాళము - ఇన్ని గుణములు గుదిగట్టిన వెనుక నా పరిచయ మెందులకు?

అదే నాకును తెలియలేదు. బహుశః స్నేహాముచే వారు నన్ను కోరిరి. నేను దానిపై విలువతో ఇట్లు వ్రాసితిని.

అతని రచన, నా యీ పరిచయము రెండును మాస్టరు గారి కాళ్ళదగ్గర మల్లెదండలే.

ఒంగోలు : సిద్ధార్థి
శ్రావణపూర్ణిమ
6-8-79

ఇట్లు
ధారా రామనాథశాస్త్రి

# పరిచయము

ఇలాంటి పుస్తకం రావాలని నాకెప్పట్నుంచో వుండేది. నేనిలా అనుకుంటూనే వున్నాను– ఒకరోజున కుమార్ గారింట్లో వుండగా, మా కృష్ణస్వామి ఈ పుస్తకం తాలూకు లిఖిత ప్రతిని ముందుంచడం జరిగింది. ఆశ్చర్యము, ఆనందము ఒక్కసారిగా కలిగాయి. ఏదో అర్జెటుంపని వుండడంచేత ప్రతిని అప్పుడు సావధానంగా పూర్తిగా చదవలేక పోయినా, కొంత అక్కడక్కడ చదివాను. చాలాబావుం దనిపించింది. నేనైతే ఇన్ని విషయాలు అంత సుతిమెత్తని భాషలో ఓపిగ్గా వ్రాయగల్గి వుండేవాణ్ణిగాను. అందుచేతనే ఈ పుస్తకం కృష్ణస్వామి ద్వారా రావడం జరిగి వుంటుంది. ఆ తర్వాత ప్రతిని యావత్తూ క్షుణ్ణంగా చదవడం జరిగింది.

ఇంతవరకు ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ (జగద్గురు పీఠము) ప్రచురించిన పుస్తకాలన్నీ ఒక తరహాకు చెందినవి. ఇది ఒక తరహాకు చెందినది. ఇది మాస్టారిని ( E. K. ) గురించి, ( W. T. T. ) ని గురించి, మాస్టారి ద్వారా నిర్వహింప బడే ప్రణాళికల గురించి సమగ్రంగా బయటవారికి తెలియ చెప్తుంది. అంటే " మాస్టారూ– W. T. T." అన్నదానికి ఎన్‌సైక్లోపీడియా లాంటి దన్నమాట! మాస్టారు వ్రాసిన

పుస్తకాలు చాలా వున్నా, మాస్టరుగార్ని గూర్చి వ్రాయబడిన పుస్తకాలు చాలా తక్కువ. లెక్కకు ఇప్పటికి మూడే మూడు. ఒకటి మాస్టరుగారి 51 వ జన్మదిన సందర్భంలో ఆవిష్కరింపబడిన స్వర్ణోత్సవ సంచిక, రెండు- జీవనజ్యోతి, మూడవది పురుషమేధ దర్శనము. ఈ మూడు పుస్తకాలు తీర్చలేని సందేహా లెన్నింటినో ఈ ప్రస్తుత పుస్తకం తీరుస్తుంది. మాస్టరుగారిని గూర్చి, W. T. T. తో వారికిగల సంబంధం, వారి రచనలు, ప్రణాళికలు, పద్ధతులు అలవాట్లు, అనుయాయులు; సత్యసాయిబాబా, రమణ మహర్షి మొదలైన వారిపై మాస్టారి భావాలు, యోగ విద్యలో వివిధ సంప్రదాయాలు; వివిధ విద్యలలో తయారైన వారసులు- ఇలా ఎన్నో విషయాలు అష్టాంగ యోగంలా అష్టాధ్యాయాలుగా విభజింపబడి, వివరింపబడ్డాయి. ఈ విషయాలన్నిటిని గూర్చి తెలిసినవారు, తెలుసుననుకునే వారు, తెలియనటువంటివారు అటు బయట-ఇటు W. T. T. సభ్యులలోనూ కూడా వుండవచ్చు! ఈ పుస్తకం చదివితే ఆ తెలిసినవారికి ఇంకా సరిగా తెలిసేట్లు చేస్తుంది. తెలుసుననుకునే వారిని సరియైన త్రోవలో పెట్టుంది, తెలియని వారికి తెలియ జెప్తుంది. ఈ విధంగా ఈ మూడు రకాలవారికీ కూడా ఈ పుస్తకం ఉపయోగపడ్తుంది. ఈ మూడు రకాలవారికీ కూడ ఎన్నో సందేహా లుండవచ్చు. అడిగితే తప్పనుకునేవారు, మన కెందుకొచ్చిం దనుకునే వారు,

ఎవర్నో అడిగి సరియైన సమాధానం పొందనివారు, అడుగుదామనుకుని కూడా మొహమాటపడి వూరుకునేవారు-ఇలా ఎన్నో రకాల వారుండవచ్చు! ఇలాంటివారందరికీ కలిగిన సందేహాలన్నిటికీ సముచితంగా, సమగ్రంగా, సంపూర్ణంగా, సమాధానాల నివ్వడం జరిగిందనడంలో సందేహం లేదు.

నిజం చెప్పాలంటే- సందేహం కలగడం ఎంత తేలికో, దానికి సమాధానం దొరకడం అంత కష్టం. కాని సమాధానం చెప్పగలవారు కరువైనప్పుడు లేదా అది సమాధానంతో ప్రసక్తిలేని సందేహమైనపుడు మాత్రమే పైన చెప్పిన నిజం నిజం. చిత్రమేమిటంటే- "కుతూహలం", "సందేహం"- ఇవి రెండూ జిజ్ఞాసువుకు- 'కొడుకు,' 'కూతుర్లాం'టివి. కుతూహలం ఎల్లకాలం మనదగ్గర వుండేదే! నిజానికి ఉండాలి కూడా!! కాని సందేహం అల్లా కాదు. దానికి సమాధానం దొరకంగానే మనల్ని వదుల్తుంది. అంటే సందేహం మన కూతురైతే సమాధానం మన అల్లుడన్నమాట! దేహంతో కూడింది సం'దేహం'. ఆధానంతో కూడినది స'మాధానం' దేహాన్నిచ్చే ప్రక్రియ (Reproductive faculty) స్త్రీలకే వుంటుంది. ఆధాన ప్రక్రియ (Germination) పురుష సంబంధమైనది. అందుకే అవి రెండూ కూతురూ అల్లుడుగా పోల్చడంలో ఔచిత్యం వున్నది. సమాధానం-మంచి సత్తువ, స్తోమత లేనిదైతే

సందేహం మళ్ళీ మళ్ళీ మనల్నే ఆశ్రయిస్తుంది. అల్లుడి ఉద్యోగం ఊడినప్పుడల్లా కూతురు పుట్టింటికి చేరినట్లు! కాని గ్రంథకర్త కృష్ణస్వామి మంచిస్తోమత, సత్తువగల, సమాధానాలనే పుత్రులుగల, గట్టి వియ్యంకుడనే చెప్పాలి. సందేహాలనే కూతుర్లు గలవారు ఈ వియ్యంకుణ్ణి గట్టిచేసుకోవడం ఎంతైనా మంచిదని నా అభిప్రాయం !

కృష్ణస్వామి M. A., చదివే రోజుల్లో మా తమ్ముడికి సహాధ్యాయి. అప్పుడే కృష్ణస్వామికి మాస్టారితో పరిచయం. స్వతహాగా కృష్ణస్వామికి ఆవేశం ఎక్కువ. మనం బయట ఈ రోజుల్లో వినే ఎన్నో నినాదాలతో ఆ రోజుల్లో అతని గుండె స్పందించేది. సమాజం మరామత్తుకు ఎన్నో చెయ్యాలి, ఎంతో మార్పు రావాలి అని తపన చెందేవాడు. మాస్టారితో పరిచయం అతని భావాల కనుగుణంగా అత ననుకున్న వాటిని సాధించడానికి గాను కావలసిన 'సత్త్వగుణ విద్యుత్కాంతి'ని అతనికి ప్రసాదించింది. దీన్తో ఎంతోమందికి ఆదర్శ ప్రాయుడైనాడు. ఉచిత విద్యాలయాలను, వైద్యాలయాలను, యోగవిద్యా కేంద్రాలను ప్రారంభించి వాటిని నిర్వహింపగల వ్యక్తుల్ని తగిన శిక్షణతో తయారుచేశాడు. రచనా వ్యాసంగం కొనసాగించాడు. ఇతని "స్వామి గేయాలు," 'దర్శనాలు-నిదర్శనాలు' అన్న రెండు గ్రంథాల్ని W.T.T. ప్రచురించింది. శుకస్తుతిపై ఇతడు వ్రాసిన సమీక్ష

వ్యాసాన్ని ఆంధ్రా యూనివర్సిటీ వారు చిన్న పుస్తకంగా ప్రచురించారు. ఇది నాల్గవ పుస్తకం. ప్రస్తుతం 'భారతంలో ధర్మాద్వైతం' అనే అంశంమీాద ఆంధ్రా యూనివర్సిటీలో పరిశోధన చేస్తున్నాడు.

విసుక్కోకుండా, ఎవ్వరినీ బాధించని విధంగా సమాధానా లివ్వడం కూడా ఒక కళే! మృదువైన భాషలో సూటిగా ఎదుటి వారి హృదయాలకు హత్తుకునే విధంగా చెప్పగలగడం ఇతని ప్రత్యేకత! ఎందుకంటే మనం చెప్పే విషయం నలుగురూ చెప్పుకునేట్టుందా- 'చెప్పొచ్చు' అనేట్టుందా? నచ్చేట్లుందా? నప్పించుకొనేట్లుందా? అన్నది కూడా గమనించాలిగదా! ఈ కృష్ణస్వామి చెప్పిన కొన్ని సమాధానాలు చూడండి ఎంత రమ్యంగా వుంటాయో! మాస్టారు ఉపన్యాసాల్లో ఏం చెప్తారు? ఎలా చెప్తారు? అన్నదానికి- "ఆయనకు తెలిసినది మనకు చెప్పరు మనకు తెలియవలసినది మనకు చెప్తారు, అదికూడా మన స్థాయికి దిగివచ్చి తనస్థాయికి మనలను కొని పోతారు" అనీ-

మాస్టారు స్వయంగా గ్రంథాల నెందుకు వ్రాయలేదు? వ్యాఖ్యానాలకే ప్రాధాన్య మిచ్చారేం? అన్న దానికి-

" మన పెద్దలకు సొంతంగా చెప్పాలన్న మోజులేదు. చెప్పవలసినది సొంతంగా చెప్పాలన్న దీక్ష వుంది" అనీ-

మాస్టారుచేసే వైద్య సేవను గూర్చి-

"ఆయన ఎక్కడ బావుంటుందో అక్కడ వుండరు. ఎక్కడ బాగు కావాలో అక్కడ వుంటారు. మనం కోరినపుడు దొరకరేమోగాని మన కవసరమైనపుడు పిలవకుండానే ప్రక్కనవుండి మందులిస్తూ అవసరమైతే మందలిస్తూ ఉంటారు" ఇలా సాగే సమాధానాలు చదువుతూంటే ఒక విధమైన తృప్తిని, హాయిని చేకూరుస్తాయి. సందేహాలు గూడా ఏమీ తక్కువ స్థాయిలో లేవు. మొహమాట పడకుండా, జంకూ గొంకూ లేకుండా అడిగినవి అడిగినట్లుగానే వున్నాయి. విష యం కనక సక్రమంగా తెలియకపోతే కొన్ని సందేహాలకు సమాధానం చెప్పటం చాలా కష్టం. చూడండి ఎంత పదు నుగా వుంటాయో మచ్చుకు కొన్ని వ్రాస్తాను.

"బడా బడా వాళ్ళందర్నీ తన వెనకాల తిప్పు కుంటాడు. వాళ్ళచేత తన పనులన్నీ చేయించుకుంటాడు. కాలుకిందపెట్టనవసరం లేకుండా వాళ్ళ కార్లలో తిరు గుతూ వుంటాడు. ఇదే నేమో యోగమంటే మరి ?"

"ఒక ప్రక్క సనాతన ధర్మ మంటూనే గురుపూజల్లో ఒడుగులకు, పెళ్ళిళ్ళకు ముహూర్తాలు పెట్టరు, పైగా ముగ్గురు నలుగురు అన్నదమ్ములకు ఒకేసారి ఒడుగులు చేయిస్తారు గూడా ! అదేమిటో ?"

"గురుపూజల్లో అందరి ఫొటోలతో పాటు ఈయన

ఫొటోగూడా దేనికో? శుభలేఖలపై గురువుల పేర్లు ఫొటోలు వెయ్యడమేమిటి?"

"వివాహమై, పిల్లల్ని కని, సంసారం చేస్తూ, పిల్లల బాగుల్ని చూచుకుంటూ ఉండేవారికి ఇంక యోగమేమిటి? గురుత్వమేమిటి?

"ప్రిస్క్రిప్షన్‌లో గట్టివారే కాని అంత హెచ్చు పొటెన్సీలు వాడడం అపాయం కాదా?"

"వైద్యం తిరుగు లేనిదే. కాని మనిషికి చిరాకు ఎక్కువ. రోగుల్ని కోప్పడ్డం ఎక్కువ."

"కొన్ని కేసుల్ని K G H లో చేర్పిస్తూనే వుంటిరి. ఇది మాస్టారికి నామూర్దాగాదా?"

"C V V గారు, పరిభాకరశాస్త్రిగారు ప్రార్థనతో వ్యాధుల్ని నయం చేయగా వాళ్ళ మార్గాన్నే అనుసరించే ఈయన గూడా అలా ఎందుకు చెయ్యరు? హోమియో దేనికి?"

"ఎవడికి పడితే వాడికి వేదాలు నేర్పడం, స్త్రీలచేత గాయత్రి చేయించడం సంప్రదాయానికి వ్యతిరేకం కావా?"

"రామాలయంలో రుద్రాభిషేక మేమిటి?"

"తండ్రి వద్ద నేర్చుకొన్న ఆయుర్వేదాన్ని వదలి ఈయన ఈ హోమియో పట్టుకున్నారేం?"

"ఉపన్యాస మిస్తున్నప్పుడు హిప్నొటైజ్ చేస్తారా- ఆ కాసేపు అంత గమత్తుగా వుంటుంది ?"

ఇలా చిత్రంగా వుంటాయి సందేహాలు. వీటికి సమాధానాలు గూడా అంత చిత్రంగానూ వుంటాయి. ఇంక చివరకు ఒక చక్కని సందేహాన్ని అంతకంటే చక్కని సమాధానాన్ని ఇక్కడ ప్రస్తావించి నా కర్తవ్యాన్ని ముగిస్తాను.

"అన్నీ బాగానే వున్నాయి, కానీ ఎంత సమాధాన పరుచుకుందామనుకున్నా నా మనస్సుకు నచ్చని దొక్కటే— ఒకమనిషి కాళ్ళకి మరొక మనిషి మొక్కడ మేమిటి? శిష్యులు మొక్కడమూ బాగాలేదు- మాస్టారు అలా మొక్కించుకోవడమూ బాగాలేదు. గౌరవాన్ని తెలియపరచుకోవడానికి ఇంకేమీ మార్గాలు లేవా కాళ్లు పట్టుకోవడం తప్ప ?"- ఇదీ సందేహం.

"మాస్టారు ఎవరినీ తన పాదాలకు నమస్కరించమని ఆజ్ఞాపించలేదు. నమస్కరించే వారిని అడ్డుపెట్టనూ లేదు. అడ్డు పెట్టితే ఆ నమస్కారం ఆయనకి- అని ఆయన అహంకరించిన ట్లవుతుంది. తన ద్వారా ప్రవహిస్తున్న వెలుగునకు వారు తమను తాము సమర్పణ చేసుకుంటున్నారని మాస్టారికి తెలుసు...... స్విచ్ వెయ్యడం లాంటిది- మనని గురువు పాదాలకడ సమర్పించుకోవడం. స్విచ్ వేయనిదే లైటు వెలగదు...... ఆరాధనకు- రాతి విగ్రహాలకన్న కొయ్యవి, కొయ్యవాటి కన్న మానవ విగ్రహాలు మిన్న-

క్రమంగా సజీవమైన విగ్రహాలను అర్చించడం నేర్వని దే జీవితానికి ముక్తి లభించదు...... మనం నమస్కరిస్తున్నది చరణాలకు. చరణాలంటే చరించేవి అని అర్థం. అనగా- 'అవి చరిస్తున్న ధర్మమార్గానికి మనని మనం సమర్పణ చేసుకోవడమే- చరణాలకు నమస్కరించడం.'' ఆ ధర్మ మార్గానికి అంకితమవుతున్నామని పదమంటి ప్రమాణం చేస్తున్నామన్నమాట! అందుకే మనవాళ్ళు చెవులకు కన్నులకు నమస్కరించమనలేదు. చరణ శరణాగతి అన్నారు...'' ఇలా తీయగా హాయిగా సాగే సమాధానం మనల్ని పరవశింప జేస్తుంది. అహంకారాన్ని అంత మొందిస్తుంది. మాత్సర్యాన్ని మాయం చేస్తుంది.

ఇలా ఆవేశంతో ఆవేదనతో కల్గే వెచ్చని సందేహాలకు అనురాగంతో, ఆపేక్షతో ఇచ్చిన చల్లని తియ్యని సమాధానాలు గల ఈ పుస్తకం W T T సభ్యులు కానివారు, W T T సభ్యులూ గూడా చదివి తీర వలసినది. ఇంత చక్కని పుస్తకాన్నందించిన కృష్ణస్వామి కి - ఇంకా ఎన్నో ఇలాంటి ఉపయోగకరమైన పుస్తకాలను అందించడానికి శక్తి, సామర్థ్య, ఆయురారోగ్యైశ్వర్యాలను భగవంతుడు ప్రసాదించుగాక!

విశాఖపట్నం
22-8-79

ఇట్లు
జి. ఎల్. ఎన్. శాస్త్రి.

# తొలి పలుకు

నిత్యము వివిధ సన్నివేశములలో తారసపడు విభిన్న మనస్తత్వములు గల వ్యక్తులు మాస్టరుగారిని గూర్చి తమ తమ సంస్కారముల కనుగుణముగ ప్రశ్నించుచుండుట, నా ద్వారమున తగిన సమాధానములను పొందుచుండుట, గత ఐదు సంవత్సరములుగ జరుగుచునే యున్నది. కొందరు తెలిసికొనవలెనని ప్రశ్నింతురు. కొందరు తెలియ చెప్పవలెనని ప్రశ్నించుచుందురు. కొందరు అభిమానమును పెంచుకొనగోరి ప్రశ్నింతురు. కొందరు ఆక్షేపణను ఎరుకపరచుటకై ప్రశ్నించుచుందురు. కొందరు తెరించుటకై జిజ్ఞాసతో ప్రశ్నింతురు. కొందరు తప్పులు పట్టుటకై సరదాపడి ప్రశ్నించుచుందురు. ఇన్ని తరగతుల వారికిని చెప్పబడిన సమాధానములు తగినరీతిలో నుండునుగాని ఒకే తీరులో నుండవు. మాస్టరుగారి కడ ఉపదేశమందిన వాసుదేవోపాసన మెంతవరకు వచ్చినదో ఈ ప్రశ్నోత్తరముల సందర్భమున తెలియుచుండును.

మాస్టరుగారిని గుమ్మము దగ్గర నిలబడి చూచుచున్న వ్యక్తులకు ఆయన పనిచేయుచున్న వివిధ రంగములతో ఆయనను గూర్చి వచ్చిన అనుమానములకు, సందేహములకు

నేను ఇచ్చిన సమాధానముల సంకలనమే ఈ గ్రంథము. ఈ సందేహాలు - సమాధానాలు పుస్తకరూపము దాల్చిన మేలు జరుగగలదని భావించిన సోదరులు కొందరు నన్ను, వీని నన్నిటిని నొకచోట జేర్చి చక్కగ కూర్చి అందింపవలసి నదిగా కోరిరి. వారి కోరికను వాసుదేవుని యాజ్ఞగా శిరసా వహించుట, ఇంత గ్రంథము దిగివచ్చుట జరిగినది.

ఈ సమాధానములు కేవలము నాకు గల పాండిత్య లోకజ్ఞానములనుండి వచ్చినవి కావు. సందేహముల ననుసరించి ఆయా లోకముల తలుపులు తెరచి సమన్వయ దర్శనమును అనుగ్రహించిన 'దివ్యస్పర్శ' ప్రసాదించినవి. వివిధ ముఖ ముల సందేహముల నేకరువు పెట్టి సర్వాంతర్యామియే లోక హితమును కోరి యిట్టి సమాధానములను రాబట్టియుండును. సమాధానములు దిగివచ్చుటకు నేనొక వాహికను మాత్రమే అని తెలియబరచుటకే ఈ వివరణము.

మాస్టరుగారిని గూర్చి సమాధానమిచ్చుటకు నేనెట్లు నిమిత్తమైతినో అటులనే మహానుభావుల జీవిత విధానము నకు భాష్యము దిగివచ్చుటకై మాస్టరుగారు తమ జీవిత మునే నిదర్శనముగ నిలిపినారా యని అనిపించుచున్నది. వాల్మీకి తన కాదర్శమైన రాముని చరితమును రామాయణ ముగ గానము చేసినాడు. అది మానవులందరికిని ఆరాధ్య కావ్యమైనది. అట్లే మాస్టరుగారిని ఆదర్శముగా గొని సాగిన ఈ రచనగూడ అందరిది. అందరికొరకు దిగివచ్చినది

యని నా విశ్వాసము. మాస్టరుగారు అందరికన్న ఎట్లు యెక్కువ అనునది తెలియజేయుటకు గాదు, ఈ గ్రంథము దిగి వచ్చినది. మాస్టరుగారు అందరితో ఎట్లు ఒక్కటియో తెలిపిచూపుటకే ఈ ప్రయత్నము.

విచిత్రమగు ఈ గ్రంథమును చదివి ముచ్చటపడి ముద్రణమునకు వలయు నేర్పాటును 'ట్రస్టు' తరపున గావించిన సోదరులు శ్రీ K. P. కుమార్ గారికి కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను. గ్రంథ హృదయమును దర్శింప జేయునట్టి పరిచయమును సరసముగ వ్రాసియిచ్చిన సోదరులు శ్రీ G. L. N. శాస్త్రి గారికిని, గ్రంథముయొక్క ఆవశ్యకతను తెలియజేయుచు తమ అమూల్యమగు అభిప్రాయము నొసగి ఆశీర్వదించిన బ్రహ్మశ్రీ ధారా రామనాథ శాస్త్రి గారికిని కృతజ్ఞతాభివందనముల నర్పించుకొనుచున్నాను. గ్రంథమును నేనాశువుగ చెప్పునపుడు వ్రాతప్రతులను సిద్ధము చేసిపెట్టిన చిరంజీవులు నీలకంఠము, రఘురామ్ కుమార్, D. సూర్యనారాయణమూర్తి, చక్రపాణులకు శుభాశీస్సులు. తగిన జాగరూకత వహించి అందముగ ముద్రించి అందించిన ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూలు సోదరబృందమునకు శుభాకాంక్షలు. ముఖ చిత్రమును తీర్చి దిద్దిన చి॥ దాస్ కు శుభాశీస్సులు.

జిజ్ఞాసువుల కేమాత్ర ముపయోగించినను ఈ నా

కృషి ధన్యత చెందగలదు. తమ జీవితమునకే భాష్యము చెప్పునంతటి మహదవకాశమును అనుగ్రహించి ఆశీర్వదించుచున్న గురుదేవుల చరణములకు ప్రణమిల్లుచు సమర్పించుచున్న ఈ గ్రంథమును విజయవాడ సోదరబృందమువారు తమ వైద్యవిద్యార్థుల ప్రథమస్నాతకోత్సవ శుభసందర్భమున నిండు హృదయముతో ఆవిష్కరించి మీకందించుచున్నారు. వారికి నా ప్రత్యేకాభివందనలు.

విశాఖపట్నం,
19-8-79

మోపిదేవి కృష్ణస్వామి



# విషయసూచిక

1. ప్ర : మాస్టరు గారు కూడా ఏదో ట్రస్టు లాంటిది ఒకటి పెట్టారని విన్నాం. ఏమిటి దాని విశేషం ?

జ : మాస్టరుగారు ట్రిస్టులాంటివి ఏమీ పెట్టలేదు. ఆయన చుట్టూ ఒక ట్రస్టు లాంటిది ఏర్పడింది. మాస్టరు గారు తన మార్గాన తాను సేవ చేసుకుంటూ పోతుండగా ఈ దేశంలోనూ, విదేశాలలోనూ వేలమంది అనుయాయులు ఏర్పడ్డారు. వారు కూడా మాస్టరుగారి దగ్గర శిక్షణ పొందుతూ మాస్టరుగారి లాగానే తోటివారికి సేవ చేస్తున్నారు. వాళ్ళందరూ "మనమంతా ఒక ట్రిస్టుగా ఏర్పడి అంతర్జాతీయమైన సంస్థగా దానిని రిజిస్టరు చేయించి పనిచేయడం ప్రారంభిస్తే అన్ని విధాల బాగుంటుం"దని మాస్టరుగారిని కోరారు. అప్పుడు మాస్టరుగారు తాను నిర్వహిస్తున్న దివ్యప్రణాళిక ననుసరించి "వరల్డు టీచర్ ట్రిస్టు" అనే పేరుతో రిజిష్టర్ చేసుకోవలసిందిగా సలహా ఇచ్చారు. అప్పటినుండి "వరల్డు టీచర్ ట్రస్టు" రోజు రోజుకు వృద్ధి పొందుతూ తన సేవా కార్యక్రమాలని మరింత విస్తృతం చేస్తూ ఉన్నది. ఇంతకు చెప్పొచ్చే దేమిటంటే మాస్టరు గారే సంస్థనూ స్థాపించలేదనీ, వారి చుట్టూ చేరిన వేలాది సాధకులే ఒక సంస్థగా రూపు కట్టుకున్నారనీ.

2. ప్ర : వరల్డు టీచర్ అంటే ఎవరు ? పేరు గమ్మత్తుగా ఉంది ?

జ : నిజమే. కొత్తవారు చాలా మంది ఈ పేరును చూచి రకరకాలుగా భావిస్తూ ఉంటారు. 'వరల్డు టీచర్ ట్రస్ట్' అంటే ప్రపంచ ఉపాధ్యాయుల సంఘం అనుకున్న వారు కూడా ఉన్నారు. కాని జగద్గురు పీఠం అని తెలుగులో దీని కర్థం. అయితే జగద్గురువు ఎవరని ప్రశ్న. సత్యమేమి టంటే సృష్టి ప్రారంభంనుండి ఇప్పటివరకు అనేక కాలాలలో అనేక దేశాలలో ఒకే వెలుగు దిగి వచ్చి మానవులకు దారిని చూపిస్తూ నడిపిస్తున్నది. ఆ వెలుగునే రాముడనీ, కృష్ణుడనీ, బుద్ధుడనీ, క్రీస్తనీ మనం పిలుస్తూ వచ్చాం. ఇన్ని రూపులతో ఇన్ని పేర్లతో దిగివస్తున్నవాడు ఒకే ఒక జగద్గురువు. అవసర మైనప్పుడెల్ల తగిన రీతిలో అవతరిస్తానని గీతలో చెప్పే ఉన్నాడు కదా! ఆ దిగివస్తున్న జగద్గురువు పేరిట ఈ సంస్థ స్థాపించ బడింది. ఆ జగద్గురువు ఆదేశాలను ఆచరించి, కోరినవారికి ఆ మార్గాన్ని అందించడమే ఈ సంస్థ చేస్తున్న పని.

3. ప్ర : మతాలు వద్దంటున్న మాస్టరుగారు తానొక ట్రస్టును స్థాపించడం మరో మతాన్ని పెట్టినట్లు కాదా ?

జ : మతభేదాలు వద్దన్నారు గాని మతాలు వద్దనలేదు. ఇల్లు బూజు పట్టకుండా చూచుకోండి అంటే ఇంటిని పడ గొట్టుకోమని అర్థంకాదు. మతాలు సాధకునకు దివ్య జీవనం లోనికి శిక్షణనిచ్చే విద్యాలయాలు. విద్యాలయా లెన్నైనా ఉండవచ్చు గాని వాటిల్లో నేర్పబడే విద్య మాత్రం ఒకటేనని తెలియాలి.

మాస్టరుగారు సోదరబృందం వరల్డ్ టీచర్ట్రస్ట్గా ఏర్పడినపుడు మతాతీతమైన సంస్థగా దీనిని తీర్చి దిద్దారు. మతాతీతం అంటే మతరాహిత్యం కాదు. మతముల గోడలు వద్దని అర్థంగాని మతాలు అభ్యాసం చేయించే కట్టు బాట్లు వద్దని అర్థం కాదు. ఇక్కడ ఏదో ఒక మతం ప్రకారం శిక్షణ ఉండదు. మానవునికి కావల్సిన శిక్షణ ఉంటుంది. తండ్రి కొడుకుల అభిరుచిననుసరించి ఎవరుకోరిన రంగంలో వారిని పెద్ద జేసినట్లు. మాస్టరుగారు తన శిష్యులకు ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి మార్గాన్ని, శిక్షణను అందిస్తుంటారు.

మాస్టరుగారి ననుసరిస్తున్నవారిలో అన్ని మతాల వారూ ఉన్నారు, అన్ని కులాలవారూ ఉన్నారు. తాను విదేశ యాత్రను ముగించుకొని వస్తూ ఒక చక్కటి శిలువనూ, విలువైన క్రొవ్వొత్తులను భద్రంగా తీసుకొచ్చి ఆనందరావనే తన క్రైస్తవ శిష్యునకు ఆశీర్వదించి ఈయటం నేను నా కన్నులతో చూచాను. అప్పటికి నాకింకా మాస్టరు గారు క్రొత్త. ఆ దృశ్యం చూచి నేను పొందిన ఆనందానికి అవధులు లేవు. ఎంతటి విశాలత్వం, ఎంతటి ప్రేమతత్త్వం అనిపించింది నాకు. అంతటి ప్రేమమూర్తి గనుకనే ఆయనలో ఎవరి దేవుడు వారికి కనిపిస్తూ ఉంటాడు. విదేశాలలో ఎందరో ఆయనలో క్రీస్తును దర్శించారు. మరెందరో తమ తమ పరమ గురువులను దర్శించారు. ఇక మన దేశంలో సంగతి సరేసరి. అందువల్ల మాస్టరుగారు అందరి కోసం, అందరికీ

చెందిన వారిని తయారు చేయటం కోసమే వరల్డు టీచరు ట్రస్టుకు రూపు రేఖలు దిద్దుతున్నారు.

4. ప్ర : ప్రస్తుతం మన దేశం అనుభవిస్తున్న దుస్థితికి "వరల్డు టీచర్ ట్రస్టు" ద్వారా మాస్టరుగారు చూపిస్తున్న మార్గమేమిటి ?

జ : మన జాతి చెడిపోతూ ఉన్నది—మనకు వనరులు లేక పోవటం వలన కాదు. ప్రపంచంలో మిగిలిన దేశాలన్నిటి కన్నా మన కెక్కువ వనరులే ప్రకృతి మనకు ప్రసాదించింది. ఆ వనరులను సద్వినియోగం చేసే సద్బుద్ధి మందగించడం వల్ల మన జాతి చెడిపోతున్నది. జాతి దెబ్బతింటున్నది—అవకాశాలు లేక పోవడం వల్ల కాదు. కష్టించి పనిచేయడానికి ఇష్టపడక పోవడం వలన, సుఖం పేరిట సోమరితనాన్ని వరించడం వలన, మన దేశానికి దారిద్ర్యం వచ్చింది. అంతే దేశం దరిద్ర దేశం కాదు. దేశంలోనున్న మనం దరిద్రుల మయ్యాం. అందువలన వళ్లువంచి పని చేసే స్థితికి మాస్టరుగారు మళ్లీ జాతిని మేల్కొలుపుతున్నారు. కష్టించి పనిచేయడంలో ఎంత తృప్తి, ఎంత గౌరవం ఉన్నదో ఆయన రుచిచూపిస్తున్నారు. తాను రోజుకు 22 గంటలు పనిచేస్తూ తన జీవితాన్ని ఆదర్శంగా అనుయాయులకు అందిస్తున్నారు. అందువల్లనే ఒక్కసారి ఆయనను చూచినవారు ఖాళీగా ఉండమన్నా ఉండలేరు.

తిరుపతి వెంకటకవుల దర్శనం చేస్తే చాలు ఎలాంటి వాడికైనా కవిత్వం పుట్టికొచ్చేదట. అలాగే మాస్టరుగారిని దర్శించిన వారెలాంటి వారైనా వారి హృదయంలో నుండి సేవాభావం పుట్టుకొచ్చి తీరుతుంది. ఆ పుట్టుకొచ్చిన సేవా భావం వాళ్లను వళ్లువంచి పనిచేసేలా చేస్తుంది.

ప్రయోగ సామర్థ్యం లేని విద్యా విధానం వలన దేశానికి ఆయువుపట్టయిన యువతరం నిర్వీర్యమై నిరుపయోగంగా ఉండిపోతోంది. ఈ విషయంలో మాస్టరుగారు తన నాశ్రయించిన యువకులను ఉద్యోగాలతో సంబంధం లేకుండా స్వయంగా పోషక సంస్థలను, వృత్తి వ్యాపారాదులను నిర్వహించుకొనేటట్లుగా శిక్షణనిస్తున్నారు. నిరుద్యోగ సమస్య ఎదురురాని పరిపూర్ణ విద్యా విధాన నిర్మాణానికి కృషి చేస్తున్నారు. మాస్టరుగారు సూచించిన పద్ధతులలో అప్పుడే కొన్ని విద్యాలయాలు నెలకొల్పబడ్డాయి.

పల్లెలలోగాని, పట్టణాలలోగాని వైద్యసేవ సామాన్యులకు అందుబాటులో అంతగా ఉండటంలేదు. కారణం ఈ వైద్యం వాణిజ్య సరళిగా అపవిత్రం కావడమే. సామాన్య జనులకు అందుబాటులో ఉండేటట్లుగా వందలాది ఉచిత హోమియో వైద్యాలయాలు మన దేశంలోనూ, విదేశాలలో కూడ నిర్వహింపబడుతున్నాయి. మాస్టరుగారి దగ్గర శిక్షణ పొందిన యువకులు తమకు తాముగా ఆ వైద్యాలయాలు నెలకొల్పి నిర్వహిస్తున్నారు.

వేదవాఙ్మయాన్ని, పురాణేతిహాసాలను సామాన్య జనులకు అర్థమయ్యే భాషలో ట్రస్టు అందిస్తూ ఉన్నది. ఈ అందించడంలో మాస్టరుగారు ఒక విశిష్టమైన పద్ధతిని అనుసరిస్తున్నారు. వేదాలనుండి భారతభాగవతాలవరకు ఒక చక్కని ప్రణాళిక అవి రచించిన ఋషులచే వేయబడి ఉంది. ఆ ప్రణాళికను దర్శించని వారికవి కట్టుకథలుగా ఉంటాయి. దర్శించినవారికవి దివ్యజీవనంలోనికి చేయూత నిచ్చే పట్టుగొమ్మలవుతాయి. మాస్టరుగారు అంతర్లీనమైన ఆ ప్రణాళికను పరిపూర్ణంగా, పామరులకు కూడా బోధపడేటట్లుగా, వివరిస్తున్నారు. వరల్డు టీచర్ ట్రస్ట్ అందిస్తున్న ఈ దివ్య వాఙ్మయం తరతరాలవారికి చేయూత నిచ్చి దివ్యజీవనం లోనికి నడిపిస్తుంది.

మాస్టరుగారు "వరల్డు టీచర్ ట్రస్ట్" ద్వారా నేడు మన తరం అనుభవిస్తున్న సమస్యలకు విముక్తిని చూపిస్తున్నారు. మన తరానికీ, రాబోయే వేలాది తరాలకీ బంగరు బాటను చూపే దివ్యవాఙ్మయాన్ని అనుగ్రహిస్తున్నారు. మనలో ధర్మ సంస్థాపన చేస్తున్నారు. మానవాళికి ధర్మ స్వరూప దర్శనాన్ని ప్రసాదిస్తున్నారు. కనుక "వరల్డు టీచర్ ట్రస్ట్" నేటివారికొరకు, రాబోయే వారి కొరకు కూడా బాధ్యతతో పని చేస్తున్నది.

ఒకప్పుడు నైమిశారణ్యంలో ఇలాంటి ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నాల ఫలితాలే మనం విలువకట్టలేని

భారత భాగవతాలు, పురాణ వాఙ్మయం. అప్పటినుంచి అలాంటి ప్రయత్నాలు అడపా దడపా జరుగుతూనే వచ్చాయి. ఇపుడు మళ్ళీ మాస్టరుగారి సారథ్యంలో అదే ప్రయత్నం పరిపూర్ణమైన రీతిలో సాగుతూ ఉన్నది.

5. ప్ర : మాస్టరు గారు మన దేశంలో తాము నిర్వహిస్తున్న ప్రణాళికనే విదేశాలలో కూడా ప్రవేశ పెట్టారా?

జ : మాస్టరుగారు ఘన వైద్యులు. మామూలు రోగాలకే కాదు. భవరోగాలకు కూడ. వ్యాధినిబట్టి మందు వేస్తారుగాని ఒకే మందు అందరికీ వాడ రాయన. భారత దేశం సతమత మౌతున్న సమస్యలను చూచారు. ఈ సమస్యలకు సరైన పరిష్కారాన్ని సూచించడమే గాకుండ తా నాచరిస్తూ తన ననుసరిస్తున్న వేలాది మందిచే ఆచరింప జేస్తున్నారు. భారతీయుడి కిపుడు చేయవలసినది నైతిక పతనాన్నుండి ఉద్ధరించి ఆత్మ విశ్వాసాన్ని కలిగించటం, సరైన విద్యా విధానాన్నిచ్చి జీవితంలో సమర్థునిగా చేయడం, అందు బాటులో లేకుండా పోతున్న వైద్య సహాయాన్ని అందించ డం, జీవితాన్ని క్రమబద్ధం చేసికొనేటట్లుగా శిక్షణ నిచ్చి "తా"నంటే ఏమిటో తెలియజెప్పి వేదాంతాన్ని మాటలలో కాకుండా అనుభవంలోనికి తెచ్చుకొనేటట్లు చేయడం. భారత దేశంలో మాస్టరుగారి ప్రణాళిక ఈ గమ్యాన్ని ఉద్దేశించి ఉంటుంది.

విదేశాలలో పరిస్థితులు వేరు. వాళ్ళకు ఆర్థికంగా బెంగ లేదు. క్రమశిక్షణకు లోటు లేదు. దీక్షబూని పని జేయడంలో సిద్ధహస్తులు. సాంఘిక జీవనంలో కావలసినన్ని సౌకర్యాలు వాళ్లు సృష్టించుకొన్నారు. కాని వాళ్లకు కరువైనదల్లా సుఖము, మానసిక ప్రశాంతి, జీవిత వికాసము. ఈ మూడిటి కోసం వాళ్లు భారతీయుల్ని చేయి చాచి అడుగుతున్నారు. యోగం అంటే మోజుపడి లెక్కకు మిక్కిలిగా యోగావిద్యా కేంద్రాలు నెలకొల్పుకుంటున్నారు. యోగ విద్యాలయాలలో చేరడం అక్కడి వారి కొక ఫాషన్. కాని వారి యోగాభ్యాసం ఆసనాలు, పద్ధతిలేని ప్రాణాయామం తోనే ఆగిపోతుంది. అలాంటి స్థితిలో మాస్టరుగారి పరిచయం వారికి జరిగింది. ఆయన సాన్నిధ్యంలో, సందేశంలో ఎనలేని ప్రశాంతి వారికి దొరికింది. ఆ ప్రశాంతిని కోరి వాళ్లు ఆయనకు అంకితమయ్యారు. సరైన పద్ధతిలో అష్టాంగ యోగ మార్గాన్ని, నిజమైన ఆధ్యాత్మిక జీవితాన్ని మాస్టరుగారు వారి కుపదేశించారు. వారికి కావలసిందల్లా ఒక్కటే. సరైన రీతిలో యోగమార్గాన్ని ఉపదేశించడం. మాస్టరుగారు వారి ఆవశ్యకతను గమనించారు. వారి దప్పికను తీర్చేందుకు ప్రణాళిక వేసుకున్నారు. ఇప్పటికి నాలుగుసార్లు యూరప్ దేశాలు వారి కోరికపై పర్యటించి ఉపన్యాసాలు ఇచ్చారు. వాళ్ల యోగ విద్యాలయాలలో నిత్యము చెప్పుకొనేటందుకు వీలుగా చక్కని గ్రంథాలు "యోగా ఆఫ్ పతంజలి, మందార్ స్క్రిప్చర్, స్పిరిట్యుయల్ యస్ట్రాలజీ,

స్పిరిట్యుయల్ సైకాలజీ'' మొదలైనవి రచించి అందించారు. వైద్యసేవ కూడా ఇక్కడలాగే అక్కడా కొనసాగుతోంది. నిత్యమూ పోస్టులో ఫోటోలతో సహా విదేశాల నుండి రోగుల కథలు అందుతూ వుంటాయి. కొంతమంది విదేశీయులు ఇక్కడకు వచ్చి శిక్షణ పొంది వెళుతూ ఉంటారు. మాస్టరుగారు విద్యుచ్ఛక్తి వంటివారు. విద్యుచ్ఛక్తి ఎవరెలా ఉపయోగించుకుంటే వారికలా ఉపయోగపడుతుంది. మాస్టరుగారు ఎవరికెలా ఉపయోగపడాలో వారికలా ఉపయోగపడుతూ ఉంటారు.

6. ప్ర : మాస్టరుగారు విదేశాలు వెళుతూ ఉంటారు గదా ? అక్కడివాళ్లు మన దేశంలో ఈయన నిర్వహిస్తున్న పరిశాలికకుగాను ధనాన్ని ఏమైనా ముట్ట చెబుతూ ఉంటారా ?

జ : మాస్టరుగారే కాదు. ఏ పెద్దవాళ్లు వెళ్లి ఉపన్యాసం ఇచ్చినా విదేశాలవారు ఊరకే వినరు. ఎంతో కొంత ముట్ట జెప్పి తీరతారు. వద్దంటే చిన్నబుచ్చుకుంటారు. మాస్టరుగారు మొదటిసారి వెళ్లినపుడు రెండుమూడు రోజులలోనే ఈ వాతావరణాన్ని గమనించి వాళ్లిచ్చిన ధనాన్ని స్వీకరించి, చిరునవ్వుతో అక్కడివాళ్ళకు మళ్ళీ ఆ మొత్తాన్ని అందించి, "నా మార్గం మీకు నచ్చితే మీరు కూడ యిలాంటి సేవా కార్యక్రమాలకే ఈ ధనాన్ని వినియోగించండి. దీనితో మీ పనిని ప్రారంభించండి." అని ఇచ్చివేయడం ప్రారంభిం

చారు. అలా యిచ్చిన ప్రతి చోటా ట్రస్టు సేవా కేంద్రాలు ప్రారంభమైనాయి. ఆయన వారితో ఇలా చెప్పారు. "నేను జ్ఞానాన్ని మీకు భిక్ష పెట్టడానికి వచ్చిన వాడిని. ధనాన్ని మీ నుండి భిక్షగా స్వీకరించడానికి రాలేదు. మీ కోరికపై వచ్చాను. మీకు కావలసినది ఇస్తున్నాను. నాకు కావల్సినదంటూ ఏమీ లేదు మీరందరు బాగుండడం తప్ప."

7. ప్ర : మాస్టరుగారిని విదేశాలకు రమ్మని విదేశాల వాళ్లే కోరారా? అది ఎలా జరిగింది?

జ : మాస్టరుగారు గుంటూరులో ఉన్నప్పుడు 'మిహిర' అనే ఒక జ్యోతిషదర్శన మాసపత్రికకు సంపాదకులుగా కొద్ది నెలల పాటు పనిచేశారు. ఆ రోజుల్లో అందరూ ఆత్రుతను చూపించిన అష్టగ్రహ కూటమిని గూర్చి మాస్టరుగారు 'మిహిర' సంపాదకీయంలో దర్శనాత్మకంగా వ్రాశారు. అది అడయారులోని లైబ్రరీలో చదివి ఫలకించాడు ఆల్బర్ట్ శశీ. శశీ బెల్జియం వాస్తవ్యుడు. సాధు స్వభావుడు. భారతీయమైన యోగమార్గంలో తాను పయనిస్తూ అనేకుల కా మార్గంలో శిక్షణ నిస్తుండేవాడు. పరమగురువుల ఆజ్ఞపై భారతీయతను, యోగమార్గాన్ని పరిపూర్ణంగా బోధపరుచుకోవడానికై తన మేనకోడలైన ఎలిజబెత్ వార్నర్‌తో కలిసి భారతదేశం వచ్చి నీలగిరులలో ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకొని భారతీయతను అధ్యయనం చేయడం ప్రారంభించాడు.

మాస్టరుగారి వ్యాసాన్ని చదివిన శశీకి మాస్టరుగారిని చూడాలనిపించింది. నేరుగా గుంటూరు చేరుకున్నాడు. మాస్టరుగారిని చూచి తనకు కావల్సిన దేదో దొరికిందని ముచ్చట పడ్డాడు. నీలగిరులలోని తన ఆశ్రమానికి వచ్చి నెల రోజులపాటు ప్రవచనా లివ్వవలసినదిగా కోరాడు. అతని హృదయాన్నుండి దైవం ఆజ్ఞాపిస్తున్నాడని గ్రహించిన మాస్టరుగారు ఆయన ఆహ్వానాన్ని అంగీకరించి నీలగిరులకు వెళ్లారు. అచ్చటే శశీ తానెవరికొరకు ఎదురుచూస్తున్నాడో ఆ మహానుభావుడే మాస్టరుగారి గురువైన మాస్టరు C. V. V. అని తెలిసి పరవశించాడు.

మాస్టరుగారి ఉపన్యాసాలన్నీ టేప్ చేసుకొన్నాడు. ప్రవచనాల టేపులను E. K. C. V V. ల ఫోటోలను తీసి కొని బెల్జియం చేరుకొన్నాడు మేనకోడలితో. ఇంకేముంది! ఆయన శిష్యుల అందరిండ్లలో E. K. C. V. V.ల ఫోటోలు వెలిశాయి. మాస్టరుగారి గొంతు టేపురికార్డునుండి ప్రతి చోట వినబడడం ప్రారంభించినది. కృష్ణుణ్ణి చూడకున్నా వేణునాదానికే పులకించి పోయిన గోపికల్లాగ మాస్టరుగారిని, ప్రత్యక్షంగా చూడకపోయినా ఆయన ప్రవచనాలకే పరవశించి పోయారక్కడి వాళ్లు. మాస్టరుగారి చిత్తరువుల ముందు తమ తమ జీవితాలను సమర్పణ చేసుకొన్నారు.

ఇంతలో మాస్టరుగారు విశాఖపట్నం చేరారు. విశాఖలో విశ్వమంతటికీ దారి చూపగల కార్యక్రమాలు

ప్రారంభమయ్యాయి. శశి ఒకసారి విశాఖ వచ్చాడు. మాస్టరుగారిని తన జీవిత చరమదశలో చూచిపోవాలని వచ్చాడాయన. చూచి వెళ్లిన కొద్ది రోజులకే దేహాన్ని విడిచి పెట్టబోతూ "నేను ఈ సారి భారతదేశంలో EK గారికి చేరువ లో పుట్టి ఆయన శిక్షణలో పెరుగుతాను. దాని కనుగుణంగా నేను వదిలిపెట్టిన తరువాత నా శరీరాన్ని భారతీయ సంప్రదాయానుసారం దహనం చేయండి." అని చెప్పి తమ జీవిత మార్గాన్ని విస్తృతం చేసుకోవలసిందిగా, మాస్టరుగారి అడుగు జాడల్లో నడువవలసిందిగా వారిని ఆదేశించి శరీరాన్ని విడిచాడు.

ఆ తరువాత అచ్చట వారంతా మాస్టరుగారి రాకకు ఎదురు చూడసాగారు. ఉత్తర ప్రత్యుత్తరాలు ఎక్కువైనాయి. వారందరి కోరికపై మాస్టరుగారు 1972 ఏప్రిల్‌లో మొట్ట మొదటగా యూరప్‌లో అడుగుపెట్టారు. అప్పటినుండి ప్రాక్పశ్చిమాలను కలిపి నడుపుతున్నారు. అయితే రాను పోను ఖర్చులు మాత్రం వాళ్లను పెట్టుకోనిస్తారు. ఆ పైన మాత్రం ఆయన ఏదీ అంగీకరించరు. "ఆ ఖర్చులు కూడ మీ ఆర్తికి చిహ్నం. అడగనిదే చేయకూడదు. అడిగితే చేయకుండ ఉండ కూడదు." అంటారు మాస్టరు గారు.

8. ప్ర : విదేశాల సహాయం తీసుకోవడం లేదన్నారు కదా మన ప్రభుత్వం నుండి ఏమైనా గ్రాంట్లు మొదలైనవి లభిస్తున్నాయా? ఏ సహాయమూ లేకపోతే

ఇన్ని డిస్పెన్సరీలు ఇంతకాలం నుండి నడపడం ఎలా సాధ్యం ?

జ : మాస్టరుగారు గాని, ఆయనదగ్గర శిక్షణపొందిన వారు గాని తాము చేస్తున్న మంచిపనులకు ఎవరినుండైనా సహాయం లభిస్తే స్వీకరిస్తారే తప్ప ఎవరినుండీ సహాయాన్ని అపేక్షించరు. "మంచిపని మనం మొదలు పెడితే చాలు అది ఆగదు. దానికి కావలసిన వనరుల్ని ఆ మంచిపనే సమకూర్చుకుంటుంది. వనరులు కూర్చుకొని మంచిపనులు చేద్దామని భ్రమపడకండి. అదెప్పుడూ సాధ్యపడదు. సత్యమెప్పుడూ ఒక్కటే ! మంచి పనులు జరుగుతూ ఉంటే వనరులు వాటంతటవి సమకూరుతూ ఉంటాయి. సముద్రంలో నదులు వచ్చి చేరుతున్నట్లుగా. ఈ సత్యం నేను చెబితే నమ్మకం కుదరదు. మీరు చేస్తే మీకే అనుభవానికొస్తుంది." అంటారు మాస్టరుగారు. ఆయన ఆచరణలో ఆ సత్యాన్ని అడుగడుగునా దర్శింపజేస్తున్నారు.

ఆయన లాగానే ఆయన శిష్యులు కూడా వైద్యాలయాలు ప్రారంభించసాగారు. ప్రారంభించబడిన ప్రతీచోటా ముందుగా ఏ నలుగురో కలిసి ప్రారంభించడం, సేవాకార్యక్రమం విస్తృతమవుతున్న కొద్దీ ఎందరెందరో వారితో కలిసి పనిచేస్తూ బాధ్యతలను పంచుకోవడం, ఎవరికీ ఇబ్బంది కలుగకుండా అందరికీ తృప్తి కలిగేటట్టుగా కార్యక్రమాలు నడిచిపోతూ ఉండటం జరుగుతూ ఉన్నది.

మనం విత్తనాన్ని వేసి నీరుపోస్తున్నాం. మొలక వస్తుంది. క్రమంగా పసిబిడ్డలాగా మనం సాకిన కొద్దీ మొలక మొక్క అవుతుంది. కొంతకాలం జరిగే టప్పటికి మన సహాయంతో నిమిత్తం లేకుండా ఆ మొక్క భూమిలోనికి వ్రేళ్ళు వ్యాపింపచేసి తన ఆహారాన్ని తాను స్వీకరించి తాను వర్ధిల్లుతూ తరువాతి తరాలవారికి పండ్లను అందిస్తుంది. ఆ మొక్క ఎక్కడనుండి ఆహారాన్ని స్వీకరిస్తోంది? తానెక్కడ వేయబడిందో అక్కడనుండే. అలాగే మనం సత్సంకల్పంతో డిస్పెన్సరీ ప్రారంభించామనుకోండి. తొలిరోజుల్లో దానిని మనం పసిబిడ్డలా సాకుతాము. క్రమశిక్షణతో మనం సేవచేయడం ప్రారంభిస్తే డిస్పెన్సరీ ఆ ప్రాంతం వారందరికీ ఆరోగ్యాన్ని ప్రసాదించడం మొదలుపెడుతుంది. క్రమంగా కొంతకాలానికి తాను సహాకరించిన వారి దగ్గరనుండి తనకు కావల్సిన సౌకర్యాలు చేకూర్చుకుంటుంది. దానివల్ల విలువ కట్టలేని సహాయాన్ని పొందిన వారు దానికి సహాకరించకుండా ఉండలేని స్థితికి వచ్చి, అప్రయత్నంగా తమకు తాముగా కోరి సహాకరిస్తూ ఉంటారు. కొంతమంది తమ ఆర్జనలో కొంతభాగాన్ని బీదలకు వినియోగపరచాలని నిర్ణయించుకుంటారు. కాని వారు ప్రత్యేకంగా ప్రణాళికలు నిర్వహించలేరు. అలాంటివారు క్రమశిక్షణతో జరుగుతున్న ఈ సేవా కార్యక్రమాలకు అండదండలుగా ఉంటూ తృప్తిని పొందుతుంటారు. ఇలా జరుగుతూ ఉండడం

వల్లనే ఇప్పుడున్న డిస్పెన్సరీలే కాదు. ఇంకా ఎన్ని వందల డిస్పెన్సరీలనైనా కావలసిన వారు నడుపుకోగలరు.

మాస్టరుగారు పైన చెప్పిన మార్గాన్ని ఆచరణ ద్వారా చూపించి, ఆ మార్గంలోనికి మనలను మేల్కొలుపుతున్నారు. ఈ మార్గాన నడవడం ప్రారంభించడం వలన నడుస్తున్నవారు సమర్థులై పదిమందిని నడిపించ గలుగుతారు. అలా కాకుండా, ఏ విదేశాలో, ప్రభుత్వమో సహకరిస్తుందనుకున్నా, ఒక వేళ సహకరించినా, పని యిప్పుడు జరుగుతున్నంత జరగదు. నేటి కాల గతినిబట్టి ఆ యా అధికారులైన వ్యక్తుల అడుగులకు మడుగులొత్తడంతో కాలం వ్యర్థమవుతుంది. సేవాకార్యక్రమం కుంటు వడుతుంది. ఎవరి దగ్గరనుండైనా అప్రయత్నమైన సహకారాన్ని అంగీకరించడంలో నష్టం లేదుగాని, అపేక్షించి నట్లైతే ఆ పని చేస్తున్నవారు ఇప్పుడు పెరుగుతున్నంత పెరగరు.

9. ప్ర. నాకు చూస్తున్న కొద్దీ ఆశ్చర్యంగా ఉంది. గవర్నమెంటు ఆఫీసుల్లో గాని, ఇతర సంస్థల్లో గాని జీతాలు ఒకపక్క తీసుకుంటూ మరో ప్రక్క చేయిచాచకుండా పనిచేసేవాళ్ళు ఎక్కువమంది కనబడరు గదా! అలాంటి ఈ దేశంలో మాస్టరుగారు కొన్ని వేలమంది చేత ఉచితంగా ఎలా పని చేయించ గలుగుతున్నారా అని ?

జ : నిజమే మీ రన్నట్లు నేడు మన దేశంలో మనిషికి తోటి మనిషికన్న డబ్బే ముఖ్యంగా కనిపిస్తోంది. ప్రతివాడూ తన రంగంలో సాధ్యమైనంత ఎక్కువ డబ్బును మూట కట్టు కోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ మూట కట్టుకోవటంలో నిమగ్నమైన మనిషికి బంధుత్వము, మానవత్వము ప్రేమ తత్త్వం ఏమీపట్టవు. ప్రతి ఒకడూ మరియొకణ్ణి ఇబ్బంది పెట్టకుండా, నొప్పించకుండా బ్రతకలేక పోతున్నాడు. ఎవడికి వాడు తన బాధలు, బాధ్యతలను భూతద్దంలో చూచు కొని తాననుసరిస్తున్న మార్గాలని సమర్థించు కొంటున్నాడు. తోటివాడికి కూడా అలాంటి బాధ్యతలు బాధలు ఉంటా యని మరిచి పోతున్నాడు. ఇలాంటి పీడకలగా నేటి సగటు మనిషి జీవితం గడిచిపోతూ ఉన్నది. తోటివాడికి సాటి వాడుగా, సాయపడేవాడుగా ఉండక పోటీపడే వాడుగా, పీడుకొనే వాడుగా, మానవుడు తయారవుతున్నాడు. ఈ పీడకల నుండి మానవుణ్ణి మేల్కొల్పడమే మాస్టరుగారు చేస్తున్నపని. ఇది కొత్తగా చేస్తున్నది కాదు. అనాదిగా అవ తార పురుషు లందరిద్వారా జరుగుతున్నదిదే. ఈ పీడకల నుండి మానవుణ్ణి మేల్కొలిపి మనిషిని మనిషిగా, మనిషిని దేవునిగా మలచడాన్నే ధర్మ సంస్థాపనమంటారు.

ఇదంతా యెందుకు చెప్పాను అంటే ఇలాంటి ప్రపం చంలో మాస్టరుగారు మరో ప్రపంచాన్ని ఎలా సృష్టిం చారో వివరించడానికి. ఆయన ప్రయోజనాన్ని అపేక్షించ

కుండా లోకాన్ని ప్రేమించారు. ప్రేమించడం అంటే మాటలలోను ఉపన్యాసాలలోను కాదు. ఎవరికి ఏది కావాలో తా నది అయ్యారు. తండ్రిలేనవారికి తండ్రి అయ్యారు. కొడుకులు లేనివారికి కొడు కయ్యారు. గురువు కావల్సిన వారికి గురువు అయ్యారు. వైద్యుడు కావల్సిన వారికి వైద్యు డయ్యారు. ఇలా ఎక్కడ ఏ పాత్ర అవసర మైతే అక్కడ ఆ పాత్ర ధరిస్తారు. ముందు ప్రేమతో మనలో ఒకరిగా ప్రవేశిస్తారు. ఈయన మనవాడు అనుకుం టాం. కొంత కాలానికి తెలుసుకుంటాం ఈయన మనవారు కాదు, మనమే ఈయన వాళ్ళ మని. మన ఆవశ్యకతలు అన్నిటినీ చూస్తూ ఎక్కడ ఎలా నడుచుకోవాలో అడుగడు గునా శిక్షణ నిస్తూ కంటికి రెప్పలా రక్షిస్తూ ఉంటా రాయన. అయస్కాంత సాన్నిధ్యం వలన ఇనుప ముక్కలో నిద్ర పోతున్న అయస్కాంత ధర్మం మేల్కొన్నట్లు, మనలో ప్రేమతత్త్వం, సమత్వం, ఏకత్వం మేలుకొంటాయి. ఇనుప ముక్క కూడ అయస్కాంతమై ప్రవర్తించినట్లు మనం కూడ ఆయనలా ప్రవర్తించడం మనకు తెలియ కుండానే ప్రారంభమౌతుంది. ఈ విధంగా మన నిజస్థితి లోనికి మనను మేల్కొలిపి ప్రేమమూర్తులుగా మనని శిల్పిస్తున్నా రాయన. అందువల్లనే ఆయనకు ఆత్మ పుత్రులై ఇన్ని వేల మంది ప్రతి ఫలాన్ని అపేక్షించకుండా దేవదూతల వలె పని జేయడం మనం చూడగలుగుతున్నాం. త్యాగం వలన మాత్రమే అమృతస్థితి లభిస్తుందని ఉపనిషద్వాక్కు.

మాస్టరుగారు తనను తాను త్యాగం చేసికొని మనను అమృత స్థితిలోనికి మేల్కొలుపుతున్నారు. దేశాన్ని బాగు చేయదలచినవారు, దేశం బాగుపడాలని కోరుతున్నవారు మాస్టరుగారివలె ప్రవర్తించ గలిగితే వారి జీవితమూ, తోటి వారి జీవితమూ ధన్యమౌతుంది. ఆవేశంతో నిందించడం కాదు ఇప్పుడు చేయవలసింది అనురాగంతో చేయి నందించడం.

10. ప్ర : మాస్టరుగారు ట్రస్టు కార్యక్రమాలను అమలు పరచడానికి అవసరమైన డబ్బు ఏ పద్ధతిలో ఏర్పాటు చేస్తారు? చందాలు మొదలైన వేమైనా వసూలు చేయడం ఉంటుందా? ట్రస్టుకి కథ నడవటానికి చాలా డబ్బు అవసరం గదా?

జ : ట్రస్టు కార్యక్రమాలకు చాలా డబ్బు ఖర్చు అవుతూనే వుంటుంది. చందాలు వసూలు చేయడమనేది మాస్టరుగారి విధానంలో లేదు. అయితే ఆయన వలన ఉపకారం పొందిన వారు ట్రస్టు చేస్తున్న మంచిపనులకు తమకు తాముగా తమకు తోచింది సమర్పించుకొంటూ ఉంటారు. ఈ సమర్పించుకొంటున్నప్పుడు కూడ మాస్టరు గారు ఒక విధమైన జాగ్రత్త వహిస్తారు. తన సహాయంవల్ల గాని, సలహావల్లగాని, అవతల వ్యక్తికి పదివేల రూపాయలు ధర్మబద్ధమైన లాభం కలిగిందనుకోండి. అప్పుడు ఆ వ్యక్తి ట్రస్టుకు సహకరిస్తానని ముచ్చట పడితే ఒక వెయ్యి

మాస్టరుగారు తనను తాను త్యాగం చేసికొని మనను అమృత స్థితిలోనికి మేల్కొలుపుతున్నారు. దేశాన్ని బాగు చేయదలచినవారు, దేశం బాగుపడాలని కోరుతున్నవారు మాస్టరుగారివలె ప్రవర్తించ గలిగితే వారి జీవితమూ, తోటి వారి జీవితమూ ధన్యమౌతుంది. ఆవేశంతో నిందించడం కాదు ఇప్పుడు చేయవలసింది అనురాగంతో చేయి నందించడం.

10. ప్ర : మాస్టరుగారు ట్రస్టు కార్యక్రమాలను అమలు పరచడానికి అవసరమైన డబ్బు ఏ పద్ధతిలో ఏర్పాటు చేస్తారు? చందాలు మొదలైన వేమైనా వసూలు చేయడం ఉంటుందా? ట్రస్టుకి కథ నడవటానికి చాలా డబ్బు అవసరం గదా?

జ : ట్రస్టు కార్యక్రమాలకు చాలా డబ్బు ఖర్చు అవుతూనే వుంటుంది. చందాలు వసూలు చేయడమనేది మాస్టరుగారి విధానంలో లేదు. అయితే ఆయన వలన ఉపకారం పొందిన వారు ట్రస్టు చేస్తున్న మంచిపనులకు తమకు తాముగా తమకు తోచింది సమర్పించుకొంటూ ఉంటారు. ఈ సమర్పించుకొంటున్నప్పుడు కూడ మాస్టరుగారు ఒక విధమైన జాగ్రత్త వహిస్తారు. తన సహాయంవల్ల గాని, సలహావల్లగాని, అవతల వ్యక్తికి పదివేల రూపాయలు ధర్మబద్ధమైన లాభం కలిగిందనుకోండి. అప్పుడు ఆ వ్యక్తి ట్రస్టుకు సహకరిస్తానని ముచ్చటపడితే ఒక వెయ్యి

త్రిం ఏమరుపాటు గలిగినా కథ అడ్డం తిరుగుతుంది. ఇది మాస్టరుగారు అనుసరిస్తున్న ధర్మసూత్రం. ఆధ్యాత్మిక సంస్థలు సమాజానికి ఆధారమై నిలబడాలి గాని సమాజంపై ఆధారపడే స్థితికి దిగజారకూడ దంటారాయన.

11. ప్ర : మాస్టరుగారిచుట్టూ పెద్దపెద్ద బిజినెస్ మ్యాగ్నెట్లు, లక్షాధికారులు, ఉన్నతాధి కారులు తిరుగుతూ ఉంటారు. ఆధ్యాత్మికతకు వీటికి పొత్తు ఎలా కుదురుతుంది? మాస్టరుగారి సాధనకు ఈ వాతావరణం భంగకరం కాదా? వాళ్లసమస్యలు, వాళ్లగొడవలు ప్రశాంతంగా సాగే ఆయన సాధనకు అడ్డురావా? అయినప్పటికీ మాస్టరుగారు ఇలాంటి వాతావరణాన్ని ఎందుకు ప్రోత్సహిస్తున్నారు.

జ : మాస్టరుగారేకాదు. పూర్వం కృష్ణుడు కూడా ఇలాంటి వాతావరణంలోనే తిరిగాడు. రాజులు, రాజకీయాలు లావాదేవీలు భారతమంతా అవే గదా? కాని కృష్ణుడు లేక పోతే ఏమయ్యే ఉండేది. మనం ఊహించలేం. అతను కావాలని ఆ వాతావరణంలో ప్రవేశించి ధర్మపక్షానికి ఆశ్రయమిచ్చి దుష్టుల్ని శిక్షించి ధర్మాన్ని నిలబెట్టాడు. అసలతని అవతరణకు కారణమే అది. అలాగే మాస్టరుగారు కూడా మీరు చెప్పిన వాతావరణం మధ్య ఉండి ఆ వ్యాపారస్థులలో లక్షాధికారులలో, ఉన్నతాధికారులలో మంచిని మేల్కొలిపి వాళ్ల

జీవితాలను క్రమంగా ధర్మమార్గంవైపు మంచివాళ్ల ద్వారా లోకహితం జరిగేటట్లుగా చూస్తున్నారు. చెడును మంచిగా మార్చడం మంచిదా ? చెడు అని అసహ్యించుకొని తప్పుకోవడం మంచిదా ? అసలు ధర్మసంస్థాపన అంటే ఏమిటి ? సమాజంలో ఎవడెలా నడుచుకోవాలో వాడలా నడుచుకొనేటట్లు చూడటం. అలాచూడాలి అంటే అందరి మధ్యా ఉండాలి. అందరికీ మధ్యవర్తిగా కూడా ఉండాలి. మాస్టరుగారికి సాధన సిద్ధి, కర్తవ్యం అంతా యిదే.

పదిమందిలో నున్నప్పుడు పదిమంది మీదా పది అభిప్రాయాలు మనకు కలిగితే అశాంతిని పొందుతారు. పదిమందిలో ఆత్మదర్శనాన్ని పొందగలిగితే ప్రశాంతి ననుభవిస్తాం. ఈ సృష్టింతా దైవస్వరూపమనియెరిగిన వాడికి, దైవస్వరూపంగా సేవిస్తున్న వాడికి నిరంతరం ఏకాంతస్థితి నిలుస్తుంది. ఏకాంతంగా ఉండడమంటే యిది గాని ఏ కోవెలలోనో, గుహలలోనో దాక్కోవటంగాదు. గుహలలో ఉన్నా మన మనస్సున కభిప్రాయాలున్నప్పుడు మనకు సుఖం ఉండదు. ప్రశాంతి ననుభవించడ‘‘మనేది మన మీద నాధారపడి ఉంటుంది గాని పరిసరాల మీద, పరిస్థితులమీద ఆధారపడి ఉండదు. అయితే కణ్వాదు మొదలైన వారు అరణ్యప్రాంతాల్లో నివసిస్తూ గురుకులాలు నడిపారుగదా అని మీరడగవచ్చు. వాళ్లు మీరు చెప్పినట్లు ప్రశాంతత కోసం పరుగెత్తిన వారుకాదు. తమకు, తమ శిష్యులకు సౌకర్యంగా

ఉంటుంది గనుక ఆ ప్రాంతాల నెన్నుకొని గురుకులాలు నడిపారు. అదిగూడా సమాజం కోసమే గదా? ప్రతి సంవత్సరం గురుకులాలలో చేరేవాళ్లు, విద్య ముగించుకొని వెళ్లేవాళ్లు, ఈ కథంతా కణ్వాదులు సంఘక్షేమం కొరకు నడిపారు గాని తమ కొరకు కాదుగదా! సంఘక్షేమం కొరకే తామున్నామని వారిదర్శనం. అలాగే మాస్టరుగారు కూడా నేటి సంఘక్షేమానికై తనను అందరికీ అందుబాటులో ఉంచుకుంటున్నారు. సంఘక్షేమమే ఆయన తపస్సు అయినపుడు సంఘంలో ఉండక ఇంకెక్కడికి వెళతారు. తనచుట్టూనున్న వారే తన సాధన సామగ్రి అయినపుడు వారినుండి ఎందుకు తప్పించుకొంటారు. ఎక్కడ తన అవసరమో అక్కడ ఉండేవాడు, ఎవరికి తన అవసరమో వారితో ఉండేవాడు ఎక్కడ ఏది లోటో అక్కడ ఆ లోటును పూరించేవాడు. పరిసరాలను పరిస్థితులను కాదనకుండా తన సాన్నిధ్యంచేత తన్మయీకరణం చేసేవాడు నిజమైన ఆధ్యాత్మికుడు.

12. ప్ర : ఈ సంస్థ అంతర్జాతీయ కేంద్రం విశాఖపట్నంలోనే ఏర్పడటంలో ప్రత్యేకత ఏమైనా ఉందా? మనరాష్ట్రంలో అభివృద్ధి చెందిన పట్నాలు చాలా ఉన్నాయి గదా? అక్కడెక్కడా పెట్టకుండా మాస్టరుగారు విశాఖనే ఎందుకు ఎంచుకున్నారు?

జ : మాస్టరుగారు విశాఖను ఎంచుకోలేదు. మాస్టరు

గారినీ, విశాఖపట్నాన్ని కూడా వెనుక పడచేస్తున్న దివ్య ప్రణాళిక ఎంచుకున్నది. మన దేశాలను పరిపాలించడానికి ప్రభుత్వాలను మనం ఏర్పరచు కున్నట్లే ఈ మొత్తం భూగోళాన్ని ఒక కనబడని ప్రభుత్వం పరిపాలిస్తూ ఉంటుంది. మన యింటిలో మన తల్లి దండ్రులతో బాటు పెరిగి పెద్ద యిన మన అన్నలు కూడా ఇంటి బాధ్యతను చూస్తున్న ట్లుగా, దేశ ప్రభుత్వంలో ఒకరి నాయకత్వంలో వివిధ శాఖలను వివిధ వ్యక్తులు నిర్వహిస్తున్నట్లుగా, ఈ సృష్టి మొత్తం ఏ ప్రజ్ఞనుండైతే వెలువడిందో ఆ ప్రజ్ఞ ఆజ్ఞాను సారం పని చేస్తున్న మహానుభావులున్నారు. మన కన్నా ముందు పరిణామంలో ప్రవేశించి ముక్తిని పొంది సిద్ధులై జగత్పితకు చేదోడు వాదోడుగా పని చేస్తున్న వారే పరమ గురువులు. అన్నలు తమ్ముల బాధ్యతలను స్వీకరించినట్లు పరమగురువులు మన బాధ్యతలను స్వీకరించి నడుపుతూ ఉంటారు. అవసరాన్ని బట్టి ఆ జగత్పితగాని, పరమ గురువులు గాని భౌతిక దేహాలు ధరించి మనకు బోధ చేసి మనను సరిదారి లోనికి మళ్లిస్తూ ఉంటారు. మనం రకరకాల పేర్లతో పిలుచు కొంటున్న అవతార పురుషులంతా ఈ మహానుభావుల కూటమిలోని వారే. హిమాలయ పర్వతాలలోని శంబళ, కలాప గ్రామాలు వీరికి నివాస కేంద్రాలు. వారి అను గ్రహం ఉంటే గాని మనకీ గ్రామాల పరిచయం జరుగదు. ప్రపంచంలో ఏమూల ఎవరు ఆధ్యాత్మిక ప్రబోధం చేస్తున్నా అది ఈ పరమ గురువుల నుండి అందుతున్న

వెలుగే. అయితే బోధలలో అక్కడక్కడా ఆవేశాలు, తేడాలు కనబడతా యేమిటని మీరడుగవచ్చు. వర్షం కురిసి నపుడు సముద్రంలో పడితే ఉప్పునీరు అవుతుంది. నదిలో పడితే మంచినీరై ప్రవహిస్తుంది. మురికి కాలువలో పడితే మనకే విధంగానూ ఉపయోగ పడదు. అలాగే వారి అను గ్రహం, బోధ మన పాత్రతను బట్టి మన నుండి ప్రవహి స్తుంటాయి. ఈ సత్యం తెలుసుకొన్నప్పుడు మన మనుకుం టున్న మతాలు, సిద్ధాంతాలు అన్నీ అక్కడ నుండి మన కందినవే నని మనకు తెలుస్తుంది. అలా తెలిసికొన్నప్పుడు మనలో భేదభావాని కిక చోటుండదు.

అలాంటి ప్రణాళికను మాస్టరుగారు పరిపూర్ణంగా దర్శించడం జరిగింది. ఆ ప్రణాళిక ప్రకారమే ఆయన కార్య క్రమాలన్నీ రూపు దిద్దుకొంటూ ఉంటాయి. ఆ ప్రణాళికే మాస్టరుగారి ద్వారా వ్యక్తమౌతూ ఇంత కథా నడుపు తోంది. జరుగుతున్న కథలన్నీ ఈ ప్రణాళికా ప్రభావం చేతనే. అయితే ఈ ప్రణాళికా రహస్యం తెలియడం వల్ల మనకు జరిగే మేలేమిటంటే, ఆ పరమ గురువుల వ్యూహం మన ద్వారా వ్యక్తమౌతున్నప్పుడు మన సంస్కారాలు, ఆవేశాలు, నమ్మకాలు ఆ వ్యూహాని కడ్డు పడకుండా ఉంటాయి.

మాస్టరుగారు ఆ వ్యూహాన్ని భూమిపైన నడపటా నికై దిగివచ్చిన వెలుగు అనిపిస్తుంది. పేరడిగితే కృష్ణమా

చార్య అంటారు గాని అసలెవరో మనకు తెలీదు గదా! తెలుసుకోవాలనుకోవటం కుతూహలం మాత్రమే అవుతుంది. ఆయన చెప్పినట్లు ఆచరిస్తే ఆయన లాగానే మనకూ అన్నీ తెలుస్తాయి. తీగ కదిపితే డొంకంతా కదులుతుందిట! చూశారా మీ ప్రశ్నెంత పని చేసిందో ?

అయితే, మీరడిగిన ప్రశ్నకు సమాధాన మింకా పూర్తి కాలేదు. తెలుగు దేశంలో ముఖ్యంగా విశాఖపట్నం చాలా చిత్రమైనది. ఇక్కడ మనుషులంతా పొడి అన్నం మెతుకుల్లాగా ఉంటారు. మిగతా పట్నాలలోలాగా 'ఇది మా ఊరు" అనుకునే వాళ్లు చాలా తక్కువ. ఏదో కాల క్షేపం చేసేస్తుంటారు. కష్టమొచ్చినా, సుఖమొచ్చినా పలికే వాళ్ళు తక్కువ. ఎవరి తిప్పలు వాళ్ళు పడుతుంటారు. దీనికి కారణం ఈ జనమంతా ఇక్కడివాళ్ళు కారు. జీవనోపాధి కోసం ఎక్కడెక్కడనుండో వచ్చినవాళ్ళు. ఇలాంటి స్థితిలో వీరందరూ ఎవరి బ్రతుకులు వారు కాకుండా ఒకరికొకరుగా బ్రతికే అన్యోన్యత రావాలంటే మాస్టరుగారి లాంటి వాళ్లు ఇక్కడ ఉండి తీరాలని ఆ దివ్య ప్రణాళికా నిర్వాహకులు భావించి ఉండవచ్చు.

విశాఖపట్నం పరిసర ప్రాంతాలలో ముఖ్యంగా కొండ ప్రాంతాలలో వైద్యసహాయం ఏమాత్రం అందడం లేదు. మిగతా రంగాలలో కూడా అంతంత మాత్రంగానే అభివృద్ధి

కనబడుతోంది. ప్రభుత్వం వారు ప్రణాళికలు వేసినా ఆ ప్రణాళికలను సద్వినియోగ పరుచుకోవాలంటే జాతి నైతికంగానూ, మానసికంగానూ కూడా పెరగవలసి ఉంది. లేక పోతే ప్రభుత్వ ప్రణాళికలు బూడిదలో పోసిన పన్నీరే అవుతాయి. కనుక మాస్టరుగారా బాధ్యతను స్వీకరించి ఈ ప్రాంతాన్ని ఉత్తమస్థితిలోనికి పెంచుతున్నారు. ఇలాపెంచడం కోసమని ఆయననిక్కడ ఉంచబడటం జరిగి ఉండవచ్చు.

సీరియస్‌గా నున్న రోగివద్ద ఉండి అహోరాత్రులు ఆ రోగిని కనిపెట్టిచూస్తూ ఒకప్రక్క ఏ భాగవత ప్రకాశమో డిక్టేట్ చేస్తూ మరోప్రక్క మిగతా కేసులవారికి సలహాలిస్తూ అందరినీ అక్కడుండే చూస్తూ ఉంటారు మాస్టరుగారు. అలాగే విశాఖపట్టణ ప్రాంతంలో ఉంటూ మిగిలిన ప్రపంచానికంతటికి తగినరీతిలో సలహాలిస్తూ, సహకరిస్తూ నడిపిస్తున్నారు. అవసరాన్నిబట్టి ఎక్కడ కావాలంటే అక్కడ ఉంటున్నారు. మాస్టరుగారి వంటివారు ఎక్కడ బాగుంటుందో అక్కడ ఉండరు. ఎక్కడ బాగుకావాలో అక్కడ ఉంటారు. పదమూడేళ్లక్రితం గుంటూరులో ఉన్నారు. ఇప్పుడు విశాఖలో ఉంటున్నారు. రాబోయే కాలంలో ఎక్కడ ఉంటారో! ఎక్కడ ఉన్నా మన మాశ్చర్యపడ నక్కర లేదు. శ్రీకృష్ణుని నివాసం తరచుగా మారినట్లుగానే మాస్టరుగారి నివాసం కూడా మారిపోతూ ఉంటుంది.

"అదో ప్రణాళిక - అదే ప్రణాళిక."

13. ప్ర : ట్రస్టు కార్యక్రమాలన్నీ మాస్టరుగారు చెప్పినట్లే జరుగుతూ ఉంటాయికదా! మీ అభిప్రాయాల కేమీ విలువ ఉండదా ?

జ : అభిప్రాయాలు లేని స్థితికి శిక్షణ పొందటానికే మేమాయన దగ్గరకు చేరాము. ఆయననుండి దిగివస్తున్న దివ్య ప్రణాళికకు తెలిసి కాదుగదా, తెలియక కూడా అడ్డు పడ కూడదని మాకోరిక. మన వ్యక్తిత్వాన్ని మనం అట్టిపెట్టు కొన్నంత వరకూ అక్కర లేని అభిప్రాయాల గోల ఉంటుంది. దివ్య స్పర్శలో ఆ వ్యక్తిత్వం కరిగి అస్తిత్వమాత్రమే నిలచిన వేళ నిమిత్తమాత్రంగా నిలబడటమంటే యేమిటో తెలుస్తుంది. మాస్టరుగారు చేస్తున్న నిర్ణయాలు కూడా మీరనుకున్నట్లు ఆయన చేస్తున్నవి కావు. ఆయననుండి వస్తున్నవి. అనంతమైన ఆకాశం నుండి సూర్యునిద్వారా కిరణాలు వ్యక్తమైనట్లు సృష్టిని నడుపుతున్న దివ్యప్రణాళిక నుండి ఆయన ద్వారా నిర్ణయాలు దిగివస్తున్నాయి. సూర్యుని కిరణాలు మనను నిద్ర నుండి లేపి కర్తవ్యాన్ని నిర్వహింప జేస్తున్నట్లు, మాస్టరుగారి నిర్ణయాలు మమ్మల్ని వ్యక్తిత్వం అనే నిద్రనుండి లేపి నిమిత్త మాత్రంగా నిలిపి పనులు జరిపిస్తున్నాయి.

అప్పుడప్పుడూ మానుండి కూడా కొన్నికొన్ని ప్రణా ళికలు వ్యక్తమౌతూ ఉంటాయి. ఆప్రణాళికలలో సరైన ప్రణాళికలను అనగా మన నిమిత్తంగా దిగివచ్చిన దివ్య ప్రణాళికలను మాస్టరుగారు తు. చ. తప్పకుండా అమలు

పరుస్తారు. నిజానికి మనకూ మన శరీర భాగాలకూ ఎలాంటి సంబంధముందో మాస్టరుగారికీ మాస్టరుగారి ననుసరిస్తున్న వారికీ అలాంటి సంబంధమే ఉంది. మనకు గలిగిన సంకల్పాలను మన శరీర సహాయంతో ఎలా ఆచరణలో పెడుతున్నామో మాస్టరుగారినుండి వస్తున్న సంకల్పాలు ఆయన ననుసరిస్తున్న వారిద్వారా అలాగే ఆచరణలోనికి దిగివస్తున్నాయి. మనకు మన శరీరానికి ఏలా భేదంలేదో మాస్టరుగారికీ ఆయన ననుసరిస్తున్న వారికీ అలాగే భేదం లేదు.

14. ప్ర : ట్రస్టు ఛైర్మన్ P.S.S. వర్మ గారు ఎక్కువగా విదేశాల లోనే ఉంటారేమిటి? ఆయన ట్రస్టుకార్య క్రమాలలో శ్రద్ధ పెట్టినట్లు కనబడ దేమిటి?

జ : ట్రస్టు కేంద్రాలు ఇతర దేశాల్లో కూడా ఉన్నాయన్న సంగతి మానం మరచిపో కూడదు. పైగా అవి క్రొత్తగా ఏర్పడినవి. మాస్టరు గారు ఎప్పుడు పడితే అప్పుడు వెళ్లటానికి వీలవదు. గత రెండేళ్ళుగా వాళ్ళెంత వత్తిడి చేస్తున్నా తన ప్రణాళిక ననుసరించి మాస్టరు గారు విదేశ యాత్రకు అంగీకరించడం లేదు. అలాంటి స్థితిలో వర్మగారే వాళ్ళకు గైడ్ అవుతున్నారు.

వర్మగారికి ట్రస్టు కార్యక్రమాలను విస్తృత పరచాలని బాగా కోరిక ఉంది. ఆయన అనుకొన్న గట్టి కార్యాలు జరగాలంటే కొంత ఆర్థిక వనరులు కావాలి. వాటి

సమీకరణకై ఆయన విదేశాలతో ఎగుమతి వ్యాపారం ప్రారంభించారు. మాస్టరుగారు ఆయన సంకల్పానికి హర్షిస్తూ భారతదేశం నుండి ఆహార పదార్థాలెన్నడు ఎగుమతి చేయవద్దనీ, కళలు, ఉపకరణాలకు సంబంధించిన ఎగుమతులు ప్రారంభించమనీ చెప్పారు. ఆహారపదార్థాల ఎగుమతి అవివేకం. మన వాళ్ల నోటి ముందు అన్నం తీసివేయడమే అది. కళలకు, ఉపకరణాలకు సంబంధించిన ఎగుమతితో మన దేశ కీర్తి నలువైపులా వ్యాపిస్తుంది. మనవారి చేవ అందరినీ అలరిస్తుంది. ఇది మాస్టరుగారి అభిప్రాయం. ఈ అభిప్రాయానికి అనుగుణంగా వర్మగారు దీక్షతో కృషి చేస్తున్నారు. అంతర్జాతీయ వ్యాపార రంగంలో ఇప్పుడే నిలదొక్కుకుంటున్నారు. ఆయన ఏం చేస్తున్నా ఆయన ఆలోచనలన్నీ మాస్టరుగారి ప్రణాళికల చుట్టూ నే తిరుగుతుంటాయి. మాస్టరుగారి ఆదర్శాల రూపకల్పనకై అంకితమై కృషి చేస్తున్న వ్యక్తి ఆయన. పొలాన పనిచేస్తున్న అన్నకు తమ్ముడు ఇంటినుండి అన్నం పట్టుకెళ్ళినట్లు ఆయ నక్కడ కృషి చేస్తుంటే మేమిక్కడ సర్దుకు పోతుంటాము.

15. ప్ర : మాస్టరుగారి తరువాత కూడా ఈ సంస్థ ఇలాగే నడుస్తుందంటారా ?

జ : ఇలాగే అనడంలో మీ ఉద్దేశ్యం ఏమిటి? ఈ సంస్థ చేస్తున్న పనినా ? లేక ఈ సంస్థ యొక్క పేరనా ?

"సత్కార్యాచరణ కొనసాగి పోతూనే ఉంటుంది. కాలం జరుగుతూ ఉంటే క్యాలెండర్లు మారుతున్నట్లు సత్కార్యా చరణ కొనసాగుతూ ఉంటే దానిని నిర్వహించే సంస్థలు మాత్రం మారుతూ ఉంటాయి. పని ముఖ్యం గాని సంస్థ ముఖ్యం గాదు. కాని పని జరగడానికి సంస్థగా ఏర్పడడం మాత్రం అవసరం" అంటారు మాస్టరుగారు.

మాస్టరుగారు తన ననుసరిస్తున్న వారిని తనంత వారిగా తీర్చి దిద్దుతున్నారు. "ఒక మంచి పుస్తకం వ్రాయ డానికన్నా ఒక మనిషిని తీర్చి దిద్దడానికే నేనెక్కువ ప్రాముఖ్య మిస్తాను. ఎందువల్లనంటే తీర్చి దిద్ద బడిన మనిషి సజీవమైన గ్రంథ మౌతాడు. నడుస్తున్న వేద మవుతాడు" అంటారు మాస్టరుగారు. శిల్పకారుడు శిల్పాలను రూపు దిద్దినట్లు మాస్టరుగా రెందరెందరినో రూపుదిద్దు తున్నారు. కనుక మాస్టరుగారు ప్రారంభించిన కార్యక్రమం ఆగేది కాదు-సాగేది. మరింత విస్తృతి చెంది లోకానికి వినియోగ పడేది.

అయితే కాలక్రమంలో సంస్థల పేరు మారవచ్చు. అనేక సంస్థలుగా ఏర్పడవచ్చు. గోడుగేదైనా ఆ గోడుగు క్రింద సాగేది మాత్రం ఈ వెలుగే అవుతుంది. సంస్థ లనేవి సౌకర్యం కోసం ఏర్పాటు చేసుకొనేవే గాని మనుషులను నిర్బంధించడం కోసం ఏర్పాటు చేసేవికావు. ఒకే సంస్థగా

సాగినా, విభిన్న సంస్థలుగా రూపొందిన తోటివారి కొరకు పనిచేస్తున్నంత వరకూ మాస్టరుగారి నుండీ, ఆయన దివ్య ప్రణాళిక నుండి శక్తి ప్రసారం అందుతూనే వుంటుంది.

మాస్టరుగారి సంస్థ ఒక కాయ వంటిది. అది పండి పగిలిన వేళ అందులో నుండి వెలువడిన విత్తనాలు వంద లాది వృక్షాలుగా రూపొంద గలవు.

16. ప్ర : ట్రస్టు కార్యక్రమాలలో సభ్యులు కానివారు కూడా పాల్గొనవచ్చా ?

జ : వడ్డించేవారు కాకుండా మిగిలినవారు కూడా భోజ నానికి కూర్చొనవచ్చా అన్నట్లున్నది మీ ప్రశ్న. మిగిలిన వాళ్ళ కొరకే గదా, ఈ వడ్డించే వాళ్లున్నది! వాళ్ళు లేకపోతే ఈ వడ్డించే వాళ్ళ అవసరమే లేదు. అలాగే నేడు లోకానికి కావలసిన సేవ, సందేశం, శిక్షణ అనే పాకాలను మాస్టరు గారు వండుతున్నారు. ఆ పాకాల సువాసనలకు ఆకర్షింప బడినవారు చుట్టూ చేరారు. చేరిన వారికి రుచి చూపించారు. మాస్టరుగారు రుచిచూచి తృప్తిపడి ఊరుకోకుండా వాళ్లు కోరి చేరిన వాళ్ళందరికీ రుచి చూపిస్తున్నారు. ఏ మహానుభావుడు ఎప్పుడు భూమి మీదకు దిగివచ్చినా చేసేపని యిదే. మహాను భావుడు వంటవాడైతే అనుయాయులు వడ్డన వాళ్లవుతారు. వాళ్లు కొంచెం శ్రద్ధ వహించి ఆ మహానుభావుణ్ణి అనుసరింప గలిగితే తరతరాల వారికి ఆ అమృతసందేశాన్ని ఆచరణ

ద్వారా అందించగలుగుతారు. మహానుభావుడు తన చుట్టూ చేరినవారికి తోటివారి తలుపులుతట్టే శిక్షణ నిస్తాడుగాని, తోటివారికి తలుపులుమూసే శిక్షణ నివ్వడు. ఇప్పుడు మనం చూస్తున్న భేదాలు మహనీయులు పెట్టినవి కావు. మహనీయులు శరీరం విడిచిన తరువాత మనం పెట్టుకొన్నవి.

కనుక మాస్టరుగారి శిక్షణలో సభ్యుడికీ, సభ్యుడు కానివాడికీ, శిష్యుడికీ, శిష్యుడు కానివాడికీ ఎలాంటి సంబంధ ముంటుందీ అంటే వడ్డించేవాడికీ భోంచేసేవాడికీ ఉన్న సంబంధముంటుంది. వడ్డించేవాడిని సరిగా వడ్డించమని శిక్షణ నిస్తారు. భోంచేసేవాడిని తృప్తిగా భోంచేయమని ఆశీర్వ దిస్తారు.

కాని మాస్టరుగారి వంటలో ఒక విచిత్రముంది. ఆ భోంచేసిన వాళ్లలో ఎక్కువ మంది వెళ్లిపోలేరు. "మనం కూడా ఈ రుచికరమైన పదార్థాలను మరింత మందికి వడ్డిస్తే బాగుంటుంది"నిపించి వడ్డించే వారుగా మారిపోతారు. మేమంతా అలా అయిన వాళ్ళమే. ఇంకా చెప్పాలంటే మీరంతా అలా కాబోతున్నవారు.

17. ప్ర : "వరల్డు టీచర్ట్రస్ట్ ఆధ్యాత్మిక సంస్థ కదా ! ఇందులో ఎక్కువ మంది యువకులే కనిపిస్తారే ? చూచినా, ఆలోచించినా విచిత్ర మనిపిస్తుంది నాకు. ఇదెలా సాధ్యమయిందంటారు ?

జ : ఆధ్యాత్మికత మనిషికి సంబంధించినది గాని, శరీరానికి సంబంధించినది కాదు. జీవి స్థితికి సంబంధించినది గాని శరీరం వయస్సుకు సంబంధించినది గాదు. ఇంగ్లీషు మాటల్లో చెప్పాలంటే It depends upon the stage but not upon the age. కనుక సేవా కార్యక్రమాల్లో యువకుల్ని చూచి మనం ఆశ్చర్య పడనక్కర లేదు. పురాణ కథలలో ప్రహ్లాదుడు, ధ్రువుడు మొదలైన వాళ్ళు కుర్రవాళ్లే కదా! వాళ్లు పెద్దలకే కనువిప్పు కలిగించారు. ఇప్పుడున్న కుర్రవాళ్ళు కూడా అంతే. బొమ్మ చిన్నదైనా ఊహ పెద్ద దన్నట్లు వయస్సులు చిన్నవైనా పరిణామంలో వీళ్ళ స్థితి పెద్దది. వయస్సు మళ్ళిన గుమాస్తాలున్న ఆఫీసులో వయస్సులో. నున్న కుర్రవాడొకడు ఆఫీసరుగా వచ్చి అందరిచేత మొక్కించుకున్నట్లు ఈ కుఱ్ఱవాళ్ళు కూడా అందరి మెప్పు పొందుతున్నారు.

ఇంతకీ మీ ఉద్దేశ్యం వయస్సు మళ్లితేగాని ఆధ్యాత్మికత అక్కర్లేదనా? రిటైరైపోయిన తరువాత కాలక్షేపం బఠానీ లనుకుంటున్నారా, ఆధ్యాత్మికత అంటే? పోనీ ఆ బఠానీలు కూడా తినలేరు కదా ఆ వయస్సులో! జీవితములో సాధించేదేమైనా ఉంటే వయస్సులో నున్నప్పుడే సాధించాలి. అయినా ఆధ్యాత్మికత అంటే యేమిటి? మనం చేస్తున్న పనులను, చేయగలిగిన పనులను మనకూ, తోటి వారికీ పనికి వచ్చేటట్లుగా చేసి కొనేటందుకు పొందే శిక్షణే

ఆధ్యాత్మికత. "స్వ కర్మతో విశ్వరూపంలో నున్న నన్ను అర్చించమ"ని కదా కృష్ణుడు చెప్పాడు. పనులు చేసే శక్తి సన్నగిల్లిన తరువాత ఆధ్యాత్మికతకు ఓనమాలు దిద్దుదామను కుంటే నీళ్లుపోయిన తరువాత గట్టు వేసినట్లవుతుంది. అందుకే అంటూంటారు మాస్టరుగారు. అలాంటివారిని చూచి "Better luck next time" అని. అంటే ఏమిటో తెలుసా? వచ్చే జన్మలోనైనా చిన్నప్పటినుండి జాగర్త పడరా నాయనా! అని.



ప్ర : మాస్టరుగారు ప్రిస్క్రిప్షన్ విషయంలో గట్టివారే కాని పొటెన్సీ విషయంలో కొంచెం ప్రత్యేకంగా ప్రవర్తిస్తారనీ పెద్ద పెద్ద పొటెన్సీలు ఇచ్చేస్తారనీ వినికిడి. ఇది ఎంతవరకూ నిజమంటారు?.

జ : హోమియోలో సరిగా వైద్యం జరుగుతున్నప్పుడు పొటెన్సీ నిర్ణయం రోగియొక్క వ్యాధికి సంబంధించి ఉంటుంది కాని డాక్టరు యిష్టాయిష్టాలతో సంబంధించి ఉండదు. రోగి ఏ పొటెన్సీలో మందును కోరుతున్నాడో ఆ పొటెన్సీలో యివ్వడం వైద్యుని ధర్మం. రోగి మానసిక వేదనలతో బాధ పడుతున్నప్పుడు చిన్న చిన్న పొటెన్సీలతో బ్రతిమిలాడి లాభం లేదు. వేదనల స్థాయిని బట్టి పొటెన్సీ తప్పకుండా పెరగాలి. ఆ పెంచడానికి దడిస్తే వ్యాధి నయం కాదు. మాస్టరుగారి లాంటి అనుభవజ్ఞులకు తమ దగ్గరకు వచ్చిన రోగి ఏ డ్రగ్ ఏ పొటెన్సీలో వేస్తే ఆరోగ్యవంతుడవుతాడో ఇట్టే బోధ పడుతుంది. అందుకనే ఒక చోట C.M. పొటెన్సీలో వేసే మాస్టరుగారు మరొక చోట సిక్స్ పొటెన్సీలో వ్యాధిని నయం చేస్తుంటారు. "ఈ డాక్టరు 200 పొటెన్సీ మించి వ్రాయడట. ఆ డాక్టరు IM కు క్రిందకు దిగడట" అనే మాటలు వింటుంటాం. ఇంతకీ సత్యమేమిటంటే మందుగాని, పొటెన్సీ గాని రోగికి గాని, డాక్టరుకు గావు. రోగిని బట్టి డాక్టరు పోవాలి గాని డాక్టరుగారి నమ్మకాలకూ, బలహీనతలకూ రోగాలు లొంగవు.

ప్ర : ఈ ప్రాంతంలో చాలామందికి మాస్టరుగారి చేతి చలువ మీద నమ్మకముంది. కాని చాలామందికి ఒకటే భయం. "లక్ష పనులలో ఉంటారు. అవసర మైనపుడల్లా ఈయన దొరకడమెలాగా ?" అని మాస్టరుగారు దొరకడం కష్టమైపోతోందని ఎందరో గోల పెడుతుంటారు. వారి మాటలు వింటుంటే నిజమేననిపిస్తుంది. కాని స్థిత ప్రజ్ఞుడైన మాస్టరుగారు ఒక పద్ధతి లేకుండా ప్రవర్తిస్తారా ? అని లోపల పీకుతుంది. ఆ పద్ధతేమిటో మీరు చెబితే విని తెలుసుకోవాలని ఉంది.

జ : ఇంతకూ మీరెపుడైనా మాస్టరుగారి దగ్గర మందు తీసుకున్నారా ? తీసుకొని ఉంటే మాస్టరుగారి పద్ధతి మీకు కొంత బోధపడి ఉండేది. డిస్పెన్సరీ లోనికి రోగి ప్రవేశించ గానే అతని యెడల తన బాధ్యతను మాస్టరుగారు తమ అనుభవంతో నిర్ణయించుకుంటారు. ఆ నిర్ణయం ప్రకారం ఆ రోగికి అందుతూ ఉంటారు. మనం కోరినపుడు దొరకరు గాని మన కవసర మైనపుడు పిలువ కుండానే ప్రక్కన ఉంటారు. ఒకరోజు అర్ధరాత్రి మేమిద్దరం కలిసి నడిచి వెళుతూ ఉండగా మాస్టరుగారు ఒక యింటి తలుపు కొట్టారు. లోపలకు వెళ్ళి అక్కడ వ్యాధితో బాధపడుతున్న కుర్రవాణ్ణి పరీక్షించి వెంటనే మందు వేశారు. ఇంక భయం లేదు. పడుకుంటాడని చెప్పి బయటకొచ్చారు. నడుస్తూ

నాతో అన్నారు. "ఈ వ్యాధి ప్రమాదకరమైనదని వీళ్ళకు తెలీదు. మనం రావడం ఒక అరగంట ఆలస్యమైతే కుర్రవాడికి చాలా ప్రమాదం జరిగి ఉండేది. ఎప్పుడు ప్రమాదమో, ఎప్పుడు కాదో వాళ్ళకేం తెలుస్తుంది పాపం, మనమే కనిపెట్టి చూసుకొంటూ ఉండాలి" అని.

అందువల్లనే అవసరం లేనప్పుడు అరిచి గీపెట్టినా ఆయన దొరకరు. అవసరమున్నప్పుడు మనం ప్రయత్నించనక్కర లేకుండానే కలుగజేసుకొని చూస్తారు. మాస్టరుగారి దగ్గర విశ్వాసంతో మందు పుచ్చుకొనే వారందరికీ ఈ సత్యం అనుభవమే దూరాన ఉండి చూస్తున్న వాళ్లకు ఇది తెలియడం కష్టం.

ప్ర: మాస్టరుగారి వైద్యం తిరుగులేనిదని విన్నాను. కాని ఆయునకు చిరాకు ఎక్కువట గదా? తరచుగా లెక్కచేయకుండా రోగులను కోప్పడతారట! ఎందుకలా కోప్పడటం?

జ: రెండురోజులు డిస్పెన్సరీలో మాస్టరుగారి పక్కన కూర్చుంటే ఎందుకు కోప్పడతారో, ఎప్పుడు కోప్పడతారో మీకే బోధపడుతుంది. కోపం రెండు రకాలు. ఒకటి: మన మనస్సు బాగుండకో, అనారోగ్యం వల్లనో అనవసరంగా ఇతరుల మీద విరుచుకుపడటం. రెండు: ఇతరులను దారిలో పెట్టడానికి కోపాన్ని ఉపకరణంగా వాడుకోవడం.

ఒక అనుభవం చెబుతాను. నాకు తెలిసిన ఒకతను మాస్టరుగారి దగ్గర వాళ్లమ్మకు మందిప్పిస్తూ ఉండేవాడు. కారణం తెలియదు! మధ్యలో మానివేశాడు, ఆ తరువాత ఒకరోజున రోడ్డుమీద ఎదురైతే అడిగాను. ఎందుకు మానేశావని. అప్పుడతను "మీరేమీ అనుకోకండి. మాస్టారు గొప్పవారే కావచ్చు. నేనూ కాదనను. ఆయన వైద్యం గూడా తిరుగులేనిదే. ఆయన దగ్గర తట్టుకోవడం ఒకటే కష్టం. ఆయన కోపానికి తట్టుకోలేక రావడం విరమించుకున్నాను" అన్నాడు. అప్పుడు నేనడిగాను. ఇంతకీ ఏమని కోప్పడ్డారని అప్పుడతనిలా చెప్పాడు. "ఏదో కారణం చేత అశ్రద్ధ చేసి 15 రోజులు ఆలస్యంగా వెళ్లాను. భయపడుతూనే మాస్టరుగారి చేతికి పుస్తకం ఇచ్చాను. నా భయం నిజమయింది. ఆయన పుస్తకం నా మీదకి విసిరి నువ్వు మానవజన్మ ఎత్తావా? మానవజన్మ ఎత్తిన వాడికి తల్లి ఆరోగ్యం కన్నా ముఖ్యమైనది ఉండదు. నువ్వావిడను బ్రతకనివ్వవు. నాయింటి దగ్గర వదిలి పెట్టేయ్. నేనే ఆవిడను చూచుకుంటాను. నీ కెలాగూ తీరిక లేదు కదా?'' అని కసిరి కొట్టారు అన్నాడు. అప్పుడు వాడితో నేనిలా అన్నాను ''నీవు చెప్పిన సన్నివేశంలో తప్పు నీదేమీ లేదంటావు. మాస్టరుగారిదే నంటావు. నీకన్న నీ తల్లిని గూర్చి ఎక్కువగా పట్టించుకున్న ఆయనది కోపం అంటున్నావు. బాధ్యత గుర్తించమని మందలిస్తే కసరి కొట్టారంటున్నావు. అప్పటికైనా బాధ్యత గుర్తించక తల్లికి మందిప్పించడమే మానేశావు. ఏ పనీ లేకుండా తల్లి దండ్రులను

పట్టించుకోకుండా ఏదో పని ఉన్నట్లు ముఖం పెట్టి తిరుగుతూ కాలక్షేపం చేసేస్తున్నావు. అలా చేయడం తప్పంటే మాస్టరు గారికి కోప మెక్కువని ప్రచారం చేస్తున్నావు. అత నింకేమీ మాట్లాడ లేక తల వంచుకున్నాడు. మాస్టరుగారు కోప్పడే సన్ని వేశాలన్నీ ఇలాగే ఉంటాయి.

మామూలు డాక్టర్లు మన దగ్గర నుండి డబ్బులు తీసి కొని చేయ గలిగినంత చేసి పంపించేస్తారు. ఆ తర్వాత మన కేమైనా బాధ్యత పడరు. మాస్టరు గారలా కాదు. మన మెడల బాధ్యత వహించి మందులిస్తూ ఉండటమే గాక అవసరమైతే మందలిస్తూ మనను దారిలో పెట్టడానికి కృషి చేస్తుంటారు. మనవారికీ, క్రమశిక్షణకు సరిపడదు గనుక, మనలో చాలామందికి బాధ్యతంటే తెలియదు గనుక మాస్టరుగారికి కోప్పడటం తప్పనిసరి అవుతోంది. మనని మనుషులుగా చేయడానికి ఆయన కోపాన్ని సాధనంగా ఉపయోగిస్తున్నారు. ఈ సత్యం ఒక పట్టాన తెలియటం కష్టం. ఆయన చెప్పినట్లు వింటున్న కొద్దీ ఆయన ఎందుకు కోప్పడుతున్నారో మనకు బోధపడుతుంది.

ప్ర : హోమియోలో ఎంతో పరిశీలిస్తే గాని మందు నిర్ణయించడం సాధ్యంకాదు. అట్లాంటిది ఆదివారం నాడు మాస్టరు గారింటి దగ్గర తిరునాళ్ళలా ఉంటుంది. ఇంతమందికీ ఒక్క రోజున వైద్యం చేయడం ఎలా సాధ్యం ? ఇదంతా చూస్తుంటే మాస్టరుగారు కేసు

పూర్తిగా పరిశీలించకుండానే మందు వ్రాసేస్తున్నారేమో ననిపిస్తుంది. సేవ చేయడం మంచిదే గాని అందరికీ న్యాయం చేకూరాలి గదా ?

జ : ఇంతకీ మాస్టరుగారు తొందర తొందరగా కేసులు చూడటం వల్ల శ్రమ తీసుకోకుండా మందులు వ్రాయడం వల్ల ఆయన పరిశీలించకుండా మందు లిచ్చేస్తున్నారని మీరు భ్రమ పడుతున్నారు. శ్రమ లేకుండా వ్రాయడం ఆయన నైపుణ్యాన్ని తెలియజేస్తుంది గాని, నిర్లక్ష్యాన్ని తెలియజేయదు. రోగి యొక్క పరిపూర్ణ బాధ్యతను స్వీకరించే మాస్టరుగారు పరిశీలించకుండా మందు వ్రాస్తారనుకోవడం కేవలం అపోహ.

మాస్టరు గారికి గాని, మాస్టరుగారి దగ్గర సరైన శిక్షణ పొందినవారికి గాని, రోగిని పరీక్షించడం ఒక కళ. రోగిని దూరం నుండి చూస్తూనే దగ్గరకు వచ్చే లోపల అతని లక్షణాలను గమనించగలరు. అతని నడకతీరు, మాట తీరు, మనస్సు తీరులను బట్టి క్షణంలో ఏ తరగతికి చెందుతాడో దర్శించగలరు. ఆ పైన అతని వేదనలను కనుక్కొని తమ దర్శనాన్ని ఖాయ పరచుకొని మందు వ్రాయడం జరుగుతుంది. "వైద్యం అభ్యసించేటప్పుడు శాస్త్రం నిర్వహించేటప్పుడు కళ" అంటారు మాస్టరుగారు. కొద్ది నెలలు ఆయన దగ్గర శిక్షణ పొందితే చాలు రోగుల తరహాలను మనం ఇట్టే పట్టేయవచ్చు.

కొందరు తమ వేదనలను పూర్తిగా చెప్పలేరు. కొందరు వేదనలను మరిచిపోతుంటారు. అలాంటప్పుడు మాస్టరు గారు ఒక్క క్షణం అతనిని స్పృశించి నీకు ఫలానా ఫలానా బాధ లున్నాయా అని అడుగుతారు. "అవును బాబూ! నిజమే బాబూ! సరిగా అవే బాధలు. దేవుడు చెప్పినట్లు చెప్పారు" అని అంటుంటారా రోగులు. "రోగిని ప్రేమతో పరిశీలిస్తున్నప్పుడు అతని శరీరంలో ఎక్కడెక్కడ బాధ లున్నాయో అవి మన శరీరంలో అక్కడక్కడ ప్రతిబింబి స్తాయని, వ్యాధి యొక్క పరిపూర్ణ స్వరూపం అప్పుడు బోధపడుతుంద"ని మాస్టరుగారు చాలా సార్లు చెబుతుం టారు. 'ఈ అవకాశమే లేకపోతే బాధ చెప్పలేని పసి పిల్ల లకు వైద్యమెలా చేయగలం?' అంటారాయన.

ఏదైనా పేషెంటును గూర్చి బోధపడక పోతే ఆయన మొహమాట పడరు." మీ కేసు గూర్చి నా కింకా పూర్తిగా బోధపడ లేదు. రెండు మూడు రోజులు టైమి వ్వండి. ఏం చెయ్యాలో చెబుతాను" అన్న సన్నివేశాలు కూడ నే నెరుగుదును. తన కెంత తెలిసిన డ్రగ్గులయినా అవకాశం ఉన్నప్పుడూ, అవసరం కలిగినప్పుడూ మరల మరల ఆ డ్రగ్గుల గుణ గణాలను చదివించుకొని వినడం నేనెన్నో సార్లు చూచాను. మొత్తం మీద ఏమిటంటే ఇదీ డ్రగ్గని ఆయన సమాధానం పడందే ఆయన ఎవరికీ మందు వేయరు.

ప్ర : అప్పుడప్పుడు కొన్ని కేసులను చివరి స్థితిలో K.G. H. లో చేర్పిస్తూ ఉంటారు కదా! మాస్టరు గారంతటి వారికి ఇలా చేయడం నామర్దా కాదా ?

జ : మాస్టరుగారికి మనిషి ముఖ్యం గాని పరువుప్రతిష్టలు మర్యాదా అమర్యాదలు ముఖ్యం కావు. సామాన్యంగా దేశంలోని అన్ని పెద్దాస్పత్రుల వారు కాదన్న తరువాతనే మాస్టరుగారి దగ్గరకు వస్తుంటాయి కేసులు. అలా వచ్చిన వాటిలో నూటికి తొంభైతొమ్మిది నయమై పోతుంటాయి. ఆ మిగిలిన ఒక్క కేసులో ఆపరేషన్ లాంటిదో, గ్లూకోజు, సెలైన్ ఎక్కించవలసి రావడమో అవసరమైనపుడు ఆయన తనకు తానుగానే పేషెంటును K. G. H. లో జేర్పిస్తారు. మనిషి ఆరోగ్యం మనిషి, బ్రతకటం మాస్టరుగారికి ముఖ్యం గాని ఏ 'పతీ' వల్ల బ్రతికాడన్నది ముఖ్యం కాదు. కాకపోతే ఉన్న విధానాలలో హోమియో విధానం ఎక్కువ ఉపయోగ కరమైనది గనుక ఆయన దీనిని స్వీకరించారు. ఆవశ్యకత కలిగినపుడు మిగతా విధానాల సహాయం పొందడానికి ఆయన కెటువంటి మొహమాటమూ లేదు.

ప్ర : C. V. V. గారు, పరిభాకర శాస్త్రిగారు ప్రార్థన తోనే వ్యాధులు తగ్గించే వారట గదా ? మాస్టరు గారు కూడా అలా చేయక ఈ హోమియో నెం దుకు పట్టుకున్నారు?

జ : మాస్టరుగారు కూడా గుంటూరులో ఉన్నప్పుడు తీర్థమిచ్చి వ్యాధులను ఉపశమింప జేసేవారు ఆ తర్వాత మాస్టరుగారి రెండో అబ్బాయికి ఫిట్స్ రావటం, ఎక్కడా నయం కాకపోవడం జరిగింది. ఆ సమయంలో హోమియోలో ఏమైనా తగ్గే అవకాశం ఉందేమోనని ఆ విధానాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించారు మాస్టరుగారు. ఆ వైద్యసహాయంతోనే అతనికి ఫిట్స్ తగ్గించారు. అప్పటినుండి మాస్టరుగారి హోమియో వైద్యసేవ అనుకోకుండానూ, అప్రయత్నంగానూ ప్రారంభమైంది.

క్రమంగా హోమియో విధానంలో పారం జూచి కొన్ని లక్షలమందికి వ్యాధులనుండి ఉపశమనం కలిగించారు. అంతే గాకుండ తనలాగ ఉపశమనం కలిగించే వైద్యులను వందల మందిని సృష్టించారు. అయినా ఈ మాత్రలు నిమిత్త మాత్రలనీ, వెనుకనున్న దైవశక్తి నిజమైన ఉపశమనాన్ని కలిగిస్తున్నదని మాస్టరుగారు తరచు చెబుతుంటారు. మాస్టరుగారు ఈ విధానాన్ని స్వీకరించడానికి కారాణా లివి.

1. కేవలం ప్రేయరుతో తగ్గిస్తున్నారంటే దైవం యెడల విశ్వాసం లేనివాళ్లు సహాయం పొందడానికి అవకాశముండదు.

2. ఫలానా వారిలా తగ్గిస్తున్నారని ప్రచారం చేసేవారు ఎక్కువవుతారు గాని, వారిలాగా తగ్గించడానికి సిద్ధపడేవారు ఎక్కువమంది ఉండరు.

3. మందులోనున్న రోగనివారక శక్తి కూడా దైవంతో నిక్షిప్తం చేయబడిందే గదా! అలాంటప్పుడు దానిని స్వీకరించడంలో తప్పేమిటి?

4. మానవులపై గల అపారమైన ప్రేమతో హానిమన్ సరైన వైద్య విధానం కొరకు తపస్సు చేశాడు. ఆయన దీక్షకు మెచ్చి సరైన వైద్యవిధానాన్ని ఆయన ద్వారా దైవం లోకానికనుగ్రహించాడు. అలాంటి వైద్య విధానాన్ని మనం స్వీకరించడంలో పెద్దల తపఃఫలాలను ఉపయోగించుకొన్న వాళ్లమవుతున్నాం.

5. ప్రస్తుతం మన దేశంలో ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో వైద్య సౌకర్యాలు మరీ తక్కువగా ఉన్నాయి. ప్రతి సంవత్సరం వైద్య కళాశాలలనుండి బయట కొస్తున్న వైద్యులలో ఎక్కువ మంది బస్తీలలో ఉండటానికే మొగ్గు చూపుతున్నారు. అలోపతీ వైద్య విధానం సమగ్రమైనదీ కాదు, సామాన్యునకు అందుబాటులో ఉండేదీ కాదు. హోమియో విధానం ప్రస్తుతం ప్రచారంలో నున్న వైద్య విధానాలలో శ్రేష్టమైనది, తక్కువ ఖర్చుతో చేయగలిగినది. దీనిని స్వీకరిస్తే వీలైనంతమంది వైద్య సేవకులను తయారు చేయడానికి అవకాశముంటుంది.

ఈ కారణాలచేత హోమియో విధానాన్ని మాస్టరు గారు స్వీకరించారనటంకన్న C. V. V. గారే స్వీకరింప

జేసారనడం సమంజసం. ఎందువల్లనంటే మాస్టరుగారు కోరి డాక్టరు కాలేదు. ఇంటి ఆవశ్యకతలు ఆయనను వైద్యునిగా చేశాయి. దేశ ఆవశ్యకతలు ఆయనను ఘనవైద్యునిగా, ద్రష్టగా, వందలాది శిష్యులకు శిక్షకుడిగా మలచాయి. కనుక ఇది దైవసంకల్పం రూపుకట్టుకోవడంగా మాత్రమే నాకు కనిపిస్తుంది.

పరమగురువులకు మానవులకు మేలుజరగటం ముఖ్యం. ఏ పద్ధతిలో ఆకాలపు ప్రజలకు మేలుజరుగుతుందో ఆ పద్ధతిని వారు ప్రేమతో స్వీకరిస్తారు. ఫలానా పద్ధతి ద్వారానే పని చేయాలనే ఛాదస్తం వారి కుండదు. ఉపకారం జరిగిందా లేదా అన్నది ముఖ్యం గాని, బాధపడుతున్న వాళ్లు తనను దైవస్వరూపం అని తలచారా లేదా, అన్నది వారికి ముఖ్యం కాదు.

ప్ర : మాస్టరు గారిని మన మంతా గురువుగా, దైవంగా పూజిస్తూ ఉంటాం. ఆయన సర్వజ్ఞుడు అని మన విశ్వాసం. కాని డిస్పెన్సరీలో ఉన్నప్పుడు మాస్టరుగారు కేవలం సామాన్య మానవుడిలా ప్రవర్తించడం కనిపిస్తుంది. "ఇంత వరకు నయం కావచ్చు. మన ప్రయత్నం మనం చేద్దాం'' అంటారు తప్ప అభయం పట్టరు. దీనికి కారణం ఏమిటి?

జ : మీ ప్రశ్నకు సమాధానం చాలా సూక్ష్మంగా చెప్పవలసి ఉంది. మొదటగా మాస్టరుగారు తాను మానవా

తీతుడనని ఎప్పుడూ చెప్పలేదు. అలాగని మానవా తీతమైన శక్తులు ఆయన ద్వారా పనిజేయకనూ పోలేదు. ఈ సత్యం బోధ పడాలంటే కృష్ణుడు రాయబారానికి వెళ్ళే ముందు ఘట్టం గుర్తుకు తెచ్చుకోవాలి. అర్జునుడు "మాకు మానవ ప్రయత్నమూ నీవే, దైవ నిర్ణయమూ నీవే గదా" అంటాడు. అప్పుడు కృష్ణుడు "దూతగా వెళుతున్న నాకు ఏమి చెప్పాలో అవి చెప్పండి. దైవంగా నిర్ణయించే టప్పుడు ఈ నేను అక్కడ ఉండను" అంటాడు. అలాగే మాస్టరుగారు వైద్యాన్ని నిర్వహిస్తున్నంత వరకు కేవలం మానవుని గానే ప్రవర్తిస్తారు. ఆ పైన చూడగలిగిన వారికి చూడగలిగినంత కనిపిస్తారు. ఆరోగ్యం తిరిగి పొందడం సాధ్యం కాని కేసు వచ్చినప్పుడు తగ్గి పోతుందని మభ్య పెట్టరు. "మన ప్రయత్నం మనం చేద్దాం ఆ పైన అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది" అంటారు. అలాంటి కేసుల్లో నయమై బ్రతికి బట్ట గట్టిన కేసులు చాలా ఉన్నాయి. అప్పుడు కూడా మాస్టరుగారు ఇది మన ప్రతిభ కాదురా! వాళ్ళ అదృష్టం, ఆపై వాడి అనుగ్రహం అంటుంటారు. చూడ గలిగిన వాడికి క్రింది వాడూ, ఆ పై వాడూ ఆయనలోనే దర్శన మిస్తుంటారు.

సేవకుడు, సాధకుడు ఎలా ఉండాలో మాస్టరుగారు తన ప్రవర్తనలో సూచిస్తున్నారు. సాధకుడు తాను మానవా తీతుణ్ణని భావించి ఇతరులను ఇబ్బందిలో పెట్టి తాను

ఇబ్బందిలో పడగూడదు. ఒక మానవునిగా తానెప్పుడు, ఎంతవరకు ఎలా చేయాలో అలా చేసుకుంటూ పోవాలి. అప్పుడు ఎదుటి వారికి ఏం జరిగినా కర్త తాను కాడు. మంచికి తాను కర్తననుకుంటే చెడుకు గూడా తాను బాధ్యత పడవలసి ఉంటుంది. ఫలానా వ్యక్తికి ఆరోగ్యాన్ని సరిదిద్దానని చెప్పుకొనే వాడు ఫలానా వ్యక్తిని చంపేశానని కూడా ఒప్పుకోవలసి ఉంటుంది. ఇక్కడ తగ్గటానికి గాని అక్కడ తగ్గక పోవటానికి గాని కర్త తాను కాడని తెలుసు కోవాలి. అలాగని జరిగేదెప్పుడూ జరుగుతుంది గదా అని నిర్లక్ష్యం చేసిన వాడు జరిగిన చెడ్డ ఫలితానికి కారణం అవుతున్నాడు. తన బాధ్యత తాను పరిపూర్ణంగా నిర్వహించినపుడు ఏ పనికీ తాను కర్త గాడు, కారణమూ గాడు. ఈ సత్యాన్ని ఆచరణ పూర్వకంగా ఉపదేశిస్తున్నారు మాస్టరు గారు. "ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో, తెలిసికొని అలా చేస్తూ దైవాన్ని ప్రార్థించండి. చెయ్యటం మానేసి దైవాన్ని ప్రార్థించడం సోమరితన మవుతుంది. చేయవలసింది చేయకుండా దేవుడున్నాడులే అనుకోవడం నిర్లక్ష్య మవుతుంది. దైవాన్ని ప్రార్థించడం దేనికోరకో తెలుసా? ఏది ఎప్పుడు ఎలా చేయాలో తెలిసేటందుకు, ఆ తెలిసిన దానిని ఆచరించేటందుకు. నిమిత్త మాత్రంగా చేస్తూ ఫలితాన్ని కోరకుండా ఉండేటందుకు." ఇదీ మాస్టరుగారి ఉపదేశం. "దైవం ఏం చెయ్యాలో మనం చెప్పేటందుకు కాదు ప్రార్థన. మనం ఏం

చెయ్యాలో మనకు తెలిసేటందుకు ప్రార్థన.” అంటారు మాస్టరుగారు.

తాను దైవాంశ అని మాస్టరు గారికి తెలుసు. కాని రోగి కూడా దైవాంశ అని ఆయనెన్నడూ మరిచి పోలేదు. జబ్బు తగ్గిన చోట తాను దైవం మొహం పెట్టి, తగ్గనిచోట రోగి కర్మ పరిపాకం కాలేదనటం అపచారమని ఆయన ఉద్దేశ్యం.

ప్ర : మీరేమీ అనుకోకపోతే ఒక్క-మాట. వైద్యమనేది ఫుల్ టైమ్ జాబ్. దానిలో దిగినవాడు మరి యే యితర పనులలోనూ తలపెట్ట గూడదు. మాస్టరు గారు అన్నిటిలోనూ ఉన్నానంటున్నారు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి అన్న మాట నిజం. అయిన ప్పటికీ వైద్యానికి పరిపూర్ణమైన న్యాయం ఆయన ద్వారా జరుగుతోందంటారా ?

జ : మాస్టరుగారి తత్త్వాన్ని పూర్తిగా అర్థం చేసు కొన్నప్పుడు మాత్రమే మీ రడిగిన ప్రశ్నకు సమాధానం లభిస్తుంది. ఆయన వివిధ రంగాలలో తన సహాయ సహ కారాలు అందిస్తూ ఉండవచ్చు. కాని అన్ని రంగాలకు ఒకే విధమైన ప్రాధాన్యం మాత్రం ఇవ్వరు. దేని తర్వాత ఏది అన్న విచక్షణ ఆయనలో స్పష్టంగా కనబడుతుంది. మద్రాసులో వారం రోజులపాటు మాస్టరుగారి ఉపన్యాసాలు

అక్కడి వారు ఏర్పాటు చేసుకొన్నారనుకోండి. టిక్కెట్లు కూడా రిజర్వ్ సిద్ధంగా ఉన్నాయనుకోండి. రైలు ఎక్కబో తున్న టైంలో సీరియస్ కేసు ఆయన దగ్గరకు వచ్చిందను కోండి. ఆ కేసుకు తానుండవలసిన అవసరం ఉందనుకోండి. అప్పుడాయన వెంటనే రైలుదిగి పేషెంటింటికి వెళ్ళిపోతారు. మద్రాసువాళ్లకు ప్రోగ్రాం వాయిదా పడిందని టెలిగ్రాం యిప్పిస్తారు. ఇలాంటి సన్నివేశాలెన్నో నేనెరుగుదును. రోగుల సేవకు మాస్టరుగారు తన జీవితంలో మొదటి స్థానమిచ్చారు. ఆ రోగార్తులు అవకాశమిచ్చినంత వరకు ఆయన ఇతర కార్య క్రమాలలో పాల్గొంటారు. రోగార్తులనువదిలి మరొక కార్య క్రమానికి – అదెంత పెద్ద దయినా, పెద్దలెందరు ఎదురు చూస్తున్నా ఆయన హాజరు కారు. అందుకే ఆయనతో కార్యక్రమాలు నిర్ణయించుకొనేందుకు కార్యకర్తలు వచ్చి నప్పుడే సూటిగా చెబుతారు మాస్టరుగారు. "నేను రావడం నామీద ఆధారపడి ఉండదు. పేషెంట్సు మీద ఆధారపడి ఉంటుంది. ఒకవేళ నేను రాలేకపోయినా మీరు బాధపడ కూడదు. అవకాశమున్నంతవరకూ తప్పకుండ వస్తాను" అని.

అయితే ఇటీవల సంవత్సరాలలో ఆయన ప్రపంచ వ్యాప్తంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. తన యింటి వద్ద తనంతటి వారిని తయారుచేసి వారు బాధ్యత స్వీకరించిన తరువాత మాస్టరుగారు ఇతర ప్రాంతాలలో కార్యక్రమా లకు ఎక్కువ అవకాశమిచ్చారు. ఇంకొక సత్యమేమిటంటే

ఎక్కడకు వెళ్ళినా రోగార్తులకే ఆయన ప్రాముఖ్య మిస్తారు. ఆ రోగార్తుల సేవకే తన పరిచయాలను సద్వినియోగ పరుస్తారు. మరెన్నిచోట్ల సరైన వైద్యకేంద్రాలు నెలకొల్ప బడడానికే మాస్టరుగారు ప్రపంచ వ్యాప్తంగా కార్యక్రమా లను నిర్వహించడం జరుగుతోంది. ఇప్పుడు చెప్పండి మాస్టరు గారికి వైద్యం పార్టు టైమ్ జాబా! ఫుల్ టైమ్ జాబా! నిజాని కది లైఫ్ టైమ్ జాబ్.

ప్ర : మాస్టరుగారి శిష్యుల్లో కొందరు ప్రేయరుకూ, మందుల నిర్ణయానికీ ముడిపెడుతూ ఉంటారు. అసలీ రెంటికీ సంబంధ మేమిటి ? మామూలుగా వైద్యం చేయవచ్చుగదా ? ప్రేయరుతో ముడి పెట్టడ మెందుకు ?

జ : ఒక వైద్యుడు శాస్త్రాన్ని పుడిసిలి పట్టవచ్చు. అంత మాత్రాన రోగిని పరిశీలిస్తున్నప్పుడు సరైన డ్రగ్గు తట్టా లనిలేదు. క్రమశిక్షణలో కృషిచేస్తే అధ్యయనం జరుగు తుంది. సమయస్ఫూర్తి, బ్యాలెన్స్‌డ్ మైండ్ వల్ల డ్రగ్ తట్టడం జరుగుతుంది. మనం చేసిన అధ్యయనానికీ, డ్రగ్ సెలెక్షన్‌కూ లింక్ కుదిర్చేటందుకే ప్రేయరు. వైద్యుడు సామాన్యుడైతే కేసు సీరియస్ అవుతున్న కొద్దీ అతని మనస్సు కంగారు పడుతుంది. ఆ కంగారులో తాగినవాడు తూలిపడినట్లు మందును నిర్ణయించడంలో పొరపాటుపడే అవకాశముంది. అలాంటి సమయంలో దైవాన్ని గూర్చిన

ప్రార్థన చేస్తే కంగారు తగ్గి మనస్సు నిర్మలమై అద్దంలాగా అవుతుంది. అప్పుడు మనం చేసిన అధ్యయనంలో నుండి సరైన మందు అద్దంలాంటి మనస్సు మీద ప్రతిబింబిస్తుంది. అప్పుడా మందును వేస్తే ఆ రోగి యెడల నిజమైన బాధ్యతను మనం నిర్వహించి నట్లవుతుంది. ఈ సత్యాన్ని మాస్టరుగారి వల్ల ఉపదేశాన్ని పొందినవారు అవసరమైనపుడు మీరు చెప్పిన మార్గాన్ని అనుసరిస్తూ ఉంటారు. మీరు వైద్యం నేర్చుకుంటున్నారు కదా! మందు లీయడం ప్రారంభించిన తరువాత మీకూ ఈ సత్యం తప్పకుండా అనుభవాని కొస్తుంది.

ప్ర : కొన్ని విషయాలలో మాస్టరుగారు హద్దులు ఏర్పాటు చేస్తే బాగుంటుంది. రెండు, మూడు నెలలు మాస్టరుగారి డిస్పెన్సరీలో పాల్గొన్న ప్రతివాడూ నేను డాక్టరునని మందులిచ్చేస్తున్నాడు. ఇదెలా సాధ్యం? ఒక లిమిటేమీ లేకుండ ఆయన యింతమందీ డాక్టరు పే అంటే ఎలా? ఆయన్ని చూచినవాడు, ఆయనతో ఉన్నవాడు, ఆయనమీద అభిమాన మున్నవాడు, అందరూ డాక్టర్లేనా?

జ : మీరు బయటనుండి చూస్తున్నారు కాబట్టి మీరను కున్నట్లు అపోహపడటానికి అవకాశముంది. తన దగ్గర కొచ్చిన వారికి మాస్టరుగారు చిత్రమైన శిక్షణ ఇస్తూ ఉంటారు. నోటితో చెప్పకుండానే ఎవరి దారిలో వారిని నడి

పిస్తుంటారు. మాస్టరుగారి దగ్గర వైద్యమొక్కటే కాదు గదా ఉన్నది. పత్రికలు, పరిశ్రమలు, ప్రెస్సులు మొదలైన వెన్నో ఆయన ననుసరిస్తున్నవారు స్థాపించినవి ఉన్నాయి. మాస్టరుగారి దగ్గర కొచ్చినవారు వాళ్ళ వాళ్ళ సంస్కారాలను బట్టి ఆయా కార్యక్రమాలవైపు ఆకర్షింపబడుతూ ఉంటారు. కొందరు ప్రెస్సుల్లో చేరతారు, కొందరు పత్రికల నిర్వహణలో పాలు పంచుకొంటారు, కొందరు పరిశ్రమల వైపు మొగ్గుతారు. కొందరు మాస్టరుగారి దగ్గర నుండి వారికి అభిరుచి ఉన్న విద్యల్లో తర్ఫీదు పొందుతుంటారు. ఇలా ఎవరి సంస్కారాన్ని బట్టి వారు నడుస్తూ ఉండగా ఆ నడవడంలో సరిగా నడిచేటట్లు మాస్టరుగారు శిక్షణనిస్తూ ఉంటారు.

ఆ వచ్చిన వారిలో వైద్యసేవలో అభిరుచి గల వాళ్ళు దానిచేత ఆకర్షింపబడి డిస్పెన్సరీలో పని చేస్తూ హోమియో క్లాసుల్లో పాల్గొంటూ క్రమంగా మందులిచ్చే స్థితికి ఎదుగుతారు. వాళ్ళు మందులిచ్చే స్థితికి ఎదిగిన తరువాత రోగార్తులు వాళ్ళ దగ్గరకు చేరి మందులు తీసుకుంటూ ఉంటారు. ఒక రోజున వైద్యసేవలో శిక్షణ పొందుతున్న ఒక యువకుణ్ణి పిలిచి "నువ్వు ఇవాల్టి నుండి మందులివ్వటం ప్రారంభించవోయ్!" అన్నారు మాస్టరుగారు. అతను ఇంటికి చేరేటప్పటికి కడుపు నొప్పితో బాధపడుతున్న ఒక స్త్రీ "బాబూ మీరు కూడా మందు లిస్తారట గదా! కాస్త తగ్గించి పుణ్యం కట్టుకోండి" అని అడగటం, అతను మందు

వేయటం, ఆమెకు తగ్గటం అప్పటినుండి అతని వైద్యం ప్రారంభం కావడం జరిగింది. ఇంతకీ చెప్పేదేమిటంటే మాస్టరుగారు ఇస్తున్నది కనబడని క్రమశిక్షణ. ఆయన హద్దుల్లో పెడుతున్నట్లు కనబడరుగాని ఆయన సాన్నిధ్యంలో ఎవరూ హద్దులు దాటలేరు. ఎవరిచేత ఎప్పుడు ఏమి చేయించాలన్నది ఆయన దగ్గర నిర్ణయింపబడి ఉంటుంది. ఎన్నివేల మందికి శిక్షణ నిస్తున్నా ప్రతి ఒక్కరి గురించీ ఇంత శ్రద్ధా తీసుకోవడం జరుగుతుంది. మనం గుర్తు పట్టలేము, లెక్క పెట్టలేము గాని గొర్రెల కాపరికి గొర్రెలన్నీ గుర్తే, గొర్రెలన్నీ లెక్కే. ఏ గొర్రెకు ఏది కావాలో, ఏ గొర్రెను ఎలా చూడాలో ఆ కాపరికి బాగా తెలుసు.

ప్ర : తండ్రి ఆయుర్వేద వైద్యులై యుండగా మాస్టరుగారు కొనసాగించకుండా హోమియోను చేపట్టడానికి గల కారణాలేమిటంటారు ?

జ : ఇంతవరకూ ప్రపంచములో నున్న వైద్యవిధానాలలో పరిపూర్ణమైనది ఆయుర్వేద విధానమని మాస్టరుగారు నొక్కి చెప్పారు. ఆయుర్వేద విధానాన్ని చక్కగా అధ్యయనం చేశారు. రోగినిబట్టి అవసరమనుకున్నప్పుడు ఆ విధానంలో కూడా సలహా యిస్తుంటారు. కాని విశ్వవ్యాప్తంగా ఈ విధానాన్ని చేపట్టక పోవడానికి ముఖ్య కారణాలు :

1. ఆయుర్వేదవైద్యం ఖర్చుతో కూడుకున్నది. సామాన్యుడికి అందుబాటులో ఉండదు. ఉచితంగా సేవ చేయటానికి అవకాశం తక్కువ.

2. ఆయుర్వేద ఔషధాలను శాస్త్రీయంగా తయారు చేసే సంస్థలు తగ్గిపోయాయి. ప్రస్తుతం వ్యాపార సరళిలో డబ్బులకోసం శకక్యార్తితో ఆయుర్వేద ఔషధాలను తయారు చేసేవాళ్ళు పెరిగారు ఈ పరిస్థితులలో ఆయుర్వేదవైద్యం చేయాలంటే మందులన్నీ మనం స్వయంగా తయారు చేసుకుంటే తప్ప సాహసించలేం.

ముఖ్యంగా ఈ రెండు కారణాలవల్ల దీని తరువాత హోమియో విధానాన్ని మాస్టరుగారు స్వీకరించారు. ఆరోగ్యాన్ని చేకూర్చే పద్ధతిలో ఈ రెండు విధానాలకూ సామ్యం ఉండటంవల్ల, హోమియో విధానం సామాన్యులకు అందుబాటులో ఉండటంవల్ల, మాస్టరుగారు దీనిని స్వీకరించడం జరిగింది.

ప్ర : అలోపతి విధానంకన్న హోమియో విధానం మేలైనదన్నారు. ఎలాగ ?

జ : ప్రస్తుతం ప్రచారంలో ఉన్న అల్లోపతి విధానంలో సౌకర్యాలు పెరిగినంతగా వ్యాధి తత్త్వాన్ని దర్శించే విధానం

పెరగలేదు. వ్యాధిని పట్టుకోవడం కోసం భౌతిక శరీరంలో వేటాడుతున్నారు వాళ్లు. శరీరాన్నీ శరీర భాగాలనీ రకరకాలుగా పరీక్ష చేయడంతో వారి విధానం ఆగిపోతుంది. నిజానికి వ్యాధి ఫలితాలు మాత్రమే భౌతిక శరీరం మీద కనబడతాయి. వ్యాధి కారణాలు మనస్సు, దానిపైన కోశాల నుండి పుట్టుకొస్తాయి. మనకు మోకాలి నొప్పి ఉందనుకోండి. నిద్రపోయినపుడు నొప్పి ఉండదు కదా! మెలుకువ రాగానే నొప్పి తయారు. దీన్ని బట్టి నొప్పి మోకాలికా, మనస్సుకా? అన్నది మనం ఊహించవచ్చు. ఇలాగే కారణాలు పై కోశాలలో ఉండగా, క్రింది కోశమైన భౌతిక శరీరంలో అరటిపండు పండితే పైన పెచ్చు రంగు మారినట్లు ఫలితాలు మాత్రం కనబడతాయి. ఈ సత్యంమీద దృష్టి పెట్టి హానిమన్ తపస్సులా కృషిచేసి వ్యాధి యొక్క పరిపూర్ణ స్వరూపాన్ని దర్శించాడు.

శరీరంలోని ప్రాణశక్తి అనుక్షణం అనారోగ్యాలనుండి మనను రక్షించడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. ఆ ప్రాణశక్తి ప్రయత్నిస్తున్నప్పుడు మన మనుభవించేవే వివిధ వేదనలు. ఈ వేదనలను వ్యాధులుగా భ్రమపడి అణచివేయడానికి ప్రయత్నిస్తుంది అలోపతీ విధానం. అలా అణచివేయడం వలన ప్రాణశక్తి మరింత తీవ్రంగా ప్రయత్నించడం, వేదనలు మరింత విజృంభించడం తప్పనిసరి అవుతుంది. అలా కాకుండా ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలకు వైద్యుడు సహకరించ గలిగితే

వ్యాధి త్వరగా నిష్క్రమిస్తుంది. వ్యాధి నిష్క్రమించిన తరువాత వేదనల ప్రసక్తి ఉండదు. అందువలననే హోమియోలో ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలకు సమానమైన ప్రయత్నాలు చేయగలిగిన ద్రవ్యాన్ని ఔషధంగా వినియోగిస్తాం. దీనితో ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలకు బలం పెరిగి, అనారోగ్యం తక్కువ కాలంలో పోగొట్టబడుతుంది. అంటే ముఖ్యమైన తేడా ఏమిటంటే అలోపతీ విధానం ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలను నిరోధిస్తున్నది. హోమియో విధానం ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలకు సహకరిస్తున్నది. నిరోధించడం వల్ల మానవుని శరీరకోశాలు మరింత దెబ్బ తింటాయి. సహకరించడం వల్ల శరీరస్థితి మరింత మెరుగుపడుతుంది. హోమియో విధానంలో కనుగొనబడిన విశిష్టమైన సత్యాలేమిటంటే-

1. మానవుడంటే కేవలం భౌతిక శరీరం మాత్రమే కాదు. లోని సూక్ష్మశరీరాల వ్యక్తస్థితియే భౌతికశరీరం.

2. వ్యాధికారణం లోపలి సూక్ష్మకోశాలలో ఉంటుంది. వ్యాధి ఫలితం భౌతిక శరీరంలో కనబడుతుంది.

3. మనస్సు దాని లక్షణాలు, మనిషి తీరు, ప్రవర్తన, వేదనలు, శరీరంలో వచ్చిన మార్పులు అన్నిటిని కలుపుకొని చూస్తే తప్ప వ్యాధియొక్క నిజస్వరూపం బోధపడదు.

4. ఒక సమయంలో ఒకవ్యక్తికి ఒకే వ్యాధి ఉంటుంది. ఒకే మందు అవసర మౌతుంది.

5. వేదనలు వ్యాధిని సూచించేవే గాని వ్యాధులు కావు.

6. ప్రాణశక్తి మన శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచడానికై నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉంటుంది. ఆ ప్రయత్నా లకు సహకరించడమే డాక్టరు చేయవలసిన పని.

ఇవి హోమియోలోని కొన్ని విశిష్టతలు. పెద్దలు వ్రాసిన హోమియో గ్రంథాలు శ్రద్ధగా చదివినా, అనుభవజ్ఞుల దగ్గర శిక్షణపొందినా మీకీ వైద్యస్వరూపం పూర్తిగా బోధ పడగలదు.

ప్ర: నూతనశక వైద్యవిధానమని (New Era Healing) ఈ మధ్య కొత్త దేదో మాస్టరుగారు ప్రతిపాదించా రని చదివాను. ఏమిటా కథ ?

జ: ప్రస్తుతం ఉన్న వైద్యవిధానాలలో ఏ ఒక్కటీ స్వయంసంపూర్ణం కాదు. అన్ని విధానాలలోనూ మానవునికి ఆరోగ్యాన్ని చేకూర్చేందుకు పనికివచ్చే ప్రయత్నాలు జరి గాయి. ఆ ప్రయత్నాలన్నిటిని ఒకచోట చేర్చి సమన్వ యించితే నూతన శక వైద్యవిధానం రూపు కట్టుకొంటుంది. ఉదాహరణకు ఆయుర్వేద శాస్త్రంలో మానవుడి ఆరోగ్యం చెడకుండా ఉండాలి అంటే ఏ విధంగా ప్రవర్తించాలో దిన

చర్య, ఆహారవిహారాలు ఎలా నడుపుకోవాలో చక్కగా వివరించబడి ఉన్నాయి. హోమియో విధానంలో వ్యాధి ఎక్కడ నుండి ఎలా పుడుతుందో అది నివారణ కావాలంటే ఎలాంటి ప్రయత్నం చేయాలో చక్కగా దర్శించి ఈయబడింది. అలోపతీ విధానంలో వ్యాధిని పరీక్షించే పద్ధతులు, అత్యవసర పరిస్థితిలో తీసుకోవలసిన జాగ్రత్తలు, సర్జరీ మొదలైనవి బాగా అభివృద్ధి చెంది ఉన్నాయి. ఈమూంటినీ ఒకచోట చేర్చుకునకోండి. అప్పుడు లోకానికి మేలు జరుగుతుంది. విధానానికి విధానానికి మధ్య నున్న తడకలు తొలగించి మానవుని కేది శ్రేయస్సో ఆ సమన్వయ మార్గాన్ని మనం సాధించుకోవలసి ఉంది. అన్ని విధానాలలోని మంచిని ఈ విధంగా ఒకచోట చేర్చి నూతనశకి వైద్య విధానాన్ని రూపొందిస్తున్నారు మాస్టరుగారు.

ప్ర : శరీరం అశాశ్వతమైనదని గదా మన సిద్ధాంతం. పరతత్త్వాన్ని బోధించే మాస్టరుగారు శరీరాన్ని నిలబెట్టే వైద్య విధానానికి అంకితమయ్యారు. ఆ పరతత్త్వ బోధకూ ఈయన చేస్తున్న సేవకూ పొత్తు ఎలా కుదురుతుంది?

జ : పరతత్త్వాన్ని బోధించేవారు మానవుల ఆరోగ్యానికై కృషి చేయటం మాస్టరుగారి తోనే ప్రారంభం కాలేదు. బుద్ధుడు తన శిష్యుల కప్పగించిన ప్రధాన సేవా కార్యక్రమం రోగార్తులను సేవించటం! రోగార్తులను

సేవించుట ద్వారా శిష్యులకు సమదృష్టి కలిగేటట్లుగా, విశ్వ ప్రేమ పెరిగేటట్లుగా, జీవితానికి తృప్తి లభించేటట్లుగా జేసి శిష్యులకు ధన్యతను చేకూర్చాడు బుద్ధుడు. ఏసుక్రీస్తు రోగార్తులను చేరదీసి స్వస్థత చేకూర్చాడు. వారి కొరకే తాను వచ్చానన్నాడు.

శరీరం శాశ్వతం కాదన్న మాట సత్యమే కాని శరీరాన్ని నిర్లక్ష్యం చేయడం మాత్రం సబబు కాదు. దీప ముండగానే ఇల్లు చక్కబెట్టుకొన్నట్లు, శరీరముండగానే జీవి దానిని వినియోగించుకొని పరిణామంలో పెరగ వలసి ఉంది. శరీరం జీవి ఎంతగా ఉపయోగించుకుంటే అంతగా ఉపయోగ పడుతుంది. కాబట్టే "జంతూనాం నరజన్మ దుర్లభమ్" అన్నారు ఆది శంకరులు.

జీవి చేయదలచిన సాధనంతా శరీర స్థితిపై ఆధార పడి ఉంటుంది. అలాంటి శరీరాన్ని సరిజేసి అప్పగించడం కన్న నిజమైన సేవ మరొకటి లేదు. పూర్వ కర్మ ప్రాబల్యం వల్ల జీవి తదనుగుణమైన దంపతులకు పుడతాడు. ఆ ప్రాబల్యం చెడ్డదైతే ఆరోగ్యం దెబ్బతిన్న దంపతులకు పుట్టి పుట్టినప్పటినుండి రోగాలతో సతమత మవుతూ ఉంటాడు. నడవలేని పిల్లల్ని, మాటలు సరిగా రాని పిల్లల్ని, మూఢులైన పిల్లల్ని ఎన్నెన్నో జబ్బులతో దినదిన గండంగా బ్రతుకుతున్న పిల్లల్ని మనం చూస్తూనే ఉంటాం. రోగి సిద్ధపడాలే గాని ఆజన్మాంతంగా అతనికి వచ్చిన వ్యాధి తత్వా

లను గూడ కరిగించి సంపూర్ణారోగ్యాన్ని చేకూర్చ గలదు, హోమియో విధానం. తల్లి దండ్రుల రోగ పరిభావాల నుండి బిడ్డలను బయట పడవేసి తర్వాతి తరాలను రక్షి స్తుందీ విధానం. కనుకనే ఆర్తులను, ఆశ్రితులను తీర్చిదిద్దు తున్న మాస్టరుగారు హోమియో విధానాన్ని మహోప కరణంగా స్వీకరించారు.

తన యొక్క దివ్య తేజస్సుతో మానవులను మంచి వైపున కాకర్షిస్తూ ఆనందమయ సహజీవనం లోనికి వారిని మేల్కొలుపుతూ వాళ్లు పూర్తిగా మేలుకొని దివ్య జీవ నానికి సిద్ధపడే లోపున వాళ్ల శరీరాలకు వ్యాధుల నుండి విముక్తిని కలిగించి పరిశుద్ధ పరచి అప్పజెబుతున్నా రాయన. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అని కదా పెద్దల మాట! ధర్మ సాధనకు మూలమైన శరీరాలను సరిజేసి అప్ప జెప్పటం కన్న దైవకార్యం మరేముంటుంది ?

మాస్టరుగారి సేవా ప్రణాళిక మూడు భాగాలు.

1. ఆర్థికంగా ఎవడి కాళ్ళ మీద వాడు నిలబడేటట్లు చూడటం

2. శరీర ఆరోగ్యాన్ని స్థిర పరచి అప్పగించడం

3. ఆర్థికంగా ఆరోగ్యంగా ఉన్న సాధకునికి దివ్య జీవనం లోనికి ప్రవేశాన్ని కల్పించి ముక్త జీవిగా చేసి తోటి వారికి తోడుగా నిలిచే వానిగా మలచడం.

"ఆర్థికంగా ఇబ్బందులు పడుతున్న వారికి, అనా రోగ్యాలతో వేధింప బడుతున్న వారికి, వారి బాధలపై వ్యాధుల పై దృష్టిని పెట్టకుండా వేదాంతాన్ని బోధించడం, వారిని హింసించడమే అవుతుంది." అంటారు మాస్టరుగారు. అందు వల్లనే తోటివారిని ఆర్థికంగా పెంచి, ఆరోగ్యాన్ని యిచ్చి ఆ పైన లోకానికి ఉపయోగపడే వాళ్లుగా తీర్చి దిద్దుతున్నారు మాస్టరుగారు.



ప్ర : మాస్టరుగారు ఉపన్యాసాలిస్తున్నారు. అలాగే పెద్దలు చాలమంది ప్రవచనం చేస్తూ ఉంటారు. సాధనలో ఈ ఉపన్యాసాల కున్న స్థాన మేమిటి?

జ : ఆచరించి చెబుతున్న ఏ మహానుభావుని ఉపన్యాసం ఒకవారం రోజులు వరసగా విన్నా మీకీ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. ఈ ప్రవచనాల సంప్రదాయం ఈ నాటిదిగాదు. వేద వాఙ్మయమంతా ప్రవచనాల రూపంలో విచ్చుకొన్నదే! భారత భాగవతాలు, పురాణాలు ప్రవచనాల రూపంలోనే కొనసాగాయి. సాధకులు అడుగుతూ ఉండడం బోధకులు చెబుతూ ఉండడం వీటన్నిటిలోనూ కనబడుతుంది.

నామట్టుకు నాకు మాస్టరుగారి ప్రవచనం నా దిన చర్యను దివ్యంగా నడిపే పెట్రోలుగా కనబడుతుంది. ఒక్క-రెండు గంటలు ఆ దివ్యశక్తితో నా శరీర కోశాలను నింపుకొని మిగిలిన 22 గంటలూ దినచర్యను లీలగా నడుపుతుంటాను. అలాగే దివ్యజీవనం నిత్యనూతనంగా సాగాలి అంటే పెద్దల ప్రవచనాలు నిత్యమూ వినే అదృష్టం కలగాలి! వారిద్వారా దేవుని సందేశాన్ని వింటూ, వారినుండి దివ్య సాన్నిధ్యాన్ని పొందుతూ ఈ జీవితాన్ని మధురం చేసుకో గలగాలి. ఇదీ మీరడిగిన ప్రశ్నకు అనుభవ పూర్వకమైన నా సమాధానం.

పెట్రోలు లేకపోతే ఎంత కండిషన్‌లో ఉన్న కారైనా నడవడానికి అవకాశం లేనట్లు సద్గ్రంథ పఠనం, సజ్జన సాంగత్యం లేనిదే సాధకుడు దినదినాభివృద్ధి పొందటానికి అంతగా అవకాశం ఉండదు. అందుకే నిజమైన సాధకుడు వాటికోసం తహతహ లాడుతుంటాడు. ఈ సత్యాన్ని దర్శించిన మాస్టరు గారు తానెంత తీరుబడిలేని పనిలో ఉన్నా సాధకుల మేలు కోరి ఆ రెండు గంటలూ దివ్యసందేశాన్ని అందిస్తూ ఉంటారు.

ప్ర : సరిగా ఆరు గంటలకే ఉపన్యాసం ప్రారంభించ డంలో విశేష మేమైనా ఉందంటారా ?

జ : తప్పకుండా ఉంది. ఉపన్యాసమే కాదు. ఏ పనైనా రోజూ ఒకే టైమ్‌కు చేయగలగటం చేతనైతే, జీవితం పాటుగా గాక పాటగా మారుతుంది. మామూలుగా మనం మాట్లాడే మాటలకీ, మనం విని పరవశించే పాటలకీ తేడా ఏమిటి? పాటలలోనూ ఉన్నవి మాటలేగా? కాని ఒక విధమైన లయ, రీతులలో అమరడంవల్ల మధురమైన అనుభూతి నిస్తున్నాయి. మనం మన పనులు నిర్ణీత కాలాలలో జరుపుకోవటం మొదలు పెట్టిన కొద్దీ జీవితం సుఖతర మౌతుంది. కారును తోసుకెళుతున్న వాడికీ, కారును నడుపుకెళుతున్న వాడికీ ఎంత తేడా ఉందో మీకు తెలుసుగా? పద్ధతి ప్రకారం పనులు చేసుకోవటం అలవాటైన కొద్దీ జీవితమనే కారును తోసుకునే స్థితినుండీ నడుపుకొనే స్థితికి మనం పెరుగుతాం.

మరో విచిత్రమైన సత్యం ఏమిటంటే ఏ పనైనా ఒకే

టైమ్‌కు మనం చేయడానికి అలవాటు పడితే ఆ టైమయ్యే టప్పటికల్లా ఆ పనిని నిర్వహింప జేసే ప్రకృతి శక్తులు మనకు సహకరించడానికి సిద్ధంగా ఉంటాయి. ఆ శక్తుల సాయాన్ని పొందుతూ 'ఆహా! పని నిమిషంలో అయిపోయిం'దని మనం ముచ్చట పడుతూ ఉంటాం. అలాగే ఆరు గంటలకు మాస్టరు గారి ఉపన్యాసం అన్నప్పుడు మాస్టరుగారి ద్వారా అచ్చట నున్న సాధకుల లోనికి వ్యాపించడానికి ఎన్నెన్నో దివ్య శక్తులు వేచియుంటాయి. మాస్టరుగారి వాక్కుల రూపంలో, ఉదాహరణల రూపంలో, వివరణల రూపంలో అవి మనలో నికి వ్యాపించి మనను ఉద్ధరిస్తుంటాయి. ఒకే సబ్జెక్టు మీద మాట్లాడినా అక్కడ చేరిన సాధకుల ఆవశ్యకతను బట్టి ఎక్కడికక్కడ మాస్టరుగారి ఉపన్యాసపు తీరు మారుతూ ఉండడం మనకందరకూ అనుభవమే గదా! అందుకనే మాస్టరుగా రెప్పుడూ 'ఉపన్యాసం ఎలా వచ్చిందిరా?' అని అడుగుతుంటారు చిరునవ్వు చిందిస్తూ.

ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే ఒక టైమంటూ ఏర్ప రచుకోవటం వల్ల ఇంతటి ఉపయోగం ఉన్నదీ అని. సినిమా హాలుకు టైమింగ్స్ లేకపోతే ప్రేక్షకులు ఎప్పుడని సినిమాకు వెళతారు? రైళ్ళకు టైమింగ్స్ అనేవి లేకపోతే ప్రయాణీకులు ఎలా బయల్దేర గలుగుతారు? అలాగే మన పనులకూ కాల నిర్ణయం లేకపోతే ప్రకృతి శక్తులు మనకు సహకరించడానికి అవకాశం ఇయ్యనివాళ్ళ మవుతాం. ఈ రహస్యం ప్రకారమే

మాస్టరుగారు తన రొటీనంతా ఏర్పాటు చేసుకొంటారు. మాస్టరుగారింటికి ఉదయం వెళితే డిస్పెన్సరీ జరుగుతూ ఉంటుంది. కొంచెంసేపు ట్యూన్ చేసుకొని అక్కడ నిలబడితే హీలింగ్ పవర్ (వ్యాధి నివారణ శక్తి) ఆ ప్రాంతమంతా నిండినట్లుగా అనుభవమౌతుంది. సాయంత్రం ఉపన్యాసం టైముకు వెళితే జీవులను సేదతీర్చి దరిజేర్చే పరమ గురువుల దివ్య సాన్నిధ్యం అనుభవమౌతుంది. నావికుడు సముద్రంలో నావను నడుపుతున్నట్లు మాస్టరు గారు మన శరీరాలను నావలుగా స్వీకరించి దివ్యసాన్నిధ్యంలో చేరవలసిన గమ్యాలకు జేరుస్తున్నారు. అందు వల్లనే మాస్టరుగారి ఉపన్యాసంలో మనకు కాలం తెలియదు. నిజానికి మన మెంటేగా తెలియడానికి! ఆ రెండు గంటలూ ఆయనే మనందరిలోను, మనందరిగానూ ఉంటున్నారు. మనం అవకాశమిస్తే మిగతా 22 గంటలూ కూడా అలాగే ఉంటారు.

ప్ర: 6 గంటలకే మిగతా కేంద్రాల వారుకూడా ప్రవచనాలు ఏర్పాటు చేసుకోవడంలో ప్రత్యేకత ఏమైనా ఉందంటారా?

జ : ఏర్పాటు చేసుకొని ఉంటే ఈ పాటికి ఆ ప్రత్యేకత మీకే తెలిసి ఉండేది. విజయవాడ రేడియో కేంద్రంలో మంచి సంగీత కచేరి ప్రసారమౌతుం దనుకోండి. మన ఇంట్లో రేడియో ఉందనుకోండి. ఆ టైములో ట్యూన్ చేసుకోవడం వల్ల మనమూ సంగీతాన్ని విని ఆనందించగలుగుతున్నాం.

కదా! అలాగే మనమెంత దూరంలో ఉన్నా ఆరు గంటలకు ప్రార్థనచేసి ప్రవచనం ప్రారంభిస్తే మాస్టరు గారితో మనకు శృతి కుదురుతుంది. ఆ పైన 8 గంటల వరకూ మాస్టరు గారే మననుండి ప్రవహిస్తారు.

ఇంకా కొంచెం ముందుకు అడుగువేసి మాస్టరు గారితో కనెక్షను కుదుర్చుకొని, అంటే మాస్టరు గారికి మనస్సును సమర్పించి దినచర్య నడపటం ప్రారంభిస్తే ఆయన ఆదేశానుసారమే సర్వమూ జరిగిపోతూ ఉంటుంది. ఆయన సందేశం నిరంతరం అందుతూ ఉంటుంది. ఈ సత్యాన్ని గూర్చి వివరిస్తూ మాస్టరుగారు ఒక యథార్థ విషయాన్ని ఉదహరించారు. ఇప్పటికి కొన్ని దశాబ్దాలుగా ఒక పరమ గురువు అనేక దేశాలలో తమతమ కర్తవ్యాలను నిర్వహిస్తున్న తన శిష్యులకు ఏక కాలంలో బోధ చేస్తున్నాడుట. ఆయన తన నివాసంలో ఉండి సందేశాలు ప్రసారం చేస్తూ ఉంటే, ఇన్ని దేశాలలోని శిష్యులూ వాటిని స్వీకరించి పుస్తకాల్లో వ్రాసుకుంటున్నారుట. సంవత్సరానికొకసారి ఈ శిష్యులంతా ఒకచోట చేరి తమ వ్రాతప్రతులను సరిచూచుకొంటారట. ఈ గాథను చెప్పి 'నేనుకూడ స్వీకరిస్తున్న ఆ బృందంలో ఒకణ్ణి' అన్నారు మాస్టారు. అలాగే మనంకూడ మాస్టరుగారితో శ్రుతి కుదుర్చుకుంటే మన కథా మాస్టరు గారు చెప్పిన గాథ లాంటిదే అవుతుంది.

ప్ర॥ లోకంలో ఎన్నో ఉపన్యాసాలు వింటూ ఉంటాం. కాని మాస్టరుగారి ఉపన్యాసాలలో ఒక చెప్పలేని విశిష్టత గోచరిస్తూ ఉంటుంది. మీరైతే ఆ విశిష్టతను గూర్చి వివరంగా చెప్పగలరని మా భావన.

జ : ఎవరైనా ఆ విశిష్టతను గూర్చి చెప్పగలగటం చిత్రమే. అడిగారు కాబట్టి సమాధానం తప్పక వస్తుంది, స్వీకరించండి.

కొందరు ఉపన్యాసాలిస్తారు. వారు ఉపన్యాసాలలో వేదాలు, ఉపనిషత్ శ్లోకాలు, పురాణేతిహాసాల భాగాలు ఇంకా ఎన్నెన్నో తమ ప్రతిభకు తార్కాణంగా వల్లించ చేస్తుంటారు. ఇందులో ఇలా చెప్పారు. అందులో ఇలా చెప్పారు అంటూ వారు కొండవీటి చేంతాడులా పెంచేస్తుంటారు. అలాంటి వారి ఉపన్యాసాలు విని పండితులైతే "గట్టివాడు. బాగా అధ్యయనం చేశాడు." అని సర్టిఫికెట్లు పారేస్తారు. పామరులైతే ఆహా! ఏమా ధార! ఎన్నెన్ని విషయాలు! మన కర్థం చేసుకునే శక్తిలేదు గాని వారు మట్టుకు మహా పండితులు. - అని మెచ్చుకుంటారు. మొత్తంమీద ఈ ఉపన్యాసకుల గమ్యం మెప్పుపొందటంతో ఆగిపోతుంది. వారు నేర్చిన విషయాలు పొగడ్త లందుకోవటానికి పనికొస్తున్నాయి గాని జిజ్ఞాసువులకు దప్పికను తీర్చలేక పోతున్నాయి. సామాన్యులకు మార్గం చూపలేక పోతున్నాయి.

ఇంకొందరుంటారు. తమకు దర్శనమిచ్చిన సత్యాలను సామాన్యులకు కూడా బోధపడేటట్లు సూటిగా, తేటగా, తీయగా, కథలుకథలుగా పసిపిల్లవాడికి తల్లి గోరుముద్దలు తినిపించినట్లు వివరిస్తూ తమలోనికి మనను స్వీకరిస్తారు. ఈ స్థితి లోనున్నవారు చెబుతున్నప్పుడు వారి బోధలో మనకు తెలియని పదం అంటూ ఉండదు. వారు విడమరచి చెబుతున్న అంశాలను అర్థం చేసుకోనటానికి మన మేమీ ప్రయత్నం చేయ నక్కర లేదు. శ్రద్ధగా వింటే చాలు.

మనసు పెట్టి వారి మాటలు వింటుంటే మంచుగడ్డ నీటిలో కరిగిపోయినట్లు మన మనస్సు మనలో కరిగిపోయి మనం విశ్వ చైతన్యంగా వ్యాప్తి చెందుతాం. చూశారా! వారేది చెబుతున్నారో మనమది అయిపోతున్నా మన్నమాట. స్విచ్ వేయగానే లైటు వెలిగినట్లు వారు నోరు విప్పగానే మనం పరవశించిపోతాం. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, రామకృష్ణ పరమహంస మొదలైన వారి బోధలు ఇలాంటివే. మాస్టరుగారీ కోవకు చెందినవారు.

ఆయన తనకు తెలిసినది మనకు చెప్పరు. మనకు తెలియవలసినది మనకు చెబుతారు. అది కూడా మన స్థాయికి తాను దిగివచ్చి తన స్థాయికి మనను కొనిపోతారు. యజ్ఞ వరాహమూర్తి తన కోరలతో ప్రళయ సముద్రా

న్నుండి భూమిని ఉద్ధరించి నిలిపినట్లు మాస్టరుగారు తన వాక్కులతో ఈ సంసార సాగరంనుండి మన నుద్ధరించి నిల బెడుతున్నారు.

ప్ర : మాస్టరుగారి ఉపన్యాసాలలో ఎన్నెన్నో శాస్త్రాల సమన్వయాలు దొర్లిపోతుంటాయి. ఈ భాష, ఆ భాష అన్న ప్రశ్న లేకుండా ఎక్కడెక్కడో మారుమూలల పుస్తకాల లోనివి, వార్తపత్రికల లోనివి కూడ అప్రయత్నంగా ఆయన ఉపన్యాసాలలో అవస రాన్నిబట్టి వచ్చేస్తుంటాయి. ఇదెలా సాధ్యమవు తుంది? మళ్ళీ చూస్తే క్షణం తీరిక ఉండదు ఆయనకి. ఈ పుస్తకాలన్నీ ఎప్పుడు చదివారో! ఎప్పుడు చదువుతారో బోధపడదు. ఇదంతా ఎలాజరుగు తోందంటారు ?

జ : ఒక్క ఉదాహరణ చెబుతాను. ఎలా జరుగు తుందో మీకు బోధ పడుతుంది. మామూలుగా మన మంతా ధరలు ఎక్కువగా ఉన్నా, తక్కువగా ఉన్నా కిమ్మన కుండా సంపాదించుకొని, కొనుక్కొని, వండుకొని తినాలి. తినకపోయినా మనం మాడ వలసిందే గాని ఎవరూ పట్టించుకోరు. అదే దేశ సరిహద్దుల్లో దేశం కోసం పోరాడు తున్న సైనికు డున్నాడనుకోండి. వాడికి తన దేశం గురించే తప్ప తనను గురించి, తన అవసరాల గురించి గుర్తే ఉండదు. కాని ప్రభుత్వంవారు విమానాలలో విలువైన ఆహార

పదార్థాలను తీసుకొని వచ్చి అతనికి అందేటట్లుగా చూచి మరీ క్రింద పడవేస్తున్నారు. మన యింటి మీద పడవేయని విమానం మిలటరీ వాడిని వెతుక్కుంటూ ఎందుకు వెళు తోంది? ఆలోచించండి.

అలాగే తాను పండితుడు కావా లనుకొన్నవాడు ఎంతో కుస్తీ పడితే గాని శాస్త్రాలు లొంగవు. ఆ లొంగ టం కూడా శబ్దార్థాల వరకే. ఆ పైన ఉన్నది వారి కందదు. అలా కాకుండా దీన జనులను సేవిస్తూ, వారి సమస్యలను తీర్చడానికి, సందేహాలు పోగొట్టడానికి, సమన్వయాన్ని అం దించి వారిని సుఖపెట్టడమే జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న వారికి వేదాలు, శాస్త్రాలు, ఒకటేమిటి ఏవి అవసరమైతే అవి తమకు తాముగా వారికి దర్శనమిస్తాయి. ఆ పవిత్ర గ్రంథాల హృదయాన్ని అందించేవారు కూడ వారి దగ్గరకు రూపు కట్టుకొని వస్తారు. మిలటరీ వాడికి కావలసిన సరం జామా వాడు అడగకుండానే వాడి దగ్గరకు చేరినట్లుగా మాస్టరు గారిలాగ పనిచేసేవారికి వారికి కావల్సిన సరం జామా అంతా ప్రకృతే అమర్చిపెడుతుంది. మనం కూడా ఆయనలాగా పనిచేస్తే మనకూడా ఆ అదృష్టం పడుతుంది.

ప్ర : ఈ విచిత్రమేమిటి? మనమేదైనా ప్రశ్నలతో మాస్టరుగారి ఉపన్యాసంలో కూర్చుంటే మన కొరకే చెప్పారా అన్నట్లు ఆ ప్రశ్న లన్నిటికీ సమాధానాలు

వచ్చేస్తాయి. ఇంకా విశేష మేమిటంటే మన జీవి తంలో సన్నివేశాలే ఆయన ఉపన్యాసాలలో ఉదాహరణ లవుతున్నాయి. ఇదెలా జరుగుతుందంటారు ?

జ : మీరీ సన్నివేశం విని ఉంటారు. మాస్టరు C. V. V. గారు యోగాన్ని ఉపదేశిస్తున్న రోజుల్లో ప్రేయరుకి కొంతమంది అల్పాహారం తీసుకొని వచ్చేవారుట. కొంతమంది తీసుకోకుండా వచ్చేవారుట. అల్పాహారం తీసుకోకుండా ప్రేయరులో కూర్చుంటే తననుండి ప్రసారమవుతున్న శక్తిని స్వీకరించడానికి శరీరాలకు సత్తువ చాలదని C. V. V. గారు చెప్పేవారు. కొందరా మాట వినేవారు. కొందరా మాట వినకుండా ఖాదస్తం పోయి ఏమీ తినకుండా వట్టి కడుపులతో వచ్చేవారు. విచిత్ర మేమిటంటే ప్రేయరయి లేచేటప్పటికి బాగా తినివచ్చిన వారికి కరకరా ఆకలయ్యేది. అసలేమీ తినకుండా వచ్చిన వారికి కడుపులు నిండుగా ఉండటమేగాక త్రేన్పులు కూడా వచ్చేవి. ఇంతకూ ఏం జరిగేదంటే ప్రేయరు జరుగుతున్నప్పుడు ఇన్ని దేహాలు ఒక్క దేహంగా వర్తించేవి. ఆ వర్తించడంలో బాగా తిన్నవారిలోనుంచి తినని వారిలోకి ఇడ్లీలు సర్దబడేవి.

అలాగే మాస్టరుగారి ఉపన్యాసంలో కూర్చోగానే మనలో వ్యక్తిగత భేదాలు కరిగిపోయి ఒక సామూహికాత్మ (Group soul) ఏర్పడుతుంది. ఆ సామూహి

కాత్మకు కేంద్రింగానున్న మాస్టరుగారు మననుండి వ్యక్త మవుతున్న ప్రశ్నలకు సమాధానాలిస్తూ, మన జీవిత సన్ని వేశాలే ఉదాహరణలుగా తీసుకొంటూ మనకు పరమా ర్థాన్ని బోధపరుస్తారు.

ఆయన ఉపన్యాసం వినటమంటే మనను మనం అద్దంలో చూచుకొనటమే! అప్పుడు మనలో దిద్దుకోవల్సిన లోపాలేమిటో తెలుస్తాయి. దిద్దుకోవటం ప్రారంభించ డంతో సాధన ప్రారంభమౌతుంది. దిద్దుకోవటం చాత నవుతున్న కొద్దీ యోగ జీవితంలోనికి అడుగు పెడతాం. తల్లి చేతి అన్నం తింటూనే మనకు తెలియకుండా మనం రోజు రోజుకూ పెద్దవాళ్ళ మయినట్లు మాస్టరుగారి ఉప న్యాసాలు వింటూ ఆనంద సామ్రాజ్యం లోనికి అప్రయ త్నంగా ప్రవేశిస్తాం.

ప్ర : మామూలుగా మనం చదివినా, లేదా ఎక్కడైనా ఉపన్యాసాలు విన్నా తెలియని సత్యాలు, అవే పుస్త కాలు మాస్టరుగారు చెబుతున్నప్పుడు మనకు తెలుస్తున్నాయి కదా? అలా ఆయన చెబుతుంటే ఆశ్చర్యమూ కలుగుతుంది. ఆనందమూ లభిస్తుంది. ఇవన్నీ ఈయన ఎక్కడనుండి పట్టుకు వస్తున్నారా? అని.

జ : మనం మామూలు పుస్తకాలు చదివినట్లే భారత భాగవతాల్లాంటి పవిత్ర గ్రంథాలు కూడా చదివేస్తుంటాం.

పిచ్చిగీతలు గీసే పిల్లవాడు తండ్రి పాస్టుహేండ్ పుస్తకాలు చూచి నాన్నగూడా నాలాగే పిచ్చిగీతలు గీస్తున్నా డను కొన్నట్లు, మన సామాన్యదృష్టికి రామాయణ భారతాలు కేవలం ఒకప్పుడు జరిగిన కథలుగానో, కల్పించబడిన కట్టు కథలుగానో కనబడు తున్నాయి. అనుమానాలకు, సందేహా లకు తావిస్తున్నాయి. నిజంగా అవి ఆ మాత్రం పుస్తకాలే అయితే ఇన్ని వేల సంవత్సరాలుగా మానవ జాతిచే ఎందుకు ఆరాధింపబడతాయి? మానవునికి కావల్సిన పరమార్థాన్ని ఒకప్పుడు జరిగిన కథలతో జోడించి మన కిచ్చారు వాల్మీకి, వ్యాసులు. పేర్లు తేడాగాని ఆ కథలు ఎప్పుడూ జరుగుతూ ఉండేవే అని మనకూ తెలుసు.

ఇలాంటి గ్రంథాలు చదువు కొనేటప్పుడు మనం వాటికన్నా వేరుగా ఉండి చదువుకో గూడదు. ఆ గ్రంథా లకు మనను మనం సమర్పణ చేసికొని, వాటిలోనికి ప్రవే శించి వాటి నిజస్వరూపాన్ని దర్శనం పొందాలి. రైలు కన్నా వేరుగా ఉన్నవాడు రైలు ప్రయాణ మెలా చేయ గలడు? రైలు ప్రయాణం చేయాలి అంటే రైలు లోనికి ప్రవేశించాలి.

మనమంతా ఆ గ్రంథాలను చూస్తున్నాం. మాస్టరు గారు గ్రంథాలలోనికి ప్రవేశించి వాటిలోనుండి మనను చూస్తూ ప్రబోధిస్తున్నారు. మన యిల్లు పాడు చెయ్యరు అన్న నమ్మకం మన కెవరిమీద ఉంటుందో వారికి మన

యింటి తాళాలు ఇస్తుంటాముగదా! అలాగే ఈము గ్రంథాలను ఎవరు లోకహితానికి వినియోగిస్తుంటారో వారికి వ్యాసాదిమహర్షులు ఆ గ్రంథాలకు తెరచి చూచే తాళం చెవులను అందిస్తారు. మనం చూచే భారత భాగవతాలు తాళాలు వేయబడిన యిళ్ళు. మాస్టరుగారికి అవి తలుపులు తీయబడిన కోవెలలు. ఆ కోవెలల లోపల దర్శన మిచ్చేదే పరమార్థం. ఆ దివ్యదర్శనాన్నే మాస్టరుగారు మనకూ అందిస్తున్నారు.

ప్ర : మాస్టరుగారి ఉపన్యాసాలలో పాల్గొన్న వారికి వ్యాధులు తొలగుతాయని, సమస్యలు సర్దుకుంటాయని అంటారు. నిజమేనా? నిజమేనని నాకూ అనిపిస్తోంది. కాని అదెలా జరుగుతోందో మీరు చెప్పాలి.

జ : సూర్యుని కాంతికి పద్మం విచ్చుకుంటోంది. చూస్తున్నాం కదా! ఆ విచ్చుకునేటప్పుడు పద్మం మొత్తం విచ్చుకుంటుందిగాని ఒక రేకో, రెండు రేకులో విచ్చుకోవటం అంటూ ఉండదు. అలాగే మహానుభావుల సాన్నిధ్యంలో కూర్చున్నప్పుడు కేవలం వ్యాధులు తొలగటమో బాధలు పోవటమో గాక సంపూర్ణమైన ఉద్ధరణ జరుగుతుంది. నిజంగా వారి ప్రసంగాలను చెవియొగ్గి విని, వారి సందేశాన్ని హృదయంతో స్వీకరించి నిత్య జీవితంలో అమలు పరచటం మొదలు పెడితే మనలో చెప్పలేనంత మార్పు వస్తుంది.

మన పూర్వకర్మ పట్టునుండి మనం సడలింప బడతాం. అంటే మన స్వభావం శాసించిన ప్రకారం పోకుండా మాస్టరుగారి సందేశం ప్రకారం మన స్వభావాన్ని మలచుకోవడం ప్రారంభిస్తాం. క్రమంగా మన ఊహాలన్నీ క్రియారూపం ధరిస్తాయి. పనులు మనద్వారా జరుగుతున్నాయే గాని, మనవలన జరగటం లేదని తెలిసి, క్రమంగా మన ప్రణాళిక విస్తృతమై లోకానికి వినియోగ పడుతుంది. శరీరంలోని కోశాలన్నీ సరిదిద్దబడడంతో వ్యాధులు మరి ఉండవు. మనస్సు నిర్మల స్థితి పొందడంతో బాధలు, సమస్యలు మరి కనబడవు.

మనం నిజంగా సిద్ధపడాలేగాని, మామూలుగా వంద జన్మలు పట్టే ప్రణాళికను మహానుభావుల సాన్నిధ్యంతో ఈ జన్మలోనే అవలీలగా నిర్వహించవచ్చు. వారి సందేశం గాని సాన్నిధ్యంగాని గంగా ప్రవాహం లాంటిది. పాత్రను బట్టి జలం లభించినట్లు మన పాత్రతనుబట్టి వారి సందేశం మనకు ఉపయోగపడుతుంది.

ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే తమ సాన్నిధ్యంలోనికొచ్చి సందేశాలను స్వీకరిస్తున్న వారిని మహానుభావులు ఎంతవరకూ అవకాశమిస్తే అంతవరకూ పెంచగలరు. అవకాశ మిచ్చినకొద్దీ సారథులై నడిపించగలరు.

ప్ర : మాస్టరుగారి ఉపన్యాసం వింటున్నంతసేపూ ఎంతో హాయిగా ఉంటుంది. కాలం తెలియదు. మళ్ళీ ఆ తరువాత మాస్టరుగారేమి చెప్పారని ఎవరైనా అడిగితే వివరించి చెప్పడం సాధ్యం కాదు. ఏ స్నేహితులతోనో మాట్లాడుతున్నప్పుడు మాస్టరుగారు చెప్పిన అంశాలన్నీ అప్రియత్నంగా వచ్చేస్తుంటాయి. ఇదంతా ఏమిటి ? మాయా? ఆయనదగ్గర కొన్నిశక్తులున్నాయనీ, ఆయన ఆ శక్తులతో ఉపన్యాసం జరుగుతున్నంతసేపూ మనను హిప్నొటైజ్ చేసి ఒళ్ళు తెలియకుండా చేస్తారనీ అంటారు కొందరు. ఇంతకీ నిజంగా జరిగేదేమిటి ? వివరించి చెప్పండి.

జ : అసలు జరుగుతున్నదేమిటో చెబుతాను. నిదానించి వినండి. మాస్టరుగారి ఉపన్యాసానికి వెళ్ళి కూర్చునేటంతవరకు మనం మామూలునే ఉంటాం. ఉపన్యాసం ప్రారంభం కాగానే ఇంద్రియాల ద్వారా విహరిస్తున్న మనస్సు విహరించడం మాని మాస్టరుగారిని వినడం మొదలు పెడుతుంది. వింటూ వింటూ కృష్ణుని వేణుగానానికి గోపికలు పరవశించినట్లు పరవశించి మనలోనికి కరిగిపోతుంది. అప్పుడు మనస్సు స్థానంలో కూడా మనమే ఉంటాం. రెండు గంటలూ మాస్టరుగారి ఉపన్యాసం వింటాం. మళ్ళీ "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం..." అని ఉపన్యాసం ముగించేటప్పటికల్లా మనలోనికి కరిగిపోయిన మన మనస్సు మళ్ళీ

మామూలుగా వ్యక్తమై ఇంద్రియాలద్వారా విహరించడం ప్రారంభిస్తుంది. అప్పు డెవరైనా మాస్టరు గారేం చెప్పారని అడిగితే చెప్పడానికి మనస్సు ప్రయత్నిస్తుందిగాని చెప్ప లేదు. అసలు తానుంటేకదా? కరిగి పోయిన తాను ఉపన్యా సాన్ని ఏమని వివరించగలదు? అందుకే ఉపన్యాసం ఏం చెప్పారంటే "వివరించి చెప్పడం కష్టమండీ! మీరు వింటే మీకూ తెలుస్తుంది, ఆ అనుభూతి. విని ఆనందించ వలసిందే గాని తిరిగి చెప్పడం ఎవరి తరం కాదు" అంటూంటాము.

అయితే ఏ స్నేహితులతోనో మాట్లాడు తున్నప్పుడు మాస్టరుగారి సందేశాలు అప్రయత్నంగా వచ్చేస్తాయి. నిజమే! అంతలవ్యక్తి అవసరంలో ఉన్నప్పుడు అతని సమా ధాన పరచడం కోసం మన మనస్సు మనను ఆశ్రయించడం జరుగుతుంది. అప్పుడు మననుండి మాస్టరుగారి సందేశం మనస్సు ద్వారా వ్యక్త మౌతుంది. కిటికీ తలుపు తెరిస్తే ఇంటిలోకి ఎండ పడినట్లు మనస్సు అవకాశమిస్తే మనలో నిండిన మాస్టరుగారు తప్పక వ్యక్తమవుతారు. ఇది మాస్టరు గారు చేస్తున్న యోగమాయ. రెండు గంటలు విని, తరు వాత మన పనులలోనికి దిగబడి పోకుండా మన పనులుగా నున్నవి కూడా భగవంతుని స్వరూపమే యని దర్శించడం మొదలు పెడితే మాస్టరుగారే స్థాయినుండి మాట్లాడు తున్నారో ఆ స్థాయికి మనమూ చేరుకుంటాం. మాస్టరుగారు ఏ స్థితిలోనుండి లీలగా దినచర్య నడపుతున్నారో మనమూ

ఆ స్థితిలోనుండి దినచర్యను క్రీపగా నడుపగలం. అట్టాంటి పరిపూర్ణత మనకు సిద్ధించేటందుకే మాష్టరుగారు మనకు శిక్షణ నిస్తున్నారు.



ప్ర : సి. వి. వి. గారు తమ శిష్యులకు తమ ప్రేయరు చేసుకొంటే చాలునని చెప్పారు గదా! ఆ మార్గా న్ననుసరించే వారంతా అలాగే చేసుకుంటున్నారు కదా! మరి మాస్టరు E. K. గారు ఆ ప్రేయరుకు పూజా విధానాన్ని ఎందుకు జోడించినట్లు ?

జ : సి. వి. వి. గారు తన నామాన్ని ఉచ్చరించి మనస్సు సమర్పణ చేసుకుంటే చాలునని చెప్పినమాట నిజమే. వారి సమయంలోనే ఈ మాటకు తృప్తి పడక రక రకాల కోర్కెలు వారిచేత చెప్పించుకొని ప్రేయరుతో పాటు చేసికొనే శిష్యు లుండేవారు. బ్రహ్మవిద్యకు మార్గం సులువుగా ఉంటుందంటే నమ్మబుద్ధి కాదు కదా! రాను రాను శిష్య కోటిలో ఒక అక్కరలేని భావం కలిగింది. వైదికమైన విధా నం కన్నా మాస్టరు C. V. V. గారి మార్గం విభిన్నమైన దనీ, విమాత్నమైనదనీ వారు భావించసాగారు. దీనితో మిగిలిన ప్రపంచానికి వారు తలుపులు మూశారు. తమ ఆధి క్యాన్ని ఊహించుకొంటూ కాలం గడుస్తున్న కొద్దీ ఒంటరి వారైపోసాగారు. పూజలో C. V. V. గారి ఫోటోకన్న ఇంకే ఫోటోలు ఉండకూడదని భావించారు. C. V. V. గారి మార్గానికి నూతనయోగ మని పేరు పెట్టి ఆయన నేదో పైకి తీసుకు వస్తున్నా మనుకున్నారు.

నిజానికి యోగమార్గం ఎప్పుడూ ఒక్కటే. దేశ కాలాలను బట్టి అదే యోగమార్గాన్ని ఆనాటి వారికి బోధ పడేట్లుగా పరమ గురువులు ఇస్తూ ఉంటారు. బోధనా విధానంలో కొద్దిగా మార్పు కనబడినందువల్ల, బోధనా భాష మారినందువల్ల అదేదో కొత్తమార్గమని భ్రమపడుతూ ఉంటాం. సి. వి. వి. గారు కూడా సనాతన యోగ మార్గాన్నే మన కాలాని కనుగుణంగా మలచి మరోసారి ఉపదేశించారు. ఈ సత్యాన్ని గమనించక దీనికి మనం కొత్త యోగమని పేరు పెట్టుకొన్నాం. యోగానికి మనం కొత్తవాళ్ళము కావచ్చు గాని యోగమార్గ మెప్పుడూ సనాతన మైనదే. యోగమంటే ఏకత్వ మనికదా, అర్థం! ఒకటికన్న ఎక్కువ యోగాలు ఉన్నాయనుకోవటం పరిహాసాస్పదమైన విషయం.

సి. వి. వి. గారు తమ శిష్యులు ప్రక్కదారి తొక్కడం చూచారు. సనాతన మార్గం కన్న తన మార్గం వేరు కాదని తెలియజేయడానికి ప్రత్యేకంగా మాస్టరుగారి నెన్నుకొని మాస్టరుగారి ద్వారా సమన్వయ మార్గాన్ని ఉపదేశిస్తున్నారు. ప్రేయరుతో బాటు షోడశోపచార పూజా విధానాన్ని కలిపి అందరకూ తృప్తి కలిగే మార్గాన్ని మాస్టరుగారిస్తున్నారు. పూజలో మాస్టరు సి. వి. వి.

నామాన్ని ఉచ్చరించి మనస్సు నాయనకు సమర్పణ చేసి కొని ఆయననుండి శక్తి ప్రసారాన్ని పొంది పురుష సూక్తం శ్రీసూక్తాలతో దైవాన్ని ఆవాహనం చేస్తాం. లక్ష్మి అష్టో త్తరం, కృష్ణాష్టోత్తరం, నారాయణ కవచాలతో నోరారా కీర్తిస్తాం. షోడశోపచార విధానంలో ఈ పూజ సాగు తుంది. మాస్టరుగారి నామాన్ని ఉచ్చరించి పూజ మొదలు పెడుతున్నామంటే అర్థమేమిటో తెలుసా? "ఓ మహాను భావా! సనాతనమూ, శాశ్వతమూ అయిన నీ మార్గం లోనికి నీవే మమ్ములను మేల్కొలిపావు. ఇకపై నీవే మమ్ము లను నడిపించి పరిపూర్ణులను చేయవలసినది. ఈ స్తోత్రము లలో వర్ణింపబడిన పరతత్వమే నీ రూపుతో మాకు సాక్షా త్కరించినది. స్తుతులను గైకొని మమ్ములను ఆశీర్వదించు" అని.

అనాదిగా ఆచరింప బడుతున్న ఈ పూజా విధా నంలో చక్కని సాధన ఒకటి యిమిడి ఉంది. మనస్సుతో దైవాన్ని అనుభవిస్తున్నాం. నోటితో దైవాన్ని కీర్తిస్తు న్నాం. చేతితో ఆ దైవాన్నే పూజిస్తున్నాం అంటే, మనో వాక్కాయ కర్మలతో ఒకే దైవాన్ని అర్చిస్తున్నా మన్న మాట. త్రికరణ శుద్ధి మనకు అప్రయత్నంగా సిద్ధిస్తున్న దన్నమాట. సమర్పణ బుద్ధితో ఈ పూజా విధానాన్ని అవలంబిస్తే జీవిత మంతా త్రికరణశుద్ధి మనలో నిలబడుతుంది.

ఈ విధంగా పూజా విధానం వల్ల అనేకమైన ఉప యోగాలు మనకు ఆచరించిన కొద్దీ అనుభవాని కొస్తాయి. పూజా విధానంలో ఒక చక్కటి పరిణాళిక ఉంది. దాని ననుసరిస్తే మన జీవితం కూడా పరిణాళికా బద్ధమై సార్థక మౌతుంది. ముఖ్యంగా మనం పూజలో దాదాపు గంట కూర్చుంటున్నాం. మాస్టరుగారు మనను సరిదిద్దడానికి, తీర్చి దిద్దడానికి సరైన వాతావరణాన్ని సృష్టించుకొని అవకాశ మిచ్చినవాళ్ళ మవుతున్నాం. ఇన్నిటిని దృష్టిలో పెట్టుకొని ప్రేమతో పూజా విధానాన్ని జత కూర్చారు మాస్టరుగారు.

ప్ర : మాస్టరుగారు వైష్ణవ సంప్రదాయానికి చెందినవారు గదా! మధ్యలో ఈ C. V. V., ఈ హుంకారవిడి యేమిటి? సలక్షణమైన మార్గమున్నది కదా! ఇవన్నీ ఎందుకు?

జ : మీరడిగారు కాబట్టి చెబుతున్నాను. సమాధానా నికి మీరు బాధ పడకూడదు. మాస్టరుగారి అనుభవంలో విష్ణుమూర్తి, రామానుజులు, మాస్టరు సి. వి. వి. అనేవి ఒకే దైవానికి పెట్టుకొన్న పేర్లు. విష్ణువంటే సర్వ వ్యాపి యని మరచి, విశ్వప్రేమ నుండి దూరమై మానవులు అక్కరలేని అడ్డుగోడలు పెట్టుకొని ఆవేదన ననుభవిస్తున్న రోజులలో రామానుజులు దిగివచ్చి, భేదాలు తొలగించి, గోపురమెక్కి కులమత భేదాలు పాటించకుండా అష్టాక్షరీ మంత్రాన్ని.

సామూహికంగా ఉపదేశించారు. హరిజనులను కూడా తన అనుంగు శిష్యులుగా స్వీకరించారు. సహపంక్తి భోజనా లతో సమత్వాన్ని నెలకొల్పారు. అర్హత ఉన్నవారికే మంత్రమని కాకుండ అడిగిన వారికల్లా మంత్రమిచ్చారు. విశ్వరూపంగా నున్న విష్ణువును సేవించి తరించ మన్నారు. ఇది రామానుజులు స్థాపించిన సంప్రదాయం. ఆ సంప్ర దాయం పేరిట ఇప్పుడు మనమంతా ఎలా ఉన్నామో మీకు బాగా తెలుసు.

వేరు వేరుగా మీరు చూడకుండా ఉంటే రామాను జుల చేసినదే మరొక్కసారి మాస్టరు సి. వి. వి. చేశారు. మాస్టరుగారిని స్వీకరించి నిజమైన విశ్వ ప్రేమ సంప్ర దాయాన్ని లోకమంతా వ్యాప్తి చేయిస్తున్నారు. రామాను జుల పేరిట మన మతాన్ని మనం పెట్టుకొన్నాం గనుక ఆయన ఆ పేరు మార్చుకొని మాస్టరు సి. వి. వి. గా దిగివచ్చి మాస్టరుగారిని స్వీకరించి యుండవచ్చు. మీరు కొంచెం విశాల హృదయంతో ఆలోచించక పోతే ఈ సత్యాలన్నీ మీకు ఇబ్బందిని కలిగిస్తాయి. విశాల హృదయంతో స్వీక రిస్తే రామానుజ దర్శనం లభిస్తుంది.

ప్ర : మాస్టరుగారు బ్రాహ్మణత్వాన్ని భ్రష్టు పట్టిస్తు న్నారు. లేకపోతే వాడూ వీడూ అనకుండా, కుడీ ఎడమా పాటించకుండా ఎవడికి పడితే వాడికి వేదాలు నేర్పడమేనా?

జ: అన్ని కులాల వాళ్ళకీ మాస్టరు గారు వేదాలు నేర్పుతున్నారనేగా మీ బాధ! అంటే, మీరు కులాలు వర్ణాలు ఒక్కటేనని భ్రమ పడుతున్నారు. వర్ణం అనేది జన్మను బట్టి కాక స్వభావాన్ని బట్టి, ఆ వ్యక్తి చేయగలిగిన కర్మను బట్టి నిర్ణయ మౌతుందని వేదాలు, భగవద్గీత, పురాణాలు అన్నీ చెబుతున్నాయి. దీన్ని బట్టి ఆ వ్యక్తి ఏ కులంలో పుట్టినా వేదమంటే ఇష్టపడినప్పుడు, వేదాన్ని కావాలని కోరినప్పుడు, వేద మార్గాని కంకిత మైనప్పుడు బ్రాహ్మణుడే అవుతున్నాడు. రాజర్షియైన విశ్వామిత్రుడు సాధన చేసి బ్రహ్మర్షియై అందరకూ శిరోధార్యమైన గాయత్రీ మహామంత్రాన్ని దర్శించి ఉపదేశించాడు గదా!

సంప్రదాయం తెలిసిన వారు మాస్టరుగా రనుసరిస్తున్న మార్గాన్ని తప్పు బట్టరు. తా మనుకున్న దే సంప్రదాయమని భావించిన వారికి మాస్టరుగారి మార్గం కంటగింపుగానే ఉంటుంది. అయినా ఇదేమీ క్రొత్తది గాదు. అనాదిగా అవతార పురుషులంతా అవలంబిస్తున్న మార్గమే. రాముడు, కృష్ణుడు, శంకరులు, రామానుజులు మొదలైన వారందరూ ఆశ్రయించిన వారందరినీ సమదృష్టితో తరింప జేసిన వారే. వేదం తన నుచ్చరించిన వాణ్ణి పవిత్రం చేస్తుంది గాని, తన నుచ్చరించినంత మాత్రాన మైల పడేది వేదమెలా అవుతుంది? మన సంకుచిత దృష్టితో వేదమార్గాన్ని చూడడం అంతమంచిది కాదు.

ప్ర : మాస్టరుగారు స్త్రీల చేత కూడా 'గాయత్రి'ని చేయిస్తున్నారు. ఇలా చేయించ వచ్చునా ?

జ : మీ యెదురుగుండా నున్న గాయత్రి చిత్రపటంలో నున్నది స్త్రీ మూర్తి చిత్రమే గదా! ప్రతి స్త్రీ మూర్తిని గాయత్రిగా ధ్యానం చేయవలసిన మనం, స్త్రీలు గాయత్రిని చేయగూడ దనడం అవివేకం కాదా ? సృష్టికి మూలం ప్రకృతి పురుషులు. అవే మనలో స్త్రీ పురుష భేదాలుగా సృష్టికార్యం నడవడం కోసం ఏర్పడ్డాయి. సంతతి దిగి రావడానికి సౌకర్యార్థమై ఏర్పడిన తేడాలే గాని మూల తత్త్వం ఒక్కటే గదా! ఈ సత్యాన్ని దర్శించిన వారు కాబట్టే కొన్ని ప్రత్యేకమైన ఆధ్యాత్మిక క్రతువులలో స్త్రీ పురుషు లిద్దరినీ "అత"డనే సంబోధిస్తారు. నిజానికి మనమే గాయత్రియొక్క వ్యక్తస్వరూప మైనప్పుడు 'గాయత్రి'ని ఎవరు జపించవచ్చు ఎవరు జపించకూడదు అని ఉండదు.

ప్ర : మాస్టరుగారు ''మడి, మైల'' ఎందుకు పాటించరు ? ఆచార కాండను వదలిపెట్ట కూడదు కదా !

జ : మహానుభావులు మడిగా ఉండటానికన్న ఉమ్మడిగా ఉండటానికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. మనం మడిని ఎందుకు పెట్టుకున్నాం? శుచీ శుభ్రత కోసమే గదా ! మాస్టరుగారు మడి అన్న పేరు లేకుండానే తాను శుచీ శుభ్రత పాటిస్తూ తన చుట్టూ ఉన్నవారు పాటించేటట్లు

చూస్తున్నారు. ఆచారమన్నది ఇతరుల కన్న మనం వేరుపడి పోవటానికి గాదు. ఇతరులలోను, మనలోను ఉన్నది, ఒక్కడేనని తెలిసికొని అనుభవించి తరించడానికి. మనలోను ఎదుటి వారిలోను ఉన్నది దైవమే అయినపుడు ఒకరినొకరు ముట్టు కుంటే మైలపడటం అనే ప్రశ్న ఉండదు. మనమూ, మన చుట్టూ ఉన్నవారూ ఆరోగ్యంగా ఉండటానికి శుచీశుభ్రత చాలా అవసరం. కాని శారీరకమైన శుచీ శుభ్రతలతో ఆగి పోతే లాభంలేదు. మానసికంగా కూడా వాటిని పాటించాలి. విశ్వప్రేమ గలిగి ఉండటం ఆరోగ్యకరమైన మనస్సునకు లక్షణం.

అయితే మాస్టరుగారు తానున్నట్లుగా ఎవరినీ ఉండమని ఆజ్ఞాపించరు. తనకన్న వేరైన ఆచారాలు కలిగి ఉన్న వారిని అవమానించరు. అందరినీ ప్రేమిస్తారు. ఎవరిదగ్గర ఎలా ఉండాలో అలా ఉండి మరీ ప్రేమిస్తారు.

ప్ర : మాస్టరుగారు కులమత భేదాలు పాటించకుండా ఎవరింట్లోనైనా భోంచేస్తారట గదా! మాంసం తింటే బొమికెలు మెడలో వేసుకోవాలా? విశ్వప్రేమ ఉన్నంత మాత్రాన ఎవడింట్లో పడితే వాడింట్లో భోంచెయ్యాలని ఉందా?

జ : శబరి కొరికి ఇచ్చిన ఎంగిలి పండు తింటున్న రాముణ్ణి చూచి లక్ష్మణుడు కూడా ఇలాగే అనుకున్నాడుట. కంబ

రామాయణంలో ఉన్నదీ కథ. ప్రేమతో పెట్టిన దాన్ని స్వీకరించడం తప్పుగాదు. స్వీకరించక పోవడమే తప్పు. రాముడు అందరి ఆతిథ్యాన్ని సమానమైన ఆదరణతో స్వీకరించాడు. ఇంకా కొంచెం ముందడుగు వేసి కృష్ణుడు వ్రేపల్లెలో దొంగతనంగా కూడా గొల్లపడుచుల వెన్నముద్దలు తిన్నాడు. ఆదిశంకరులు అస్పృశ్యుని ఆతిథ్యం స్వీకరించారు. తిన్నడు పెట్టిన మాంసం తిన్నాడు శివు డని మనమే చెప్పుకుంటూ ఉంటాం. అలాగే మాస్టరుగారు కూడా శాకాహారాన్ని శుచిగా ఎవరు తయారు చేసి పెట్టినా స్వీకరిస్తారు.

ఇతర కులాల వాళ్ల ఇండ్లలో తినడాని కిష్టపడని వాళ్లు చాల మంది కాఫీహోటళ్ళలో అందరూ తిన్న ప్లేట్లలో తింటూనే వున్నారు. మరో కులం వాళ్ళ మంచినీళ్ళు త్రాగని వాళ్లు, అస్పృశ్యులు బావి ముట్టుకో కూడదని ఆంక్ష పెట్టే వాళ్లు నోటికి కరుచుకొని సోడాబుడ్డిలో సోడా త్రాగుతూనే ఉన్నారు. ఆ గతి లేక, నియతిలేక చేసే అలాంటి పనులకన్నా, ప్రేమతో కావాలని పెట్టిన పట్టెడు కూడు తినడం తప్పేమీ కాదు.

కులాలు సాంఘిక జీవనం సౌకర్య వంతమూ, సుఖతరమూ చేసికోవడానికి ఏర్పడ్డాయి గాని కొట్టుకోవడానికి, ఎక్కువ తక్కువ లెంచుకోవడానికి ఏర్పడ లేదు. మన యింటికి కావల్సిన పనులు ఇంట్లోని నలుగురం పంచుకొని చేస్తున్నట్లే సంఘానికి కావల్సిన పనులను పంచుకొని బాధ్య

తతో చేస్తున్న తరగతులనే మనం కులాలని పిలుస్తున్నాం. సంకుచిత దృష్టి నుండి సమత్వ స్థితికి మనం పెరగవలసి ఉంది. బ్రాహ్మణునిలోనూ, గోవులోనూ, ఏనుగులోనూ, కుక్కలోనూ, కుక్కనుచంపి తిన్నవానిలోనూ ఒకే దైవాన్ని దర్శించి అనుభవించ గలిగినవాడే పండితుడని కృష్ణుడు చెప్పాడు. మనమూ స్థితికి పండవలసి ఉంది.

ప్ర : పుట్టింది వైష్ణవ సంప్రదాయంలో. అనుసరిస్తున్నది C. V. V యోగమార్గం. పూజగదిలో చూస్తే అందరి ఫోటోలు ఉంటాయి. మహానుభావులలో ఎవరినిగూర్చి చెప్పమన్నా అద్భుతంగా చెబుతారు. ఇంతకూ మీరు ఏ యోగ మార్గాన్ని అనుసరిస్తున్నారు? ఎవరిని ఆదర్శంగా స్వీకరిస్తున్నారు?

జ : మీరా అనుకొంటున్నట్లు ఇందరి యోగ మార్గాలని లేవు. వీరందరూ ఒకే యోగమార్గానికి ద్వారాల వంటి వారు. ఎవరి ద్వారా ప్రవేశించినా ఒకే మార్గంలో ప్రవేశిస్తాం. ఈ సత్యాన్ని తెలియ చెప్పేటందుకే అందరి ఫోటోలు పూజగదిలో కనబడతాయి. ఒకే విద్యుచ్ఛక్తితో వెలుగుతూ వెలుగులు విరజిమ్ముతున్న దీపాల వంటివారు ఆ మహానుభావులు. ఇందులో ఏ బల్బులో నున్నది నిజమైన కరెంటు? అన్నది పిచ్చిప్రశ్న.

అలాగే మనం చెప్పుకొనే రకరకాల యోగాలన్నీ ఒకే యోగవృక్షం యొక్క కొమ్మలు. ఆ యోగవృక్షమే

శ్రీకృష్ణుడిచ్చినదీ, పతంజలి నిర్వచించినదీ, ఇదే అష్టాంగ యోగమార్గం. ఎవరు అనుసరించినా దీనినిగాని, దీనికి చెందిన భాగాలను గాని అనుసరించక తప్పదు. మాస్టరుగారు ఈ పరిపూర్ణమైన యోగ మార్గాన్ని ఆచరించి ఆచరింప జేస్తున్నారు.

ప్ర : మాస్టరుగారు అసితర సాధ్యమైన శక్తితో కనిపిస్తుంటారు. ఆయన వాక్కులోను, నడకలోను, నడతలోను ఏదో అనిర్వచనీయమైన శక్తి తొణికిసలాడుతూ ఉంటుంది. ఇది మామూలు వ్యక్తికి సాధ్యమయ్యే పని కాదు. ఈయనేదైనా శక్తి ఉపాసన లాంటిది చేస్తూ ఉంటారా? మనం చూస్తున్న పూజ కాకుండ ప్రత్యేకమైన పూజ ఏదైనా చేస్తూ ఉండాలాయన. లేకపోతే ఇంత జనాకర్షణ శక్తి ఎలా వస్తుంది?

జ : రోజూ మనం చూస్తున్న షోడశోపచార పూజ కాకుండా మాస్టరుగారు మరో పూజ చేస్తుంటారు. అదే సర్వాంతర్యామి సందర్శనం. జీవులను దేవుని సజీవ విగ్రహాలుగా ఆరాధిస్తారాయన. ఇలా ఆరాధించిన వాడే నిజమైన భక్తుడని భాగవతం చెబుతోంది. పరిసరాలనే పరమాత్మగా అనుభవించడం చేత ఇప్పుడు మీరు చూస్తున్న వైభమంతా మాస్టరుగారి నుండి వ్యక్తమవుతూ ఉన్నది. వ

కూడా ఆయనలా ప్రవర్తించడం మొదలుపెడితే గొంగళి పురుగు సీతాకోక చిలుక అయినట్లు మనమూ అలాంటి దివ్య రూపాన్ని పొందవచ్చు. మనం చేస్తున్న విగ్రహారాధనంతా ఈ సజీవ విగ్రహాలను ఆరాధించడానికి శిక్షణ పొందడమే. నాటకానికి రిహార్సల్ ఎలాంటిదో సర్వాంతర్యామి దర్శనానికి ముందుగా ఈ షోడశోపచార పూజ అలాంటిది. షోడశోపచార పూజతో ఆగిపోతే లాభంలేదు. ఆగకుండా సాగిపోతే సర్వాంతర్యామి సాక్షాత్కారం సిద్ధిస్తుంది. ఇది మాస్టరుగారు మనకు చూపిస్తున్న మార్గం. ఇది నిజమైనదీ అందరికీ అనువైనదీ. అనుసరించిన వారిని అనుసరించినంత వరకూ రక్షించేదీ.

ప్ర : మాస్టరుగారు ఉపదేశం అని ప్రత్యేకంగా ఇస్తున్నట్లు కనబడదేమి? శిష్యుణ్ణి స్వీకరించేటప్పుడు ఉపదేశం క్రతువు ఉండడం సహజం గదా! మాస్టరుగారు ప్రత్యేకంగా ఉపదేశించే విధానాన్ని అనుసరించక పోవటానికి కారణమేమిటి?

జ : "ఉపదేశం అనేది స్వీకరించేది గాని ఇచ్చేది కాదు" అంటారు మాస్టరుగారు. సంప్రదాయంలో ఉపదేశానికి విధివిధానమున్నట్లు కనబడుతూ ఉన్నమాట నిజమే. కాని రామానుజులు గోపుర మెక్కి వందలాది జనానికి ఒక్కసారే యిచ్చారు ఉపదేశం. ఈ నాడు మాస్టరుగారు అదే మార్గాన్ననుసరిస్తున్నారు. ఉపదేశం దేనికోరకు?

అందరిలో నున్నదీ, అందరుగా నున్నదీ దేవుడే నని తెలుసు కోవటం కోసమే గదా! అలాంటి ఉపదేశాన్ని అందరితో కలిసి పొందటానికి అభ్యంతరమైతే యెలా ?

అయినప్పటికీ కొంతమంది సామూహిక ప్రార్థనా స్వీకారంతో తృప్తి పడక విడిగా ప్రేయరు తీసుకోవాలను కునేవాళ్ళు తగులుతూనే ఉంటారు. అవకాశ మున్నప్పుడు, అవతలి వ్యక్తి స్థితికి ఆ తృప్తి అవసర మైనప్పుడు మాస్టరు గారు ప్రత్యేకంగా ప్రేయ రిస్తూనే ఉంటారు. ఏ మైనా మాస్టరుగారు సామూహిక ప్రార్థనకే ప్రాధాన్య మిస్తారు.

ఎంత ఎక్కువమంది ప్రేయరులో పాల్గొన గలిగితే అంత యెక్కువ మేలు పాల్గొన్న వారికి కలగడానికి వీలుంటుంది. సామూహిక ప్రార్థన, సంకీర్తన, సత్కార్యాచరణ మొదలైన వాటన్నిటికీ మంది యెంత యెక్కువ ఉంటే అంతమంచిది. పది మంది గలసి ఒక్కటై ఒక్కటిగా ప్రార్థిస్తున్న చోట, పని చేస్తున్న చోట నేనుంటానని శ్రీకృష్ణుడు చాటిచ్చియున్నాడు. కృష్ణావతారంలో గోపికలకు ఆయన చేసిన ఉపదేశం కూడా ఇలాంటిదే. బృందావనము, బృంద + అవనము అంటే group realization అని అర్థం. సామూహికమైన ఈ యేకత్వ దర్శన మెక్కడ ఉంటుందో అక్కడ జగద్గురువు ఉంటాడు. ఆ యేకత్వ దర్శనం లోనికి మనసూ మేల్కొల్ప డమే నిజమైన ఉపదేశం.

ప్ర : మాస్టరుగారు గురుదక్షిణ యేమైనా స్వీకరిస్తూ ఉంటారా ? స్వీకరించడం సంప్రదాయం గదా ?

జ : రోగాలతో మూలుగుతున్న భార్యాబిడ్డలు గల ఒక కుటుంబీకుడు మాస్టరుగారి నాశ్రయించి వ్యాధులనుండీ, బాధలనుండి తన కుటుంబాన్ని బయట పడవేసుకున్నాడు. అతనికి ఏదో ఒక రకంగా మాస్టరుగారి ఋణం తీర్చుకోవా లనిపించింది. అతను వచ్చి మాస్టరుగారి నడిగాడు "మాస్టరు గారూ ! మీ కేదైనా గురుదక్షిణ సమర్పించుకోవాలని ఉంది. నాకు అవకాశం ఈయండి, అని, అప్పుడు మాస్టరుగారిలా అన్నారు. " అవకాశం తప్పక యిస్తాను. కాని ఈయవలసిన గురుదక్షిణ యేమిటో తెలుసా! నేను నీ కేమి చేశానో నీ తోటి వారికి నీ కవకాశ మున్నంతవరకూ అది చేయి. బాధలతో వచ్చినపుడు నేను నిన్నెలా చూచా ననుకుంటున్నావో బాధలతో నిన్ను చేరిన వారిని నీ వలా చూడు. ఇదే నీవు నా కీయవలసిన గురుదక్షిణ. ఈ మార్గంలో యిచ్చినదే నిజమైన గురుదక్షిణ అవుతుంది.' ఇదీ మాస్టరుగారి గురుదక్షిణ కథ.

ప్ర : మాస్టరు గారు రామాలయంలో రుద్రాభిషేకం జరిపించడం చూచాను. శైవుడు శివాలయంలో చేసు కుంటే తప్పులేదు గాని వైష్ణవుడు రామాలయంలో రుద్రాభిషేకం చేయడ మేమిటీ అనిపించింది నాకు.

జ : రామేశ్వరం లోని శివలింగం రాముడే ప్రతిష్ఠిం

చాడని మనమే ఒప్పుకుంటున్నాం. అందుకే అది రామేశ్వర మయిందంటారు. పార్వతికి రామ మంత్రాన్ని శివుడే ఉపదేశించాడని మన పురాణాలు చెబుతున్నాయి.

ఓం నమోనారాయణాయ అనే మంత్రం లోని 'రా' అనే అక్షరం 'ఓం నమశ్శివాయ' అనే మంత్రంలోని 'మ' అనే అక్షరం కలసి 'రామ' అనే టటువంటి శబ్దం ఏర్పడినదని పెద్దలు వివరిస్తున్నారు. రామునికీ ఈశ్వరునికీ మధ్య ఇంతటి అన్యోన్యత కనబడుతున్నప్పుడు రామాలయంలో రుద్రాభిషేకం జరిపితే రాముడు సంతోషిస్తాడే తప్ప, మీలాగా బాధ పడడు.

శివలింగాన్ని ఆరాధించి రాముడు శైవుడైనా వైష్ణవులు ఆపలేక పోయారు. శివుడు పార్వతికి రామ మంత్రం ఇచ్చి వైష్ణవం పుచ్చుకొన్నా శైవులు ఆపలేక పోయారు. దేవుడి కన్నా తమకెక్కువ తెలుసు ననుకుంటే దేవుడు చేయగలిగిన దేమీ లేదు.

ప్ర : మాస్టరు గారికి ఒక విచిత్ర వ్యక్తితో పరిచయమున్నదని, ఆయన ఎప్పటి కప్పుడు మాస్టరుగారికి ప్రణాళిక యిస్తూ ఉంటారనీ, ఆ ప్రణాళిక ప్రకారమే మాస్టరు గారి దిన చర్య జరుగుతున్నదని జీవన జ్యోతి మొదలైన పుస్తకాలలో చదివాం. మాస్టరుగారు C. V. V. గారి శిష్యులు గదా! ఇంతకూ C. V. V. గారి

ప్రణాళిక ప్రకారం నడుస్తున్నట్లా! విచిత్రవ్యక్తి ప్రణాళిక ప్రకారం నడుస్తున్నట్లా?

జ: మనం విచిత్రవ్యక్తి అని పేర్కొనే వ్యక్తిలో విచిత్రమేమీ లేదని మాస్టరుగారు చాలాసార్లు నొక్కి చెప్పారు. ఆయన ఒక్క మాస్టరుగారికి తప్ప సాధారణంగా ఇక్కడున్న మారెవరికీ కనిపించకపోవటం మనం విచిత్రంగా భావించవచ్చు. ఆయన భౌతికంగా, సామాన్యంగా తిరుగుతూ ఉంటారనీ, కాని ఆయన ఫలానా అని గుర్తించడానికి అవకాశం ఈయరని మాత్రం తెలుస్తోంది. అవసరాన్నిబట్టి తన ఉనికిని ఎవరికైనా తెలియజేస్తానని ఆయన చెబుతారు. ఆయన ఆశ్చర్యంగా ప్రత్యక్షం అవటం, మాయం కావడం అలాంటివేవీ ఉండవు. మాస్టరుగారి దగ్గరకువచ్చి వెళుతున్న వందలాది వ్యక్తుల్లో ఆయనా ఉంటారుట.

ఇక ప్రణాళికల విషయం ఏమిటంటే ఆయనా మాస్టరుగారూ ఎప్పటికప్పుడు వారిద్దరూ చేసే పనులను గూర్చి చర్చించుకొని ఎవరి నిర్ణయాలకు వారు వస్తూ వుంటారుట. నిర్ణయాలలో అభిప్రాయాలు వేరు వేరుగా కూడా ఉండవచ్చునట. కాని చర్చించడం అయిన వెనుక ఆచరించే ముందు ఇద్దరి అంగీకారం జరుగుతుందిట. బాహ్య ప్రపంచంలో చేయవలసిన పనుల నిమిత్తం వీరు వేరు వేరు వ్యక్తులే కావచ్చు. అంతకు ముందు నిర్ణయాల విషయంలో దేహాలు మాత్రమే వేరు. ఎవరి మాట ఎవరు వింటా

రనే ప్రశ్న వీరికి పుట్టలేదు. ఒకరు ఇంకొకరిని నిర్ణయాలతో నడిపించడం ఇద్దరికీ అంగీకారం గాదు. సామాన్య వ్యక్తుల విషయంలో కూడా అలాంటి స్వాతంత్ర్యం వీరు తీసుకోరు. ఇలా పనిచేసేవారు ఆంతరంగిక, ఆధ్యాత్మిక కక్ష్యలలో కలిసి ఉంటూ బాహ్య ప్రపంచంలో విడి విడిగా కనిపిస్తున్నవారు చాలామంది ఉన్నారని వీరు చెబుతారు.

వీరిద్దరూ C. V. V. గారికి సంబంధించడం, సంబంధించక పోవటం అనేవి స్వంత అభిప్రాయాలకు బద్ధులైన వారికి సంబంధించిన తేడాలు. లోకహితం ముందు ఏ అభిప్రాయానికీ ప్రాధాన్యం లేదని వీరి మతం. ఒక గురువు మనలను పెంపొందింప జేయటానికి అంగీకరిస్తాడేగాని మన కుంటితనానికి చంకలో కర్రగా పనిచేయడు. మన మాష్టరు గారికి శ్రీకృష్ణుడు, C. V. V., ఈ విచిత్రవ్యక్తి, తాను, ఒక్కటే. తాను మాస్టరుగారని పిలిచే తన్ను గూర్చి తానే ఆధారంగా నిలబడి ఉన్నానని మాస్టరుగారు చెబుతారు. ఒకరు పెద్ద ఒకరు చిన్న అనే చూపుకు పైన ఉంటాయి ఈ సత్యాలు. పెద్ద చిన్నలు పాటించడం బాగా అలవాటైన తర వాత యివి తెలుస్తాయని మాస్టరుగారంటారు. నిజమైన గురువులలో ఒక విచిత్ర లక్షణం ఉంది. తమను పెద్దలుగా తెలిసికొని తాము చిన్నగా ఎవరు మెలగగలుగుతారో వారిని ఒక పెద్దగా అంగీకరించి వ్యవహరిస్తారు ఈ గురువులు.

ప్ర : మాస్టరు C. V. V. గారు తన నామాన్నే మంత్రంగా

ఇచ్చారేమిటి? తన గురువు పేరు ఎక్కడా చెప్ప లే దేమిటి?

జ: మనకు అనాదినుండి ఒక సంప్రదాయం ఉంది దానికి చెందిన వారే మాస్టరు C. V. V. " అనేక జన్మల సాధనకు చివర జీవుడు జ్ఞానవంతుడై నన్ను శరణాగతి పొందుతాడు. అప్పుడు సర్వము వాసుదేవుడే యని తెలుస్తుంది. అట్లు తెలిసినవాడు జీవాత్మనుండి మహాత్మస్థితిని పొందుతాడు. అట్టివాడు దుర్లభుడు" అని భగవద్గీతలో కృష్ణు డుప దేశించాడు. ఈ స్థితి పొందేటందుకు తన వాసుదేవ నామాన్ని మంత్రంగా ఇచ్చాడు. ఇచ్చట వాసుదేవు డనగా వసుదేవుని పుత్రుని గ్రహించవచ్చు. అలా గ్రహించి నప్పుడు కృష్ణుడు తన పేరు మంత్రంగా ఎందుకిచ్చాడనే ప్రశ్న పుడుతుంది. వాసుదేవు డనగా సర్వభూత నివాసుడనే అర్థం దర్శించిన వానికి ఈ ప్రశ్న తొలగి పోతుంది. ఇలాగే ప్రతి నామానికి సంజ్ఞార్థ మొకటీ, ఆ పేరుతో సూచింపబడే పరమార్థ మొకటీ ఉంటుంది. సాధనలో అర్థం విచ్చుకొని బ్రహ్మాండంలోనికి సాధకుని వ్యాపింప జేస్తుంది. అన్ని పేర్లకూ ఈ శక్తి ఉంది. అన్ని పేర్లలోనూ అంతర్యామి యొక్క గౌణార్థం తాళం వేయబడి ఉండి, మంత్రత్వం చెందినప్పటి నుండి వ్యంగ్యార్థం గాను, వేదార్థం గాను అను భూతిగా వస్తుంది. ఉదాహరణకు రాముడనే పేరు ఉంది. దశరథుని కొడుకు, వాడు కూడా పొద్దున్నే లేచి మోహం

కడుక్కోవడం, స్నానం చేయటం, భోజనం చేయటం, సంసారం చేయటం, కొన్ని కష్టాలు పడటం, అడవికి పోవటం మొదలైనవి చేసి ఉంటాడు అని మాత్రమే తెలుసుకో వచ్చు. ఆత్మ విస్మృతి ఆ పేరుతో ప్రారంభించినపుడు పితృ వాక్య పరిపాలన, ఏక పత్నీ వ్రతం, ఆశ్రిత రక్షణత్వం మొదలైన ఆత్మ గుణాల వైభవానికి సహాయపడుతుంది. పరిశుద్ధి చేసే స్థితిలో రేఫం అగ్ని బీజంగా, మకారం అమృత బీజంగా మనస్సు నుద్ధరిస్తాయి. అటుపైన ధ్యానించేవాడు రామత్వం చెందగా భవబంధ విమోచనం అనే స్థితి కలుగు తుంది. ఏ పేరైనా ఇలా సహాయపడగలదు. మహానుభావుల పేర్లు వాళ్ళ జీవితాన్ని ధ్యానించేందుకు కూడా సహాయ పడతాయి. వారి జీవితం పరబ్రహ్మమయం గనుక ఆ పేరు వారిది అనే అహంకారం ఉండదు. దీన్ని బట్టి పేరు ధ్యానానికి ఇవ్వడం పూర్వం నుండి సంప్రదాయంగా వస్తున్నది. అలాంటిదే C. V. V. అనే నామం కూడా.

ఈయనకు గురువెవరు అనే ప్రశ్న, తాను వేరు గురువు వేరు అనే భేదం మిగిలి ఉన్న వాడికి సంబంధించినది. శ్రీకృష్ణునకు సాందీపుడు గురువని ఉన్నది. కాని జన్మ యిచ్చిన దేవకీ వసుదేవులు, పెంచిన నందయశోదలు మొదలైన వాళ్ళంతా గురువులు కారా? రాముడికి గురువు విశ్వా మిత్రుడా? వశిష్ఠుడా? మిగిలిన ఋషులు కూడా లెక్కలోకి వస్తారా? వారికి ఇందరిలోనూ ఒకరే గురువు ఉంటారు.

అతడే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడని శాస్త్రం చెబుతున్నది. గీతా శాస్త్రంలో కృష్ణుడు తన గురువుపేరు చెప్పలేదు. కాని సాందీపనికి శుశ్రూష చేశాడు. తల్లి దండ్రులను చెరసాలనుండి విడిపిస్తూ నన్ను క్షమించండి అని పాదాభివందనం చేశాడు. ఏ ఋషి తన యింటికి వచ్చినా కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకునే వాడు. శిష్యుడికి ఉపదేశం యిచ్చేటప్పుడు ఆత్మను బ్రహ్మగా చేయగల గురువు తన గురువుల జాబితా చెప్పనక్కర లేదు. అది శిష్యుడికి అనవసరం. "నువ్వు చెప్పిన దానికి ప్రమాణం ఎవరు?" అని అడిగేవాడు శిష్యుడు కాడు. అలా అడిగి చెడిపోయిన పండితులతో ఏసుక్రీస్తు "నేను చెప్పినవాటికి నేనే ప్రమాణం" అని జవాబిచ్చాడు. ఈ "నేను" కు అర్థం తెలియడమే బ్రహ్మవిద్యా సంప్రదాయం. సూటిగా ఆత్మను బ్రహ్మ చేయలేని గురువు శిష్యులకు మంత్రం యిచ్చి "వారు యిలా చెప్పారు. దీనితో నీ సాధన నీవు చేసుకో" అని చెప్పవలసి ఉంటుంది. మంత్ర శాస్త్రం పుస్తకాలలో ఇలాంటి సంప్రదాయాలు కనిపిస్తాయి. మంత్రం యిచ్చే వాడు బ్రహ్మస్థితి చెందకపోయినా పనికి వచ్చేందుకు పుస్తకాలలో దీన్ని యేర్పాటు చేశారు. ఆత్మను మేల్కొలిపే గురువులకు ఇది వర్తించదు. చీకట్లో దీపం వెలిగించి అందించేవాడు "దీన్ని వాడు వెలిగించుకున్నాడు, వీడు వెలిగించుకున్నాడు" అని చెప్పనక్కర లేదు. వెలిగించినపుడు అది వెలుగుతూ ఉన్నట్లు ఇద్దరికీ కనిపిస్తుంది.

ప్ర : మాస్టరుగారు సిగరెట్లెందుకు కాలుస్తారు?

జ : దానికి మనమేమీ అంతరార్థాలు చెప్పుకోనక్కర లేదు. కాఫీ, టీ, సిగరెట్లు, చుట్ట, బీడీ, నశ్యం, మద్యం ఇవన్నీ ఒకే జాతికి చెందినవి. వీటిని దురభ్యాసాలు అంటారు. అలాంటి వాటిల్లో కొన్ని ఆయనకూ ఉన్నాయి కనుక నడుస్తున్నాయి. దాన్ని గూర్చి ఆయన పట్టించుకోలేదు. పట్టించుకోక పోవడం మంచి పనేమీ కాదు. ఎప్పుడో పట్టించుకోనటం జరుగుతుంది. ఈ లోపున మిగిలినవారు ఆ అభ్యాసాలను పట్టించుకోనక్కరలేదు. తీరా ఆయన విడిచి పెట్టే టైమ్‌కి వీళ్ళు పట్టించుకోనుంటే కష్టం కావచ్చు. ఆయనలో లోపాలు లేవని ఆయన అనలేదు. ఆయన మార్గం అవలంబిద్దామనే వారికి ఆయనలో ఉన్న మిగిలిన మంచి విషయాలే ముఖ్యం.

ప్ర : మాస్టరుగారుకూడా సినిమాలు చూస్తారేమిటి?

జ : అంతేకాదు. తనకు నచ్చిన సినిమాలు చూపించడానికి శిష్యులను కూడా తీసుకుపోతారు. భక్త ప్రహ్లాద, భారతం రామాయణ కథలు మొదలైనవి గ్రంథాలలో ఎంత పవిత్రమో సినిమాలలోనూ అంత పవిత్రమే. ఆ గ్రంథాలను సచ్చేటట్లు చేయటానికి ఈ సినిమాలలోని రూపకల్పన సహాయం చేస్తుంది. నాటకాలకు ఏ విలువ ఉందో సినిమాలకూ ఆ విలువే ఉంది. కాళిదాసు నాటకాలు వ్రాశాడు. అది కంటికి సంబంధించిన యజ్ఞం అన్నాడు.

ఇంతకీ మాస్టరుగారు చెడ్డ సినిమా లేవీ తాను చూడనూ లేదు, ఇంకొకళ్ళకు చూపించనూ లేదు. నీతిని ఉపదేశింపగల శక్తి ఉన్నప్పుడు పురాణము, హరికథ, నాటకము, సినిమా అన్నీ ఒక్కటే. ప్రతి దానిలోనూ మంచితోపాటు చెడూ ఉంటుంది. పుణ్యక్షేత్రాలకూ, దివ్యస్థలాలకూ వెళ్ళినప్పుడు దేవుడూ కనుపిస్తాడు. వాణ్ణి ఆశ్రయించుని చుట్టూ ఉన్నవాళ్ళల్లో అన్యాయాలూ కని పిస్తాయి. దైవ దర్శనానికి పలుకుబడి, ధనం, అధికారం ఉన్నవాళ్ళని దగ్గరగా పిలచి చూపించడం, సామాన్యులైన సాధు జనులను దూరంనుండే చూడమనటం నిత్యం జరుగుతూనే ఉంటాయి. ఇంతకీ అక్కడిదాకా వెళ్ళాక వెళ్ళినవాడు దేన్ని చూస్తాడు అన్న విషయం వాడి సంస్కారాన్నిబట్టి ఉంటుంది. భక్తుల చరిత్రలు సినిమాలుగా తీసినపుడు చూడవలసినది సినిమాలోని కథలేగాని నటీనటుల జీవిత కథలను కాదు. అందుకని మాస్టరుగారు సినిమాల విషయంలో కావలసింది వివేకమేగాని నిషేధం కాదంటారు.

ప్ర : మేం చదువుకొనే రోజుల్లో మాస్టరుగారిని గూర్చి రకరకాలుగా చెప్పుకొంటూ వుండే వారు. ఆయన్ని ఆరాధించే వారు ఎంతమంది కనబడేవారో ద్వేషించేవారూ అలానే కనబడేవారు. ఆయన్ని గూర్చి మంచిగా చెప్పేవారున్నట్లు గానే పని కట్టుకొని చెడుగా చెప్పే వారు కూడా తారస పడే

వారు. ఆయనను చూచిన మాకు ఈయనపై ఈ దుష్ప్రచారాలేమిటా అనిపించేది. ఈ దుష్ప్రచారాలకు కారణం ఏమిటంటారు?

జ : మాస్టరుగారిని గూర్చే కాదు. ప్రపంచంలో ఇంత వరకూ దిగి వచ్చిన మహానుభావులు అందరూ ఈ విధమైన విరుద్ధ ప్రచారాల మధ్య నడిచిన వారే. కృష్ణుడంతటి వాడిని నిండు సభలో పట్టుకొని నిందించాడు శిశుపాలుడు. వాడి ప్రాణానికి ఆ నిందలన్నీ నిజాలుగానే కనిపించాయి. తన లోని రాగ ద్వేషాలను కృష్ణునిపై వెళ్ళ గ్రక్కాడు. కృష్ణుని లోని లోకోత్తర గుణాలన్నీ శిశుపాలుని లోని రాగ ద్వేషాలను రెచ్చగొట్టేందుకు పనికి వచ్చాయి. ఫలితం కృష్ణుని చేతిలో చనిపోయే అదృష్టం అతనికి పట్టింది. అలాగే లోకోత్తరమైన సామర్థ్యంతో ఎవరు ఎప్పుడు దిగి వచ్చినా సమకాలికులు తమతమ సంస్కారాలకు అనుగుణంగా ద్విగుణీకృతమైన శక్తితో ప్రవర్తిస్తారు. మంచి ఆశయాలు కల వారు, సత్కార్యాచరణ యందభిలాష కలవారు, ఆ మహానుభావుల నడవడిని ఆధారం చేసుకొని లోకహితం కోసం కృషి చేయడం ప్రారంభిస్తారు. రాగ ద్వేషాలు, మదమాత్సర్యాలు మొదలైన హీనమైన లక్షణాలను కూడబెట్టుకొని యున్నవారు ఈ మహానుభావులను జూచి రెచ్చిపోతారు. తమలో లేని మంచి గుణాలు వారు కలిగి యుండటమే దీనికి కారణం కనుక అవి మంచి లక్షణాలు కావని, అదంతా

నాటకమనీ, అవినీతి యని ప్రచారం చేయడానికి తమలో కూడబెట్ట బడిన రాగద్వేషాలు ఖర్చు పెట్టడం ప్రారంభిస్తారు. అవి పూర్తిగా ఖర్చయిపోయేటప్పటికి ఆర్తితో ఆ మహానుభావుల పాదాలముందు వ్రాలిపోతారు. అలా వ్రాలి పోతున్న వారిని మనం చూస్తూనే వున్నాం ఇంకా రాగద్వేషాలు ఖర్చుకాని వాళ్ళు ఆ వ్రాలి పోతున్న వారిని చూపించి, "చూశారా! ఈ హేతువాదుల్ని ఎలా బుట్టలో వేసుకున్నారో! ఎంత అన్యాయం జరిగిపోయిందో?" అని కూడా ప్రచారం చేస్తారు.

ఇంతకీ మహానుభావుల సాన్నిధ్యంవల్ల ఇరువర్గాలకూ మంచే జరుగుతోంది. సద్గుణాలు కలవారు సత్కార్యాచరణలో సమర్థులవు తుంటే, దుర్గుణాలు కలవారు వారిని గూర్చిన ప్రచారంలో క్రమంగా వాటి నుండి విముక్తులవు తున్నారు. కనుక మహానుభావులు ఈ ఇరు వర్గాల వారిని సమదృష్టి తోనే ఆశీర్వదిస్తారు.

అయితే, ఈ దుష్ప్రచారం వల్ల సామాన్యజనులు పెద్దవారిని గూర్చి అపార్థం చేసుకోరా? అని మీరనుకో వచ్చు. సామాన్యంగా చేసుకోరు అని దీనికి సమాధానం. ఒక వేళ ఏ అమాయకత్వం వల్లనో, కొద్దికాలం చేసుకొన్నా పశ్చాత్తాపంతో కూడిన సత్యదర్శనం వారికి లభిస్తుంది. నిజం చెప్పాలంటే, ఈ దుష్ప్రచారముల వల్లనే మహాను

భావుల పేర్లు, ప్రణాళికలు నలువైపుల వారికి తెలుస్తు న్నాయి. కూలి పుచ్చుకోకుండా వాళ్ళెంతటి మంచి పనిని చేసి పెడుతున్నారు.

మహానుభావులు మంచి అద్దాల వంటి వారు. అద్దంలో ఎవరి ప్రతిబింబం వారికి కనబడుతుంది. మోహపడిన మానవుడు ఆ ప్రతిబింబానికున్న మరకలన్నీ అద్దం తాలుకు వని భ్రమ పడుతున్నాడు. అద్దాన్ని తాను నిందించి, తన వారిచే నిందింప జేస్తున్నాడు. కాల క్రమంలో ఆ మోహం నుండి విముక్తి లభిస్తుంది. అప్పుడు పశ్చాత్తాపంతో లెంపలు వేసుకొని, అద్దంలో కనబడుతున్నది, తన ప్రతి బింబమని, తనని తాను తెలుసుకోవడానికి, తనని తాను దిద్దుకోవడానికి ఆ అద్దం అక్కడ నిలబెట్ట బడిందని తెలుసు కొంటాడు. అద్దాన్ని సద్వినియోగ పరచుకొని, జీవితాన్ని అర్థవంతం చేసుకొంటాడు. ఈ పరిణామం తెలియకపోతే ఈ కథలను చూస్తున్న మనకు కంగారుగా వుంటుంది. పరిణామం తెలిసిన వారికి ఈ కథలలో కృష్ణుని వెతుక్కుంటున్న గోపికలే కనిపిస్తారు.

ప : అన్నీ బాగానే వున్నాయి. కానీ ఎంత సమా ధాన పరుచు కొందామనుకొన్నా నా మనస్సుకు నచ్చని దొక్కటే — ఒక మనిషి కాళ్ళకి మరొక మనిషి మొక్కడ మేమిటి? శిష్యులలా మొక్క

డమూ బాగాలేదు. మాస్టరుగారు అలా మొ్రొక్కించు కోవడమూ బాగాలేదు. గౌరవాన్ని తెలియబరచు కోవాడానికి ఇంకేమీ మార్గాలు లేవా? కాళ్లు పట్టు కోవడం తప్ప ? తమ వ్యక్తిత్వాలకి స్వస్తిచెప్పి, ఉదాసీనులై అలా కాళ్ళమీద పడేవాళ్ళంటే నాకు ఒళ్లు మంట. మరి యిలాంటి సన్నివేశాలను మాస్టరు గారు ఎందుకు ప్రోత్సహిస్తున్నట్లు ?

జ: మాస్టరుగారు ఎవరినీ తనపాదాలకు నమస్కరించమని ఆజ్ఞాపించలేదు. నమస్కరించేవారిని అడ్డుపెట్టనూ లేదు. అడ్డు పెడితే ఆ నమస్కారం ఆయనకి అని ఆయన అహంకరించినట్టు అవుతుంది. తనద్వారా ప్రవహిస్తున్న వెలుగునకు వారు తమను తాము సమర్పణ చేసుకొంటున్నారని మాస్టరుగారికి తెలుసు. లైటు వెలగడానికి 'స్విచ్' ఎలా సాధనమో, ఆ వెలుగును అందుకోవడానికి ఆయన పాదాలు అలా నిమిత్త మవుతున్నాయి. స్విచ్ కన్నా మనం తక్కువా? అని వెయ్యడానికి మొహమాట పడితే లైటును వెలిగించుకొనే అదృష్టం పట్టదు. అలాగే తాను ఎన్ని వేదాలు చదివినా, ఉపనిషత్తులు వల్లించినా, పురాణేతి హాసాలు అవలోకనం చేసినా, ఏదోఒక ముహూర్తంలో ఎక్కడోఅక్కడ సజీవమైన విగ్రహానికి ( మనిషికి ) పాదా లంటి నమస్కరించనిదే జీవితానికి సమన్వయం అందదు. కరెంటు వైరింగు చేయించుకోవడం లాంటిది మన శాస్త్రాధ్య

యనం. స్విచ్ వేసుకోవడం లాంటిది మనని గురువు పాదాల కడ సమర్పించు కోవడం. వైరింగు ఎంత డబ్బు ఖర్చుపెట్టి చేయించుకొన్నా స్విచ్ వేయనిదే లైటు వెలగదు. అలాగే శాస్త్రాలు ఎంత ఘనంగా వల్లించినా ఆ వేద పురుషుని సజీవ రూపంలో అర్పించనిదే ముక్తి లభించదు.

ఆరాధనకు రాతి విగ్రహాలకన్న కొయ్యవిగ్రహాలు మిన్న. కొయ్య విగ్రహాలకన్న సజీవమైన మానవ విగ్రహాలు మిన్న. క్రమంగా సజీవమైన విగ్రహాలను అర్చించడం నేర్వనిదే జీవితానికి ముక్తి లభించదని భాగవతం నొక్కి చెబుతోంది. మీరన్నారే అలా దండం పెట్టేవారిని చూస్తే ఒళ్ళు మండుతుందని - అలా మండడాన్నే "అహంకారం" అంటారు. ఆ అహంకారం కరగాలి అంటే మీకు నచ్చిన మహానుభావుని పాదాలను మనసార పట్టక తప్పదు.

మనం నమస్కరిస్తున్నది చరణాలకు. చరణాలంటే చరించేవి అని అర్థం. అనగా అవి చరిస్తున్న ధర్మమార్గానికి మనని మనం సమర్పణ చేసుకోవడమే చరణాలకు నమస్కరించడం. ఆ ధర్మ మార్గానికి అంకితం అవుతున్నామని పద మంటి ప్రమాణం చేస్తున్నామన్నమాట! సత్య మిది కాబట్టి మనవాళ్ళు చరణాలకు నమస్కరించ మన్నారు గానీ చెవులకు, కన్నులకు నమస్కరించమనలేదు. తా మనుసరిస్తున్న ధర్మ మార్గానికి సమర్పణ చేసుకొంటున్న జీవులను మహాను

భావులు కాదని అనరు. ప్రేమతో చేయూత నిస్తారు. సామాన్య జీవులను ధర్మ మార్గంలోనికి ఆకర్షించి నడిపించడానికే గదా వారు దిగివచ్చింది? మనంకూడా ధర్మమార్గం చేత ఆకర్షింప బడినపుడుగాని పాదాలను స్పృశించి గురువునకు సమర్పణ చేసుకోవడంలో గల ఆవశ్యకత మనకు తెలియదు.

ప్ర: మనలో మాట. ఇంతకూ ఉద్యోగం మానేసిన తరువాత మాస్టరుగారి కుటుంబ పోషణ ఎలా జరుగుతోందనేది అందరికీ ఆశ్చర్యమే! కాని నాకు మాత్రం హేమాహేమీల్లాంటి శిష్యులుండగా ఆయన కుటుంబ పోషణకు ఏమి కొరవ అనిపిస్తుంది. అది నిజమేనంటారా?

జ: మాస్టరుగారి కుటుంబ పోషణ మాస్టరుగారికెప్పుడూ పెద్ద విషయం కాదు. "సత్కర్మాచరణ నిర్వహింప బడుతున్నంత కాలం దానిని నిర్వహిస్తున్న వాడు తనను గూర్చి తాను ఆలోచించుకొనసక్కరలేదు" అన్నది ఆయన సందేశం, ఆయనతో పాటు ఆయన శిష్యుల అనుభవం. ఈ సత్యం మీద నమ్మకం లేనివాళ్ళకు మాత్రమే కుటుంబ పోషణ నేది ప్రయత్నించ వలసిన సమస్యగా పరిణమిస్తుంది.

మాస్టరుగారి ద్వారా దిగివస్తున్న రచనలు మానవాళికి వెలుగు బాటలను చూపడంతో వాటికి ప్రజలలో

నున్న ఆదరణ అపారమైనది. ఆ రచనల పంపిణీ మొదలైన వాటిలో పాలు పంచుకుంటూ కొన్ని కుటుంబాల వారు పోషింప బడుతున్నారు కూడా! ఆ వచ్చే ఆదాయంలో తన కుటుంబ పోషణకు కావల్సిన కొద్ది మొత్తాన్ని స్వీకరిస్తారు మాస్టరుగారు. మిగిలినది ట్రస్టు ప్రచురణలకు, కార్యక్రమాలకు వినియోగ పడుతూ ఉంటుంది. ఇది ఆయన తనకు తానుగా యేర్పాటు చేసికొనిన నియమం. కనుక తన కుటుంబ పోషణకై మరొకరిపై ఆధార పడవలసిన ఆవశ్యకత ఆయనకు లేదు.

అయితే అభిమానులు, అనుయాయులు తనద్వారా నిర్వహింప బడుతున్న సేవా కార్యక్రమాలకు సహకరిస్తున్నప్పుడు ఆయన సంతోషంగా స్వీకరిస్తారు. "మీ గూర్చి ప్రారంభిస్తున్న మంచి పనులను మీరు నిర్వహించు కొనే టట్లుగా మిమ్మల్ని తయారు చేయడం కొరకే నేనీ కృషి చేస్తున్నాను. మీరు నాకు వేరే సహకరించ నక్కరలేదు. నా శిక్షణలో వాటి నిర్వహణలో మీరు సమర్థులై మిమ్మల్ని మీరు పెంచుకుంటే చాలు." అన్నది మాస్టారి ఉపదేశం.

ప్ర : మీరు ప్రతిచిన్న విషయానికీ మాస్టరుగారిని సలహా అడుగుతుంటారు. ఆయన చెప్పినట్లే చేస్తావుంటారు. ప్రతిచిన్న విషయానికి ఆయనతో చెప్పవల

సిన అవసరం ఏమిటి? అన్నీ ఆయనతో చెప్పి చేస్తూంటే మీరు, మీ వ్యక్తిత్వం, మీ ఆలోచన నిరుపయోగమై పోవడంలేదా? తన చుట్టూ చేరిన వారిని మాస్టరుగారు ప్రతిచిన్నదానికి తనపై ఆధార పడే వాళ్ళుగా తయారు చేయడం ఏమైనా బాగున్నదా?

జ: మాస్టరుగారు తనచుట్టూ చేరినవాళ్లని తనంతటి వారుగా తయారు చేయడంలేదు. నిజానికి ప్రతిచిన్న విష యంలోనూ ఇన్నివందల మందికి సలహాలివ్వాలంటే ఎంతటి ఓపిక, ఓర్పు, అన్నిటినీ మించి ప్రేమ ఉండాలి? అంతటి ఓర్పుతో ఆయన ఇస్తున్నారు—అంటే ఎందుకంతటి బాధ్య తను తీసుకొంటున్నారో మనం కొంచెం జాగ్రత్తగా ఆలో చించవలసి వుంటుంది.

మనలో ప్రతి ఒక్కరం మనకినచ్చిన పనులు చేస్తుం టాం. మనకి నచ్చినదే మన ప్రాణానికి మంచి దనిపిస్తుంది. మనకు నచ్చడం, నచ్చకపోవడం మన స్వభావంమీద ఆధారపడి వుంటాయి. మన స్వభావం మన పూర్వ కర్మల సంస్కారాల సముదాయంపై ఆధారపడి వుంటుంది. అలాంటి స్వభావానికి అనుగుణంగా మనం ప్రవర్తించినపుడు ఆ స్వభా వం మంచిదయితే మంచిది నచ్చుతుంది. చెడ్డదయితే చెడ్డది నచ్చుతుంది. ఈ నచ్చడంలో మనకు తెలిసిన జ్ఞానం,

వేదాంతం మనకే మాత్రం ఉపయోగపడవు. మన స్వభావమే వాటినన్నిటిని అధిగమిస్తుంది. అందువల్లనే చెప్పేవి శ్రీరంగనీతులు మొదలైన సామెతలు పుట్టాయి. మన ఆలోచనలన్నీ మన స్వభావం నుండి పుడుతున్నవే కాబట్టి జీవితమంతా స్వభావం దర్శకత్వంలో నడుస్తుంది.

పరమ గురువుల పాదాలను ఆశ్రయించినపుడు వారు మన స్వభావాన్ని తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తారు. అది పూర్తిగా తీర్చిదిద్దబడి మనకు అక్కరకు వచ్చేలోపున దానిని సంప్రదించకుండా తమ మాట వినమంటారు. ఒక ప్రక్క తల్లి గిన్నెలు సర్దుతుంటే మరొకప్రక్క పిల్లవాడు గిన్నెలు లాగి గిరవాటు కొడుతుంటే మరి ఆ యిల్లు ఎప్పటికి దారికి వస్తుంది? తల్లి చెప్పినట్లు పిల్లవాడు నేర్చుకొంటున్న కొద్దీ ఇల్లు తీరుగా వుంటుంది; వస్తువులు వినియోగ పడతాయి, అలాగే మన స్వభావం తీర్చిదిద్దబడేవరకూ మనం పెద్దలు చెప్పినట్లు నడుచుకోవడం మొదలుపెడితే మన స్వభావం మన మీద పనిచేయదుగదా! అందువల్ల కర్మబంధముండదు. స్వభావం తీర్చిదిద్దబడిన తరువాత ఆ స్వభావమే పరమ గురువుల ప్రతినిధియై మనని నడిపిస్తుంది. ఈ విధంగా తీర్చిదిద్దడాన్నే భృక్తరహిత తారక రాజయోగ మన్నారు మాస్టరుగారు.

ప్ర : మాస్టరుగారు అందరితో కలసి పోతుంటారు, కలసి తిరుగుతారు. కలసి తింటారు. మనం చూచే మహాను

భావులంతా అలా ఉంటున్నారా? వారిలాగా ఈయన కూడా కొన్ని నిబంధనలు పాటిస్తే బాగుంటుంది కదా?

జ: మాస్టరుగారి దగ్గర నియమాలు ఉంటాయిగాని నిబంధనలు ఉండవు. తోటి వారికన్న ప్రత్యేకంగా కనబడేవాడూ, ప్రత్యేకంగా ప్రవర్తించేవాడూ ఆధ్యాత్మికుడు కానేరడని కృష్ణుడు గీతలో చెప్పాడు. తన ఉపదేశానికి ఉదాహరణగా కృష్ణుడు అందరితో కలిసిమెలిసి తిరిగాడు. ప్రేమను వర్షించి సమ్మోహితులను చేశాడు. ఆడుతూ పాడుతూ అందరి హృదయాలూ దోచుకున్నాడు. వాళ్ళ వాళ్ళ సంస్కారాలను బట్టి కొందరాయన దగ్గరకు చేరగలిగారు. కొందరు, చేరితే వ్యక్తిత్వం పోగొట్టుకోవలసి వస్తుందని భయపడి దూరంగా ఉండి పోయారు. ఆతడు మాత్రం పుట్టినప్పటినుండి బోటన వ్రేలికి బాణం తగిలే వరకూ ఒకేలా ఉన్నాడు.

మన మనుకుంటున్నట్లు నిబంధనలు పాటించడమే ఆధ్యాత్మికమైతే శబరి యెంగిలి తిన్న రాముడు, గోపికలతో ఆడిన కృష్ణుడూ, రోగులతో ఆర్తులతో కలిసి తిరిగిన యేసు ప్రభువూ, మొదలైన వారెవరూ ఆధ్యాత్మికులు కాలేరు. తల్లిదండ్రులు నిబంధనలు పాటిస్తే పిల్లలెలా గిలగిల లాడతారో అవతార పురుషులు నిబంధనలు పాటించి హద్దు

లేర్పరచుకుంటే జీవులలా గిలగిల లాడి పోతారు. తమకన్నా జీవులు వేరుగా ఉన్నారనీ, వారిని వేరుగా ఉంచాలనీ తాపత్రియపడేవారు మహాత్ములెలా అవుతారు? పిల్లల కన్నా వారి బాగుకన్నా కావలసినది తల్లి దండ్రులకెలా ఉండదో జీవుల బాగుకన్నా అవతార పురుషులకు కావలసింది అలాగే ఉండదు. తల్లిదండ్రులు చంకన వేసుకునే పిల్లల్ని చంకన వేసుకుంటారు. చేయందించవలసిన పిల్లలకు చేయి నందిస్తారు. సహకరించివలసిన పిల్లలకు సహకరిస్తారు. అలాగే మహాత్ములైనవారు తమతోనున్న జీవులను ఎవరినెలా చూచుకోవాలో వారినలా చూచుకొంటారు. అలా చూచు కోవడం వారి ధర్మం. ఆ ధర్మ మెరుగని వారు నిబంధనలు కావాలనుకుంటారు.

ప్ర : మాస్టరుగారి తమ్ముళ్ళు మాస్టరుగారి మార్గాన్ని అవలంబిస్తున్నట్లు కనబడ దేమిటి?

జ : ఆయన మనకు మాస్టరుగా రయినంత మాత్రాన తమ్ముళ్ళకి మాస్టరుగారు కావాలని ఎక్కడ ఉంది? నేను ఆయనను మాస్టరుగారుగా స్వీకరించడం నా యిష్టం మీద ఆధారపడి ప్రారంభించిందే గాని ఆయన నిర్బంధం మీద ఆధారపడ్డదికాదు. గురువు అనే పదం తండ్రివంటిది. తన బిడ్డలకు తండ్రైనవాడు ఊళ్ళో వాళ్ళందరికీ తండ్రి కాదు గదా! అలాగే తన శిష్యులకు మాస్టరుగారైన వాడు అంద రికీ కానక్కర లేదు.

ప్ర : మాస్టరుగారు ఉద్యోగంలో నుండి ఎందుకు విరమించారు? ఈ విషయంలో తొందరపడ్డారేమో ననిపిస్తుంది.

జ : మాస్టరుగారు మాత్రం తాను కొంచెం ఆలస్యంగానే విరమించడం జరిగిందంటారు. మాస్టరుగారు విరమించే నాటికే మాస్టరుగారి ఆదేశంపై ఉద్యోగాలనుండి విరమించి ఆయన ప్రణాళికలో పనిచేస్తున్నవారు ముగ్గురున్నారు. మాస్టరుగారి ప్రణాళిక వామనావతారంలా క్రమంగా ఆశ్చర్యకరమైన రీతిలో విస్తరించింది. విశ్వవిద్యాలయంనుండి విశ్వంలోనికి వచ్చి 24 గంటలూ పనిచేయవలసిన అవసరం ఏర్పడింది. ఆయన నిర్వహిస్తున్న ప్రణాళికకు ఆయన కాలం ఆయన చేతిలో ఉండి తీరాల్సి వచ్చింది. అందువల్ల వెంటనే ఉద్యోగం నుండి ఆయన విరమించుకొన్నారు. ఎందరెందరో కావాలని క్యూలో నిలబడే పనిలోనుండి, కొందరు మాత్రమే సిద్ధపడే యజ్ఞార్థకర్మకు ఆయన అంకితమయ్యారు.

ప్ర : తన శిష్యులు ఉద్యోగాలు చేయడానికి మాస్టరుగారు వ్యతిరేకా?

జ : కాదు. ఉద్యోగాలు మాత్రం ఎక్కడివి? ప్రజల ర్వార్థమై ప్రభుత్వమో, సమర్థులో ఏర్పాటుచేసిన రక ు విభాగాలలోని వేగా? నిజంగా ప్రభుత్వ కార్యా అంటే ప్రజా సేవకు కేంద్రాలు. అట్లాంటి వాటిలో

పని చేసేవారు వాటికి తగిన సేవాభావం, విశ్వప్రేమ అలవరచుకోమంటారు మాస్టరుగారు.

కాని నేటి విద్యావిధానంలో లోపంవల్ల ఉద్యోగాలు పరిమితమైతే వాటికోసం ఎగబడేవారు లెక్కకు మిక్కిలిగా పెరుగుతున్నారు. బానిసత్వం మన దేశానికి వదలినా మన మనస్సులకు వదలలేదు. ఉద్యోగాలలో చేస్తున్నది కూడా ఇతరులను సేవించడమే కదా! ఆ సేవించడం బయటే తగిన పద్ధతిలో సేవిస్తే ఆ మాత్రం అన్నం పుట్టక పోతుందా? అనే బేపర్వా యువతరానికి రావడంలేదు. ఎవడి క్రిందైనా పనిచేయడానికి మోజుపడుతున్నారు గాని తమకు తాముగా నిలబడాలంటే జడిసిపోతున్నారు. ఉద్యోగంలో అయితే ఎంతో కొంత ఫస్టుకల్లా డబ్బు వస్తుంది. బయట తాము చేసే పని తమకు అన్నం పెడుతుందన్న విశ్వాసం వారికి కలగడంలేదు. ఉద్యోగాలా దొరకవు, తమకు తాముగానా నిలబడలేరు. మరేమైపోతారు వీరు? మాస్టరుగారు అలాంటి వారిలో కొందరిని చేరదీసి ఆత్మవిశ్వాసాన్ని వారికి కలిగించి, స్వయం ఉపాధి కల్పనద్వారా మీకేగాక మరికొందరికి కూడా ఆసరా కల్పించగలరని ఉత్సాహపరచి, పరిశ్రమలు మొదలైనవి స్థాపింప జేశారు. కంటికి రెప్పలా వారిని కాపాడుతూ ప్రయోజకులుగా వారిని తీర్చిదిద్దారు. క్రమంగా వారిని చూచి ధైర్యం తెచ్చుకొని మరింత మంది యువకులు తమ కాళ్ళ మీద తాము నిలబడి ప్రజలను

సేవించవచ్చునని, ప్రభుత్వానికి సహకరించవచ్చునని గ్రహించి కృషి చేయడం ప్రారంభించసాగారు.

మాస్టరుగారు ఎవరు దేనికి పనికివస్తారో వారిచేత అదే చేయిస్తారు. కొందరు ప్రభుత్వ రంగాలలో ఉండవలసిన వారుంటారు. మరికొందరు వ్యాపార రంగాలలో రాణించగల వారుంటారు. ఇంకొందరు వృత్తి విద్యలలో నైపుణ్యం చూపగలవారుంటారు, వారివారి సంస్కారాలనుబట్టి వారు చేయగలిగినది చేయిస్తారు, తప్ప తన ఆశయాలకు మనుషులను బలిచేయరు. "మనిషి కోసం ఆశయం కాని, ఆశయం కోసం మనిషి కాదు" అంటారు మాస్టరుగారు.

ప్ర : కొందరు తల్లిదండ్రులు మాస్టరుగారు తమ బిడ్డలను తమ మాట వినకుండా చేశారని ఆవేశపడుతుంటారు. అదే నిజమైన నాడు ఇక మాస్టరుగారి పెద్దరికమేమిటి ?

జ : రోగి వ్యాధితో బాధపడుతున్నప్పుడు డాక్టరు నరం ఇంజక్షన్ ఇస్తున్నాడనుకోండి. అప్పుడా రోగి ఏడుపు ముఖం పెట్టి గిలగిలలాడాడనుకోండి. అంత మాత్రంచేత డాక్టరు ఇంజక్షన్ చేయడం మానుతున్నాడా? అప్పుడా డాక్టరును హృదయం లేనివాడు అనగలమా? అతడు చేసినది జీవహింస అనగలమా? అలాగే తల్లి దండ్రుల ఆలోచనలు, ఆవేశాలు మొత్తం కుటుంబాన్నే కల్లోల పరచేవిగా ఉన్నా

యనుకోండి. అప్పుడా కుటుంబ శ్రేయస్సు కోరి తన ననుస రిస్తున్న కరర్రవాళ్ళ ద్వారా వాళ్ళ కుటుంబాలలో తిరిగి సుఖశాంతులు నెలకొనేటట్లు చేస్తారు మాస్టరుగారు. ఈ సత్యాన్ని దర్శించలేని పెద్దలు తమ పెద్దరికానికేదో అవమానం కలిగినట్లు, తమ బిడ్డలను మాస్టరుగారు కైవసం చేసుకుంటున్నట్లు భావించి, ఆ భావనలు మాస్టరుగారిముందు పెడితే త్వరగా సర్దుకు పోతాయేమోనని భయపడి వాళ్ళతో వీళ్ళతో చెప్పుకొంటూ ఉంటారు. మళ్ళీ కొంత కాలానికి నిజం తెలిసికొని ఆయన కాళ్ళ మీద పడుతుంటారు. ఆయన ప్రేమ స్వరూపుడు. దారి తప్పి తికమకపడి మరల తెలిసికొని చేరిన తన బిడ్డలను ప్రేమతో స్వీకరిస్తుంటారు. ఆయన తనకు దణ్ణంపెట్టిన వారిని ఎంతగా ప్రేమిస్తారో, తనపై దుమారం లేపినవారినీ అంతగానూ ప్రేమిస్తారు. మానవ మనస్తత్వాల పారం జూచిన వారాయన. ఎవరెప్పుడెలా ఉంటారో, ఎంతకాల మలా ఉంటారో, ఏ కారణంచేత అలా ఉంటున్నారో, తిరిగి దారికి ఎప్పుడువస్తారో అన్నీ తెలిసిన ఆయన ప్రేమతో ఆశీర్వదిస్తారే తప్ప ఎవరినీ ఆక్షేపించరు. ఎవరినీ ఉపేక్షించరు. అందరినీ ఉద్ధరిస్తారు.

ప్ర : ఏం చేశారో తెలియదుగాని బడాబడా వాళ్ళందరినీ తన వెనకాల తిప్పుకొంటారు. వాళ్ళచేత తన పనులన్నీ చేయించుకొంటారు. వాళ్ళ కారుల్లో కాలు

క్రింద పెట్టనవసరం లేకుండా తిరుగుతూ ఉంటారు. ఇదేనేమో యోగమంటే మరి!

జ : బడాబడా వాళ్ళందరూ ఆయన వెనకాల తిరుగుతున్నమాట నిజమే. కాని ఆయన తిప్పుకోవటంలేదు. వారే తిరుగుతున్నారు. ఎందుకు తిరుగుతున్నారన్నది మీరు వారినే అడిగితే సరిపోతుంది. పంచదార అక్కడ ఉన్నప్పుడు చిన్న చీమలూ వస్తాయి. పెద్ద చీమలూ వస్తాయి. నల్ల చీమలూ వస్తాయి, ఎర్రచీమలు వస్తాయి. చీమలకూ పంచదారకూ ఉన్న సంబంధ మెలాంటిదో, జీవులకూ మహానుభావుల సాన్నిధ్యానికీ ఉన్న సంబంధం అలాంటిది.

ఇక మీరన్న రెండవవిషయం ఆయన తన పనులను వారిచేత చేయించుకొంటాడన్నది. ఇది మన స్కేలుతో ఆయనను కొలవడానికి ప్రయత్నించడం. ఆయనకు తన పనులంటూ ఏమీ లేవు. ఈ సత్యం వినటానికి విచిత్రంగానే ఉంటుంది. కాని అది సత్యం. బలహీనుల అవసరాలకు బలవంతులను వినియోగిస్తుంటారు. దరిద్రుల బాధలకు ధనవంతుల అండ కల్పిస్తారు. మంచిపనులు చేయాలన్న ఉత్సాహం కలవారికి మంచిపనులు చూపిస్తారు. ఇలా ఒకరిచేత ఒకరికి సహకరింపజేస్తూ చిన్నా, పెద్దా, బీద, గొప్ప భేదాలు లేని రామరాజ్యాన్ని నెలకొల్పుతున్నారు. ఇది మాస్టరుగారి పని. ఈ పనినే అందరిచేత అందరికోసం చేయిస్తుంటారాయన.

ఇక కార్లలో తిరగడం అన్నారు మీరు. ధనవంతుడి సమస్యలకు పరిష్కారాలు చెబుతూ, అతని కారులో అతనితో మాట్లాడుతూ, దారిలో అవసరంలో ఉన్న రోగార్తులైన బీదవారి యిండ్ల దగ్గర ఆగి వాళ్ళనుచూచి మళ్ళీ కారెక్కుతూ ఉంటా రాయన. ఉన్నవాళ్ళ కార్లలో ఆయన తిరుగుతున్నది ఉన్నవాళ్ళకు ధర్మమార్గాన మనశ్శాంతి నందించడానికీ, లేనివాళ్లకు బాధలలో సహాకరించడానికీ.

చూశారా! మనకు గలిగే అభిప్రాయాలకీ అసలు అక్కడున్న సత్యాలకీ ఎంత అంతరం ఉంటుందో!

ప్ర : మాస్టరుగారు ఉచితంగా వైద్యం చేస్తున్నారు బాగానే ఉంది. కాని మిగిలిన సమస్యలు ఎన్ని లేవు మన దేశంలో? మరి వాటన్నిటి సంగతీ ఏమిటి? ఒక్క వైద్యసేవ వల్లే దేశం బాగుపడిపోతుందా?

జ : మాస్టరుగారు తాను దేశంలో ఉన్న సమస్య లన్నిటినీ పరిష్కరించానని గాని, పరిష్కరిస్తున్నానని గాని ఎప్పుడూ చాటలేదు ఆయన తాను చేయగలిగిన పనులను ప్రతి ఫలాన్ని అపేక్షించకుండా లోకహితం కోరి చేస్తున్నారు. అంతే. ఆయన వైద్యం చేయగలరు. 24 గంటలూ వైద్య సేవకు ఆయన సిద్ధంగా ఉంటారు. ఆయన రచన చేయగలరు. సామాన్యుల కందుబాటులో ఉండేటట్లు పవిత్రమైన రచనలు చేసి లోకానికి అందిస్తున్నారు. ఒక ప్రక్క కేసును

చూస్తూ మరొక ప్రక్క గ్రంథాలను వ్రాయసకాండ్రకు డిక్టేటు చేస్తుంటారు. తన దర్శనానుభవాలలో ఆశ్రయించిన వారి కుటుంబాలకు రక్షణ కలుగజేసి వారిచేత కూడ లోక హిత కార్యక్రమాలను నడిపిస్తుంటారు. ఈ రీతిగా ఆయన తాను చేయగలిగిన స్వకర్మతో విశ్వరూపంలోనున్న అంత ర్యామిని అర్చిస్తున్నారు. అలాగే ఎవరికి వారు తాము చేయగలిగిన స్వకర్మతో సమాజాన్ని అర్చించ గలిగితే ఇంక సమస్యలనేవే ఉండవు. రాముని వలననే రామరాజ్యం రాదు. రామునిలా అందరూ ఉండటం వలన రామరాజ్యం వస్తుంది. అలాగే మాస్టరుగారి వలననే సమస్యలన్నీ పరిష్కా రంకావు. మాస్టరు గారిలా మనమందరం ఉండటానికి సంక ల్పిస్తే సమస్యలనేవే కనబడవు. మహానుభావులు మనకు దారి చూపిస్తారు. ఆ దారి వెంట మనం నడిచి గమ్యానికి చేరుకోవాలి. వారు దారి చూప గలరు, నడిపించగలరు కాని నడవటానికి మనం ఇష్టపడాలి. నడవటానికి మనమెంత వరకూ ఇష్టపడతామో గమ్యానికి అంటే అవధులు లేని ఆనందానికి మనం అంతవరకూ దగ్గరవుతాం.

ప్ర : మాస్టరు గారికి దగ్గర శిష్యులమని చెప్పుకొనే వాళ్ళల్లో కొందరు తలబిరుసుగా మాట్లాడుతూ ఉంటారు. కొందరు ఆఫీసుల్లో లంచాలు పుచ్చుకుం టూనే ఉంటారు. ఇదేనా శిష్యులుండ వలసిన తీరు? శిష్యులనిలా ఉండనిస్తే ఇంకా ఆయనేమి గురువు?

జ: బురద గుంటల మీద ఎండ పడుతోంది. మురుగు నేలల మీద ఎండ పడుతోంది. బూజుపట్టిన పదార్థాల మీద ఎండ పడుతోంది. నల్లుల మంచాలమీద ఎండ పడుతోంది. అంత మాత్రాన ఆ బురదగుంటలను, మురుగునేలలను, బూజుపట్టిన పదార్థాలను, నల్లుల మంచాలను ఎండ సృష్టించింది అనగలమా? వాటిని సూర్యరశ్మి సృష్టించడం లేదు. తన యొక్క అపారమైన శక్తిని వాటిపైన కూడా ప్రసరింపజేస్తోంది. క్రమంగా సరిదారిలోనికి వాటిని తీసుకొస్తోంది. అలాగే తలబిరుసు వాళ్ళను, లంచగొండులను, దోపిడిగాళ్లను మాస్టరుగారు సృష్టించడంలేదు. ఆ తలబిరుసు వాళ్ళు, లంచగొండులు, దోపిడిగాళ్ళుకూడా ఆయన అనుగ్రహానికి నోచుకుంటున్నారు. బురదగుంటలోని బురద సూర్యరశ్మి ప్రభావం వలన క్రమంగా ఎండిపోయినట్లే ఈ వ్యక్తులలోని అవలక్షణాలు కూడా క్రమంగా సర్దుకుంటాయి. కొన్ని బురద గుంటలు ఎండిపోయేటప్పటికి మరికొన్ని కొత్త బురదగుంటలు తయారైనట్లు, విద్యాలయాలలో ఎప్పుడూ ఒకటవ తరగతి ఉండి తీరినట్లు ఇలాంటి మహానుభావుల దగ్గర అలాంటివారు తప్పక తారసపడుతుంటారు. బాగుపడేవారు బాగుపడుతుంటే బాగుపడవలసిన వారు చేరుతుంటారు.

ఒక పెద్ద ఆసుపత్రిలో కొద్దిమంది డాక్టర్లు కొంత మంది నర్సులు కలసి రోగులకు తగిన సేవ చేస్తుంటారు. ఆ ఆసుపత్రికి వెళ్ళి, ఏమిటండీ, ఎప్పుడూ ఇక్కడ మూలుగు

లేనా, జబ్బులేనా ? మీకు విసుగు పుట్టడం లేదా ? అంటే వారు చిరునవ్వు నవ్వి "మేమున్నదే వారికోసం నాయనా! వారిని సేవించడం కోసమే మేమిన్ని విద్యలు నేర్చినది!" అంటారు. అలాగే మహానుభావుడు తన సహచరులతో కలిసి భవరోగాలతో సతమతమవుతున్న వారిని సేవిస్తుంటాడు. ఏమిటండీ అన్ని అన్యాయాలూ ఇక్కడే కనబడుతున్నాయి. అంటే "ఇక్కడ ఉంటేనే నయం నాయనా! అవి సర్దబడటానికి అవకాశం ఉంది. ఇంకెక్కడైనా ఉంటే చుట్టుపక్కల వారికి ప్రమాదం కదూ! అందువల్ల సాధ్యమైనంత వరకూ అలాంటి వాటిని మా దగ్గరకు తీసుకొంటూ ఉంటాము. మేము వచ్చిన పనే అది" అంటాడు.

మన ముపయోగించే అన్ని వస్తువులకూ, వాహనాలకూ అవి చెడిపోతే బాగుచేసే రిపేరు షాపులున్నాయి. మరి మనమే పాడైపోతే! ఆ పాడైపోయిన మనను బాగుచేసే రిపేరు షాపులే మహానుభావుల సన్నిధులు.

ప్ర : ఆఫీసుల్లో పనిచేసే మాస్టరుగారి శిష్యుల్లో కొందరు పని మాని మాస్టరుగారిని గూర్చి, ఆయన ఆశయాలను గూర్చి పక్కవారిని తోముతూ ఉంటారు. కొందరు పని ఎగ్గొట్టి మాస్టరుగారు నడిపిస్తున్న పరిశ్రమలలో తయారైన వస్తువులను చుట్టుపక్కల వారికి అంటకడుతుంటారు. వీరిలా బాధ్యతా

రహితంగా ప్రవర్తిస్తుంటే జనానికి మాస్టరుగారంటే ఎలాంటి అభిప్రాయ మేర్పడుతుం దంటారు ?

జ : కృష్ణుడు కర్తవ్యం నిర్వహింపజేసేందుకు గీత చెప్పాడు గాని కర్తవ్య నిర్వహణను మాని గీతను చెప్పుకోమని గాని, వినమని గాని చెప్పలేదు. అలా చెప్పుకోవటం మన దుర భ్యాసం అవుతుందిగాని మహానుభావుల మార్గం కాదు. అవసర మున్నప్పుడు, అవసరంలో ఉన్నవాడు వేడినప్పుడు వారు తమ బోధను ఆహారంగానో, ఔషధంగానో తగు మాత్రంగా అందిస్తారే తప్ప చిల్లులు పడిన నీళ్ళ కుండల్లా ప్రవర్తించరు. ఈ సత్యాన్ని గమనించి వారిని చూస్తూ మనని మనం దిద్దుకుంటూ ఉండాలి. పెద్దవాళ్లు చెప్పింది పక్క వాళ్లకు చెప్పకుండా ఉండలేకపోవటం కాదు కావలసింది. పెద్దవాళ్లు చెప్పినట్లు చేయకుండా ఉండలేకపోవటం కావాలి. ఈ మార్పు వచ్చేలోపల అనుభవింపబడే స్థితులలో ఉన్న వారే మీరు చెప్పిన వారు.

ఆఫీసు టైమ్‌లో మితిమీరి మాట్లాడటమే తప్పు. ఇక ఆ మాట్లాడినది ఎవరిగురించి అన్నది- ఫలానావాడు నూతిలో పడ్డాడట అంటే ఏ నూతిలో? మంచినీళ్ల నూతిలోనా? ఉప్పునీళ్లనూతిలోనా? అని అడగటం లాంటిది. ఇక ఆ టైమ్‌లో పత్రికలు, పరికరాలు అమ్ముతున్నారుట అంటే ఏ మంచి లక్షణాలను మాస్టరుగారిలో చూచి వారాకర్షింప బడ్డారో ఆ మంచి లక్షణాలకు వారు దూరమౌతున్నారన్న మాట.

ఉండువల్లనే సాటివారు వారిని అసహ్యించుకోవడం జరుగుతుంది. మనం చేసేది మంచిపనికదా! అని అనుకుంటున్నారే తప్ప ఆ మంచిపనిని కూడా చేయడానికి పద్ధతులు, నియమాలు ఉంటాయని వారికింకా బోధపడలేదన్నమాట.

ఇలాంటి పనులు తెలిసి ఎవరూ చేయరు. ఆవేశం అభిమానం క్రింద, ఆరాధన క్రింద చెల్లుబడి అవుతున్న స్థితిలో ఈ పనులు జరుగుతాయి. దీనికి, మాస్టరుగారికి ముడిపెట్టడం మన మిత్రుడి ఫోటోమీద మచ్చలుపడితే మన మిత్రుణ్ణి హాస్పటల్‌లో చేర్చడానికి ప్రయత్నించడం లాంటిది. వారి మేలుకోరిన వారమైతే ప్రేమతో, సహనంతో ఆ మచ్చలను సర్దగలగాలిగాని రచ్చకెక్కించి ప్రయోజన మేమిటి ? వారు మాస్టరుగారిని గూర్చి ప్రచారం చేస్తున్నా మనుకొని అపచారం చేస్తున్నారు. వారపచారం చేస్తున్నారని మనం ప్రచారం చేయడంలో కాలాన్ని వ్యర్థం చేసికొని మన కండూతిని మనం తీర్చుకుంటున్నాం. చూశారా! వారు మాస్టరుగారిని గూర్చి చెప్పకుండా ఉండలేకపోతున్నారు. మీరు ఆ చెప్పుకుంటున్న వారిని గూర్చి చెప్పకుండా ఉండలేకపోతున్నారు. అయితే వారి శ్రేయస్సు కోరిచెబుతున్నా మని మీరు అనుకోవచ్చు. నిజంగా మీరు వారి శ్రేయస్సు కోరిన వారైతే వారికే నచ్చచెప్పడానికి ప్రయత్నించండి. వారు వింటారా సంతోషం. వినలేదా, వారి ఖర్మకు వారిని వదిలి మీ పని మీరు కామ్‌గా చేసుకోండి.

ప్ర : మీరు ఉత్సవాలు అవీ జరుపుతున్నప్పుడు పెద్దలందరి ఫోటోలతో కలిపి మాస్టరుగారి ఫోటోను కూడా పెడతారు గదా ? ఆయన పాల్గొనే ఉత్సవంలో ఆయన ఫోటోను ఆయన పెట్టనివ్వడమేమిటి?

జ : ఉత్సవాలు జరుపుకుంటున్నది మేము. మేము దైవంగా పూజిస్తున్న అందరి ఫోటోలూ ఉత్సవాలలో పెట్టుకొంటూ ఉంటాం. దైవం మమ్మల్ని నడిపేందుకై మాస్టరుగారి రూపంలో వ్యక్తమైనట్లు దర్శించిన వాళ్లం కాబట్టి ఆయన ఫోటోను తప్పనిసరిగా పెట్టుకుంటాం. ఈ విషయంలో ఆయన పెట్టుకొమ్మనీ చెప్పలేదు, వద్దనీ చెప్ప లేదు. పెట్టుకొమ్మని చెప్పినా, వద్దని చెప్పినా అహంకారమే అవుతుంది. తాను, తన రూపు, మనము, మనరూపులు ఎక్కడ నుండి దిగి వచ్చాయో ఆయనకు తెలుసు. మనం అభివృద్ధి చెందడం, సమర్థులం కావడంకోసం తనను తానే త్యాగం చేసుకొన్న మాస్టరుగారు మనకోసం తన ఫోటోని త్యాగం చేయలేరా ? పూజల్లో పెట్టబడుతున్న ఫోటోలన్నీ అలా త్యాగం చేసుకొన్న వాళ్ళవే. మీరూ అలా పరివర్తిస్తే మీ ఫోటోను కూడా ఆ ప్రక్కన పెట్టి పూజిస్తాం. కొందరి మూర్తులను పెట్టి పూజించడం దేనికోరకంటే సృష్టిలోని అన్ని మూర్తులలోనూ ఉన్నది ఒకే వెలుగని దర్శించడం కోసం. ఆ వెలుగులోనికి మనను నడిపించే దివ్యమూర్తుల

చిత్రపటాలను పెట్టుకొని ఆరాధించడం మనకొరకే గాని వారి కొరకు కాదు.

ఒక మారు షిరిడీలో బాబా దగ్గర కొందరు భక్తులు చేరి 'జై సాయినాథ్' అని భజన చేస్తున్నారు. కొంతసేపటికి బాబా కూడా వారిలో కలిసి "జై సాయినాథ్" అంటూ భజన చేశాడు. వారంతా ఆశ్చర్యపోయి ప్రశ్నించగా "మీరందరూ ఎందుకు చేస్తున్నారో నేనూ అందుకే చేస్తున్నాను" అన్నాడు. ఫోటోల విషయం కూడా ఇలాంటిదే.

ప్ర : మీ పెండ్లి శుభలేఖల మీద మీ గురువుగార్ల ఫోటోలు వేసారు. పూర్వం దేవుళ్ల ఫోటోలు మాత్రమే శుభలేఖలమీద ఉంటూ ఉండేవి. ఈ మధ్య ఏకంగా మనుష్యుల ఫోటోలే వేసేస్తున్నారు.

జ : మీరేమి అనుకోకపోతే ఒక్కమాట అడుగుతాను. మీరు దేవుడని పిలుస్తున్నది ఎవరిని? రాముణ్ణి, కృష్ణుణ్ణి. వాళ్ళు కూడా ఒకప్పుడు ఇలా జీవించిన మనుషులే కదా ? వాళ్ళ ప్రవర్తననుబట్టి వాళ్ళు దేవుళ్ళని తెలుసుకున్నప్పుడు అదే ప్రవర్తనగల వీరెందుకు దేవుళ్ళుకాదు ? ఇంతకీ మీ బాధేమిటంటే బొత్తిగా మనకు తెలిసిన వ్యక్తి, మనతో తిరిగినవ్యక్తి దేవుడిగా ఆరాధింపబడడ మేమిటి? అని. మానవ మనస్తత్వం నాకు బాగా తెలుసు. అయినవాణ్ణి, బాగా తెలి

సిన వాణ్ణి, బ్రతికున్నవాడిని భగవంతుడని అంగీకరించి పూజించబుద్ధి కాదు చాలామందికి. శరీరంలో లేనివాడికో, విగ్రహానికో దణ్ణం పెట్టుకుంటే చాలదా! అనిపిస్తుంది. ఆ శరీరంతో లేనివారు, విగ్రహాల రూపంలో ఆరాధింపబడు తున్నవారు మనకు దర్శన మివ్వాలంటే శరీరంతో నడు స్తున్న ఇలాంటి అవతార మూర్తుల పాదాలు పట్టక తప్పదు. ఆ పాదాలు పట్టడానికి మొహమాట పడినవాడు దైవ దర్శ నాన్ని ఆ జన్మకు వాయిదా వేసుకొంటున్నాడు, అంతే.

ప్ర : మీరు మాస్టరుగారి ఫొటోలకు దండలు వేస్తు న్నారు. బ్రతికున్నవారి ఫొటోలకు దండలు వేయ డం మన సంప్రదాయం కాదుగదా?

జ : మంత్రిగారు వస్తే దండలు వేస్తున్నాం. పండితులు వస్తే దండలు వేస్తున్నాం. పెండ్లిలో దంపతులు ఒకరికొకరు దండలు వేసుకొంటున్నారు. బ్రతికున్న వారికి దండలు వేయడం, వేసుకోవడం సంప్రదాయమైనపుడు, బ్రతికున్న వాళ్ల ఫొటోలకు దండలు వేసి ఆరాధిస్తే తప్పేమిటి? దండ మన ప్రేమకీ, గౌరవానికీ, భక్తికీ చిహ్నం. దాన్ని వేయ డంలో తప్పేమీ లేదు.

ప్ర : వివాహమైన వాళ్లు, సంసారాలతో ఉన్నవాళ్లూ, పిల్లల బాగోగులను చూచుకుంటున్న వాళ్లు గురువు

లేమిటి ? వాళ్లు చెప్పడమూ ఈ జనమంతా గొర్రెల్లా వెంటపడడం బాగానే ఉంది.

జ : వివాహమైనవాడు, సంసారంతో ఉన్నవాడు ఉపదేశించడానికి పనికిరాడంటే భగవద్గీతను ఉపదేశించిన కృష్ణుడికీ, అందుకున్న అర్జునునికీ ఇద్దరికీ మీరు చెప్పిన క్వాలిఫికేషన్ లేదు. పైగా అంతా చెప్పి "కావున అర్జునా యోగివి కావయ్యా!" అంటాడు కృష్ణుడు. ఆ తర్వాత కూడా వారిద్దరూ భార్యాబిడ్డల్ని వదలిపెట్టినట్లు దాఖలా లేదు. రాముడికి భార్య లేకపోతే రామాయణమే లేదు. అయితే ఏసుక్రీస్తూ, శంకరుడు మొదలైనవారి మాటేమిటి అనవచ్చు. వాళ్లు స్పెషల్ డ్యూటీ మీద భూమికి దిగివచ్చి కొద్దికాలం మాత్రమే భౌతికశరీరంతో ఉండి వెళ్లిపోయిన వారు. అంతేకాక మానవ పరిణామంలో చరమదశలో కామస్పర్శలేని దివ్యదేహాలు లభిస్తాయి. అలాంటి వారు తమ ప్రణాళికకు అవసరమనుకుంటే వివాహం చేసుకుంటారు. ప్రణాళిక వేరుగా ఉంటే ఆ మాట తలపెట్టరు. అలాంటి వారిని చూచి అందరూ బలవంతంగా వివాహం మానేసి ఇబ్బందులకు లోనుకాకూడదు. వ్యాసుతాదులను చూచి "వారికి మంగలి కత్తిని మింగబోకు" మని రామకృష్ణుడు హెచ్చరించాడు.

మన పెద్దలందరూ చతురాశ్రమాలతో కూడిన పరిపూర్ణ జీవితానికే ప్రాముఖ్య మిచ్చారు. విద్యార్జన అయ్యే

వరకూ అన్యచింత లేక బ్రహ్మచర్యం వహించి విద్యలో నిష్ణాతుడై సంఘాన్ని సేవించడం ప్రారంభించి గృహస్థాశ్రమం స్వీకరించాలి. తనస్వకర్మతో సమాజాన్ని అర్చిస్తూ దానివలన నడచివచ్చిన అపరిగ్రహంతో భార్యా బిడ్డలను, తల్లి దండ్రులను, అతిథులను అందరినీ చక్కగా తృప్తి పరచాలి. వంశాంకురాలైన పిల్లల్ని పెంచి, పెద్దజేసి వాళ్ళకు బాధ్యత లప్పజెప్పి, తాము అందరి శ్రేయస్సు కోరుతూ పెద్దలను పూజిస్తూ, ఆర్తులను సేవిస్తూ అందరికీ చెందిన వారై ప్రశాంత జీవనం నడపాలి. ఈ స్థితినే వానప్రస్థాశ్రమం అంటారు. ఆపైన తాము వచ్చిన పని అయిపోయినదని తెలియగానే మనస్సు, ఇంద్రియాల విషయంలో మౌనం వహించాలి. దీనినే సన్న్యాసాశ్రమం అంటారు. క్రమంగా తాము శరీరాన్నుండి విడివడి పంచభూతాలు అమర్చి పెట్టిన ఈ శరీరాన్ని కృతజ్ఞతతో పంచభూతాలకు తిరిగి సమర్పించాలి. ఇది మన వారు మానవుని కొరకు ఏర్పరచి ఉపదేశించిన పరిపూర్ణజీవిత విధానం. మహానుభావులందరూ ఈ మార్గాన్ని అనుసరించిన వారే, ఏకొద్దిమందో తప్ప. సమాజంలో రామరాజ్యం నెలకొనాలి అంటే ఋషులు చెప్పిన మార్గంలో వర్ణాశ్రమ ధర్మాలు పాటించి తీరాలి.

మాస్టరుగారు మానవుడెంత నిండుగా జీవించగలడో, నిండుగా జీవించాలో ఆచరణలో చూపిస్తున్నారు. ఆయన కుటుంబ జీవితాన్ని ఆదర్శంగా పెట్టుకొని కొన్ని వందల

కుటుంబాలు ప్రశాంతంగా జీవించగలుగుతున్నాయి. అందు వల్లనే రామాయణ భారతాలు వినాలి అంటే మాస్టరుగారి లాంటివారి దగ్గరే వినా లభిస్తుంది నాకు. ఎందువల్లనంటే ఆ పవిత్ర గ్రంథాల పరమార్థాన్ని తమ జీవిత క్షేత్రాలలో పండించి పదిమందికీ పంచిపెడుతున్న వారు వారు.

ప్ర : సనాతన ధర్మమంటారు. మరి గురుపూజల్లో జరిగే వడుగులకూ, పెళ్ళిళ్ళకు ముహూర్తాలు అవీ శాస్త్రీయంగా ఎందుకు పెట్టరు? ముగ్గురు నలుగురు అన్న దమ్ములకు కూడా ఒకేసారి వడుగులు జరిపించేస్తుంటారు. శాస్త్రమార్గానికి మాస్టరుగారి ఈ నిర్ణయాలు విరుద్ధమైనవి కావా?

జ : కావు. శాస్త్రం మీరు పూర్తిగా చదివి అప్పుడు చెప్పాలి- ఆయన ప్రవర్తన శాస్త్రీయమో, కాదో! అక్కడక్కడా మీ చెవిన బడిన ముక్కలను, నమ్మకాలను తీసుకొని వచ్చి శాస్త్రమనుకోమంటే ఎలా? వరాహమిహిరుడు బృహజ్జాతకంలో చెప్పాడు. దైవసన్నిధిలో, గురుసన్నిధిలో, గోశాలలో శుభకార్యాలు జరుప దలచినప్పుడు ముహూర్తాల ప్రసక్తే లేదని. ఆ పరమ గురువు వాక్యానికి అనుగుణంగానే గురుపూజలలో శుభకార్యాలు జరుగుతాయి.

ఇక ఇద్దరు ముగ్గురు అన్నదమ్ములకు ఒక్కసారే వడుగు

చేయవచ్చా అని. దశరథుడు రామ లక్ష్మణ భరత శత్రుఘ్ను లకు ఒక్కసారే ఉపనయనం చేశాడు. రామాయణ మొకసారి చూడండి.

ప్ర : ఇంత తెలిసిన మాస్టరుగారు మంచి, చెడూ, వర్జ్యం వారం ఏమీ లేవు, అన్ననీ మనం పెట్టుకొన్నవే నంటారేమిటి ?

జ : నిజమే. భగవంతుడు కాలస్వరూపుడుగా వ్యక్తమైతే మన మా కాలంలో ఇది మంచనీ, ఇది చెడనీ నిర్ణయించుకొన్నాము. నిజానికి తిథులు, నక్షత్రాలు మొదలైన వాటిల్లో ఏవీ మంచివీకావు. ఏవీ చెడ్డవీకావు. కాకపోతే మన పనిని బట్టి ఏ తిథి, ఏ నక్షత్రం అనుకూలిస్తుందో చూచుకోవాలి. కాఫీ కావాలంటే కాఫీ హోటల్‌కు వెళ్లాలి. కాఫీపొడి కావాలంటే కిరాణాకొట్టుకు వెళ్లాలి. మన అవసరాన్ని బట్టి ఏదో ఒకదాని దగ్గరకు వెళుతున్నాం గాని రెండవది చెడ్డదని నిందిస్తున్నామా? తిథులు, నక్షత్రాలు, కాలవిభాగాల విషయం కూడా అంతే. మన పని తరహాని బట్టి తదనుకూలమైన కాలంలో చేసుకోవాలి. అంత మాత్రం చేత మిగతావన్నీ చెడ్డవనటం అవివేకం. అష్టమి నవములు కష్టతిథులంటాం. మన అవతార మూర్తుల్లో కృష్ణు డష్టమినాడు పుడితే, రాముడు నవమినాడు పుట్టాడు. మళ్ళీ కృష్ణాష్టమి, శ్రీరామ నవమి జరుపుకుంటూనే ఉంటాం వైభవంగా. అమావాస్య ముందు చతుర్దశి మంచిది కాదంటారు. మరి కృష్ణుడు

ఆ చతుర్దశినాడే నరకాసురుణ్ణి వధించి నరకచతుర్దశిని, అమావాస్యను పండుగలుగా చేశాడు. ధర్మ సంస్థాపనకోసం జరిగిన కురుక్షేత్ర మహా సంగ్రామం కూడా అమావాస్య నాడే ప్రారంభమైంది. ఆ ముహూర్తం కూడా కృష్ణుడే పెట్టాడు. మన పెద్దలు పనుల స్వభావాన్ని ఎరిగి, కాలస్వభావాన్ని దర్శించి ఒకదాని కొకటి జతకూర్చారేగాని దేనినీ నిందించలేదు.

ఈ నిందించడం, మీన మేషాలు లెక్కపెట్టడం అలెగ్జాండర్ దండెత్తి వచ్చినప్పుడు గ్రీసువారి నుండి మన వారికి అంటుకున్నాయి. అమావాస్యనాడు గడ్డం గీసుకో కూడదు. శిశువు పుట్టిన నక్షత్రం మంచిది కాకపోతేనూ నెలో ముఖం చూచుకోవాలి. మొదలైనవన్నీ గ్రీకుల దగ్గరనుండి మనవాళ్లంటించుకున్నవి.

ప్ర : ఒక పక్క జాతక చక్రాలు చూస్తూ ఉంటారు. మరో ప్రక్క నాకు జాతకాలపై విశ్వాసం లేదంటా రేమిటి మాస్టరుగారు?

జ : జాతకచక్రాల వల్ల ఆ యా జీవుల స్వభావాలు, మానవపరిణామంలో వారున్న స్థితి, ఈ జీవితంలో వారికి తటస్థపడటానికి అవకాశం ఉన్న సన్నివేశాలు మొదలైనవి తెలుస్తాయి. దాన్ని బట్టి మన స్వభావంలోని లోపాలను దిద్దుకొని మంచిగుణాలను పెంపొందించుకోవాలి. జాతక చక్రం మన జీవిత స్వభావాన్ని తెలియచేస్తుంది. ఆ స్వభావాన్ని

అంతకన్నా మెరుగుపరచుకొంటామా, పతనపరచుకుంటామా అన్నది మన చేతుల్లోనే ఉంటుంది. కనుక " మన దేముంది. జాతకంలో ఎలా ఉంటే అలా జరుగుతుంది." అని ఎవరైనా అంటే "నాకీ అభిప్రాయం మీద విశ్వాసం లే" దంటారు. మాస్టరుగారు. జరగవలసింది నుదుటిమీద బ్రహ్మదేవుడిచేత కక్కుకొట్టబడి ఉంటుందని మనలో చాలామంది నమ్మకం. "వాడి కంత శాలీ లేదు, ప్రతివాడిముఖంమీద కక్కుకొట్ట డానికి. ఎవడి ముఖంమీద వాడే వ్రాసుకుంటున్నాడు ఏం జరగాలో. మరో రెండు పెసరట్లు ఎక్కువ తింటున్నవాడు మరో అరగంటలో కడుపునొప్పి వస్తుందని వ్రాసుకోవడంలా! ఏదైనా అంతే" అంటారు మాస్టరుగారు.

మన మున్న స్థితిగతులనుండి మనం నడవవలసిన దారిని చూపేది కాబట్టే దానిని జ్యోతిర్విద్య అన్నారు. ఆ మార్గంలో ఎలా నడువవలసిందీ, ఆ గమ్యం ఎంత పవిత్ర మైనదీ, మాస్టరుగారు Spiritual Astrology అనే పవిత్ర గ్రంథంలో వివరించారు. ఆ గ్రంథాన్ని చదివితే మనకు బోధపడుతుంది, "జ్యోతిర్విద్య మీన మేషాలు లెక్కపెట్టు కోవడానికి కాదు మనపెద్దలిచ్చింది. వేదాల తాళాలను తీసే తాళం చెవిగా వారిచ్చారు" అని. అందువల్లనే వేదాంగా లలో అది ప్రధానమైనదైనది. గుడ్డివాడికి పరిసరాల స్వరూప స్వభావాలెంత తెలుస్తాయో జ్యోతిర్విద్య అనే కన్ను లేని వాడికి వేదాల పరమార్థం అంతే తెలుస్తుంది. మన కళ్లున్నా

చీకటిలో దీపం లేకపోతే ఈ ప్రపంచాన్ని చూడటానికెలా అశక్తులమవుతున్నామో కావల్సినంత పాండిత్యమున్నా జ్యోతిర్విద్యా దర్శనం లేనిదే వేదప్రపంచాన్ని దర్శించడానికి మన మలాగే అశక్తుల మవుతాం. అందుకే దానిని "జ్యోతిర్విద్య" అని సార్థకంగా పిలిచారు మనవాళ్లు.



ప్ర : వరల్డు టీచర్ ట్రస్టు పత్రికలు కూడా నడుపుతోంది గదా ? ప్రచార సాధనాలుగా వీటిని స్వీకరించిందా ?

జ : పత్రికల ద్వారా ట్రస్టు చేస్తున్నది ప్రచారం కాదు, ప్రసారం. మానవాళి అభ్యుదయం తప్ప ట్రస్టుకు కావల్సినది ఏమీ లేదు. అందువల్లనే మానవులు ప్రశాంత సుఖజీవనం నడపడానికి ఏ సత్యదర్శనం అవసరమో ఆ సత్య దర్శనాన్ని పత్రికలు రచనల ద్వారా అందిస్తున్నది ట్రస్టు. " మన మనుకొన్నది, మనకు నచ్చినది లోకంమీద ఎన్నడూ రుద్ద కూడదు. లోకానికి ఏది కావాలో, లోకానికి ఏది శ్రేయస్సో దానిని మనం అందించ గలగాలి. జాతి అవసరం తీర్చగలగాలి గాని మనకొచ్చిన ఆవేశంతో జాతిని ఇబ్బంది పెట్టగూడదు. " అంటారు మాస్టరుగారు.

ట్రస్టు తెలుగులో 'నా వాణి' ని ఇంగ్లీషులో My Lightను మాసపత్రికలుగా ప్రచురిస్తున్నది. ఈ రెండు ఒక దాని కొకటి అనువాదాలు కావు. దేని ప్రణాళిక దానికి ఉంది.

పత్రికల్లో మూడురకాల పత్రిక లుంటాయి. మొదటి రకం పత్రికలు మనమేది కోరుతూ ఉంటామో దాని నిస్తుంటాయి. అంటే మనలోని ఆవేశాలను రెచ్చగొట్టి, నడిపే వారికి సొమ్ము చేసిపెడతాయి. రెండవ రకం పత్రికలు కాలక్షేపానికి, విశ్రాంతి కాలంలోనూ, ప్రయాణాలలోనూ

చదువుకోవటానికి పనికివస్తాయి. ప్రయాణమై పోగా నే ప్రయాణంతో బాటు వాటి పని కూడ అయిపోతుంది. ఇక మూడవరకం పత్రికలు మనకేది కావాలో దాని నిస్తాయి. మనలోని ఆవేశాలను కరిగించి, దివ్య పథ్యం లోనికి మనను మేల్కొలిపి నడిపిస్తాయి. నడుస్తున్న మనకు చేయూతనిస్తూ ఉంటాయి. ఎప్పటికప్పుడు ఉత్సాహాన్ని కలిగిస్తూ, ముందు దారి చూపిస్తూ, శ్రమ కలగని రీతిలో కొందరికి మాత్రమే చెందే స్థితినుండి అందరికీ చెందే స్థితికి మనను నడిపిస్తూ ఉంటాయి. ఇలా నడిపిస్తున్న తరగతికి చెందినవే నావాణి, My Light లు.

ప్రతి నెలా 22వ తేదీ వచ్చేటప్పటికి వివిధ ప్రాంతాలలోని సోదర బృందం, ఆస్తిక జనులు ఈ పత్రికల కోసం ఎదురు చూస్తూ ఉంటారు వేయికళ్ళతో. ఆకలితోనున్న పిల్లవాడు తల్లిరాకకై వేచినట్లుగా ఎందరెందరో ఈ పత్రికలకై ఎదురు చూడడం నే నెరుగుదును. పత్రిక చేతిలోనికి రాగానే మాస్టరుగారే ప్రత్యక్ష మయ్యారా! అనిపిస్తుంది. చదవటం ప్రారంభించినప్పటి నుండి మాస్టరుగారు మనకుపదేశిస్తున్నట్లుంటుంది కాని మనం చదువుతున్నట్లు ఉండదు. ఈ విధంగా జాతికిగల దప్పికను తీర్చడానికే ఈ పత్రికలు నెలకొల్పబడ్డాయి. పత్రికల రూపంలో ఇన్ని వేలమందికి మాస్టరుగారి సాక్షాత్కారం, సందేశం సులువుగా అందుతున్నాయి.

ఎలక్ట్రిక్ ప్లాంట్ నుండి లాగబడిన తీగల ద్వారా మనయింటి వరకూ విద్యుత్తు నడచివచ్చి దీపాలు వెలిగిస్తున్నట్లు, ఈ పత్రికల ద్వారా మాస్టరుగారి దివ్య సందేశం ఇంటింటా ప్రసరించి ప్రతి హృదయంలోనూ జ్ఞాన జ్యోతులను వెలిగిస్తున్నది. వ్యక్తులను కర్మవీరులుగా, ధర్మవీరులుగా చేస్తున్నది. అనేక ప్రాంతాలలో ఆచరణ శీలురై ఆనందమయ సహజీవనాన్ని పెంపొందిస్తున్న బృందాలకు మాస్టరుగారందిస్తున్న జ్ఞాన ఆహారమే ఈ పత్రికలు. వీటి విలువ అనుభవించిన వారికి తెలుస్తుంది. ఆచరిస్తున్న కొద్దీ దర్శనమిస్తుంది.

ప్ర : హోమియోకు సంబంధించిన పత్రిక కూడా పెట్టారట గదా ? మొత్తం మీద ట్రస్టు పెద్ద యెత్తున కృషి చేస్తున్నదన్నమాట !

జ : చాలాకాలం నుండి మాస్టరుగారి దగ్గర శిక్షణ పొంది వివిధ ప్రాంతాలలో వైద్య కేంద్రాలు నిర్వహిస్తున్న వైద్యులు, మన దేశంలోను, ఇతర దేశాలలోను, ప్రామాణికమైన హోమియో పత్రికకొరకు ఎదురు చూస్తున్న జిజ్ఞాసువులు మన ట్రస్టునుండి సరైన పద్ధతిగల హోమియో పత్రిక వెలువడాలని కోరుతూ వచ్చారు. వారందరి కోరికను దృష్టిలో పెట్టుకొని " హోమియో బ్రదర్‌హుడ్ " అనే పేరుతో సామాన్యునికి కూడా అందుబాటులో ఉండేటట్లు హోమియో పత్రికను ప్రారంభించింది

ట్రస్టు. ఎన్నో వేలు ఖర్చుపెట్టి హోమియో విద్యాలయాలలో సమగ్రంగా పొందలేని హోమియో విధానాన్ని శ్రద్ధ గల వాడు ఈ పత్రికద్వారా క్రమంగా, సక్రమంగా, సమగ్రంగా పొందగలడు.

ప్ర: సాహిత్య రంగంలో కూడా సరైన పత్రికను ట్రస్టు ప్రారంభిస్తే జాతికి ఆ లోటు కూడా తీరుతుంది గదా?

జ: మీ సంకల్పమే ట్రస్టు వారికీ కలిగింది. నేడు జాతి సరైన సాహిత్య పత్రిక కోసం ఎదురు చూస్తున్న మాట వాస్తవం. సాహిత్య పత్రికలలో శీర్షికలు ఎలా నిర్వహించాలో తెలియకపోవడం వలన నేడు చాలా సాహిత్య పత్రికలు పండితులకు, తెలుగు సాహిత్య విద్యార్థులకు మాత్రమే పరిమితమై పోయాయి, ఇలాంటి స్థితిలో పామర జనులకు కూడా పనికివచ్చే నిజమైన నిండైన సాహిత్య పత్రికను మనం రూపొందించుకోవలసి ఉంది. ట్రస్టు కొద్ది కాలంలోనే ఇలాంటి సాహిత్య పత్రికను ప్రారంభించ బోతున్నదని తెలియజేయడానికి నిజంగా నేనెంతో ఆనం దిస్తున్నాను.

ప్ర: మాస్టరుగారు అసమాన ప్రజ్ఞాశాలి గదా! స్వయంగా గ్రంథాలు వ్రాయడం కన్న వ్యాఖ్యా నాలకే ఎక్కువ ప్రాధాన్యం ఎందుకిస్తున్నారు?

జ : మాస్టరుగారే కాదు, జాతి శ్రేయస్సు కోరిన పెద్ద లందరూ జాతికి ఈయవలసింది ఇచ్చామా ? లేదా ? అన్న విషయంలో శ్రద్ధ వహించారే గాని, ఇచ్చింది మన స్వంతమా ? కాదా ? అని మోహపడలేదు. వ్యాసుడంతటివాడు తన నాటికి ఉన్న వేదాలను విభాగించి ఆ వేదార్థాన్ని మానవుల జీవితాలలో పండించడానికే తన గంటాన్ని, జీవితాన్ని అంకితం చేశాడు. ఈ సత్యాన్ని దర్శించిన వారు కాబట్టే తెలుగువారైన నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన. తామెంతటి ప్రతిభావంతులైనా జాతికి అందవలసిన భారతానువాదానికి తమ ప్రతిభా వ్యుత్పత్తులను సమర్పణ చేసికొన్నారు. స్వంతంగా వ్రాసి పేరు పొందడంకన్నా మన జాతి కోరుతున్న భారతాన్ని తెలుగులో అందించడమే తమ జీవిత పరమార్థంగా పెట్టుకొన్నారు. పోతన కూడా భాగవతాన్ని ఈ పద్ధతిలోనే తెలుగువారికి అందించాడు. దీన్ని బట్టి తోస్తున్న దేమిటంటే మన పెద్దలకు స్వంతంగా చెప్పాలన్న మోజు లేదు. చెప్పవలసినది సొంతంగా చెప్పాలన్న దీక్ష ఉన్నది. వేదార్థాన్ని కథలలో పొదిగి అందించడానికి వ్యాసు డంకితమైతే, వ్యాస హృదయాన్ని తెలుగులో వినిపించడానికి నన్నయాదులు అంకిత మయ్యారు.

ఇది ఇలా ఉండగా వ్యాసుడు కథలలో పొదిగిన వేదార్థం దర్శించి ఇచ్చే వారు ఏ కారణంచేతనో ఈ ఐదువేల సంవత్సరాలలోను భూమికి దిగి రాలేదు. ఈ నాడు మాస్టరు గారు ఆ వేదార్థాన్ని విడమరచి తీయగా, తేటగా, సూటిగా

సామాన్యులకు కూడా అనుభవంలోనికి వచ్చేటట్లుగా అందించడానికి దీక్ష వహించారు. పూజ్యులు రామకృష్ణ చెట్టిగారు హృదయపూర్వకంగా కోరడంతో భాగవత రహస్య ప్రకాశ రచనతో ఈ వేదార్థ స్థాపన మనే యజ్ఞం ప్రారంభమయింది. ఈ యజ్ఞాన్ని నిర్వహించడానికే ఈయన దిగివచ్చారా! అనిపిస్తుంది ఈ ప్రకాశపఠనం ప్రారంభించిన వారికి.

అది యిది యని చెప్పలేని ఆకర్షణ ఏదో ఈయన రచనలో అంతటా పరుచుకొని ఉంది. పూర్ణిమనాటి వెన్నెల లాగా దివ్యమైన చల్లటి స్పర్శ ఈయన రచనను ఏ మూల ముట్టినా మనకు లభిస్తుంది. మామూలుగా మనం మాట్లాడే మాటలే మాస్టరుగారి రచనలలో ఎంతో శక్తితో దీప్తితో మనకు కనిపిస్తాయి. బహుశా వేదభాషలో వ్రాయడం అంటే ఇదేనేమో అనిపిస్తుంది. ఆయన దిగివచ్చిన పనే ఈ వేదార్థ స్థాపనమైనపుడు స్వంతరచనలకు ప్రాధాన్య మీయరేమి? అనే ప్రశ్నే ఉండదు. స్వంతంగా మనందరం చేస్తున్నాం కదా! చాలు.

ప్ర : ఆముక్తమాల్యద ఉండగా మళ్లీ గోదాదేవి కథనే మాస్టరుగారు కావ్యంగా వ్రాశారు. కారణ మేమిటి?

జ : కావ్యాన్ని చదివితే కారణం మీకే తెలిసి ఉండేది. కృష్ణదేవరాయలంటే మాస్టరుగారికెంతో గౌరవం. "ఆయన రాజర్షి, దక్షిణదేశంలో పుట్టిన జనకుడు" అంటారు మాస్టరు

గారు. అలాంటి వ్యక్తి చేసిన తపస్సునకు ఫలమే ఆముక్త మాల్యద. ఈ కావ్యంలో గోదాదేవి కథ ప్రధానమైన దైనా సంక్షిప్తంగా ఉందనే చెప్పవలసి ఉంది. ఉపకథలు చాలా ఉన్నాయి ఈ కావ్యంలో. జాతికి సమన్వయ సందేశ మీయదలచిన రాయలకు కావ్యంలో ఆ ఉపకథలను చెప్పడం తప్పనిసరి. చెప్పాలి కూడాను.

కృష్ణదేవరాయల హృదయాన్ని దర్శించిన మాస్టరు గారు గోదాదేవి కథనూ, అపారమైన దాని శక్తినీ యెరిగిన వారై ప్రత్యేకమైన కావ్యంగా మలచి కృష్ణదేవరాయల సంకల్పాన్ని నెరవేర్చారు. అక్కడి గోదాదేవే ఇక్కడ ఈ కావ్యంలో పరిపూర్ణ వైభవంతో మనకు దర్శన మిస్తుంది. ఋషి ఋణం తీర్చుకోవడమంటే ఇదేనేమో అని పిస్తుంది నాకు.

ఈ కావ్యంలోని విశిష్టత ఏమిటంటే చదవడం ప్రారంభించి నప్పటినుండి మనం గోదగా మారి మెల్లగా కృష్ణుని చేరి కావ్యం పూర్తి అయ్యేటప్పటికి ఆ కృష్ణయ్యలో కరిగి పోతాము. జీవి ప్రారంభించిన సాధన కావ్యంతో పాటు కొనసాగి కావ్యం పూర్తయ్యేటప్పటికి పరిపూర్ణతను పొందు తుందనిపిస్తుంది నాకు.

ప్ర : మాస్టరుగారు మంద్రజాలం అనే నవల వ్రాశారు. కదా! అదేమి మంద్రజాలమో చదువుతుంటే

చాలా గమ్మత్తుగా ఉంటుంది. ఒకసారి చదివితే చాలదనుకుంటాను ?

జ : నిజమే, ఒకసారి చదివితే చాలదు. ఒక్కొక్కసారి చదివినప్పుడు మనకు సత్యదర్శనం పొందడానికి ఒక్కొక్క ద్వారం తెరుచుకుంటుంది. కృష్ణుడు శరీరం వదిలిపెట్టబోయే ముందు జరిగిన కొన్ని సన్నివేశాలూ, వాటి ప్రభావం ఈ నవలగా మలచబడ్డాయి. అవతారాన్ని చాలిస్తూ కృష్ణుడు మైత్రేయుని లోనికి దిగివచ్చి మైత్రేయుని హృదయం నుండి మందత్రిజాల మార్గంలో జీవులను ఉద్ధరించడానికి నిర్ణయించుకోవడం ఈ నవలలో హృద్యంగా చూపబడింది. పరమ గురువులు, వాళ్ళు పనిచేసే తీరు, శిష్యులకు వాళ్ళు శిక్షణ ఇచ్చే పద్ధతి చక్కగా తెలియజేయబడ్డాయి. పుస్తకం చదువుతున్నంతసేపూ మనం వాళ్ళతో ఉంటాం గాని మనలో ఉండం.

భాగవత కాలం నుండి మొన్నటివరకు గుప్తంగా ఉంచబడిన ఈ దివ్య సత్యాలు మాస్టరుగారి ద్వారా ఈ మందత్రిజాలంగా దిగి వచ్చాయి. ఇలాంటివి ఇంకా నాలుగు నవలలు మాస్టరుగారి నుండి రావలసి ఉంది. మందత్రిజాల కథకు ముందు వెనుకల జరిగిన గాథలన్నీ ఆ నవలల్లో ఇదే పద్ధతిలో ఈయబడతాయి. ఇదొక అపురూపమైన ప్రణాళిక. ఒక్క మందత్రిజాలమే మననింతగా కదిలిస్తే మిగిలిన ఆ నాలుగు నవలలూ దిగివచ్చిన తరువాత ఎలా ఉంటుందనేది

మాటల్లో చెప్పడానికి సాధ్యమయ్యేది కాదు. ఆ ప్రణాళిక లోనిదే మాస్టరుగారినుండి ఇటీవల దిగివచ్చిన మహోన్నత చారిత్రిక నవల పురుషమేధము.

ప్ర : గీతకు ఎన్నో వ్యాఖ్యానాలు వచ్చాయి గదా! మాస్టరుగారు వ్రాసిన మంద్రగీత ప్రత్యేకమైన ప్రయోజనాన్ని సాధించిందంటారా?

జ : తప్పకుండా! మాస్టరుగారి రచనా పద్ధతే చిత్రమైనది. సామాన్యుని మనసెరిగి చెప్పడంలో ఆయన సిద్ధహస్తులు. మంద్రగీత పుస్తకంలో మొదటి భాగంగా గీత ఉంటుంది. రెండవ భాగంగా మంద్రగీత అంటే గీతకు మాస్టరుగారు చేసిన భావానువాద ముంటుంది. ఇలా ఉండడం వల్ల చదవడం ప్రారంభించిన వారికి ఇంక ఏ అడ్డూ ఉండదు. మొదలు పెట్టినవాడు చివరకొచ్చి నిలుస్తాడు.

ఇంకో చిత్ర మేమిటంటే మంద్రగీత చదువుతున్నంత సేపూ మనం అర్జునునిగా రూపుచెంది కృష్ణుని నుండి ఉపదేశాన్ని పొందడం జరుగుతుంది. దివ్యవాఙ్మయ రచనలో పండిన మాస్టరుగారు పాఠకునిలో ఈ పరిణామ మొచ్చేటట్లుగా రచన చేశారు. ప్రతి నరుడూ నారాయణుని ఉపదేశాన్ని పొంది తరించే అవకాశాన్ని అనుగ్రహించారు.

ఈ అదృష్టం మనకే కాదు. ప్రపంచ ప్రజలందరికీ లభించింది. మాస్టరుగారు 'మంద్రాస్క్రిప్చర్' అనే పేరుతో గీతకు దివ్యమైన అనువాదాన్ని ఆంగ్లంలో అందించారు.

ఈ అనువాదాలు ఇంత దివ్యమైన రీతిలో దిగిరావ డానికి ఒక్కటే కారణం కనిపిస్తుంది. అనువాదం చేసేటప్పుడు ఆ గ్రంథం యొక్క పరిపూర్ణ దర్శనం మన కందేటట్లు చేస్తారు తప్ప మధ్యలో ఆయ నెక్కడా కనబడరు. గీత మనకు వ్యక్త మయేటట్లు చేస్తారు తప్ప గీతను గూర్చి ఆయన చెప్పడం ఉండదు. స్వంత దృక్పథంలో వివరించక, గీతాచార్యుని హృదయ మెరిగి రచన జరపడం వలన యింతటి దివ్యాను వాదం దిగిరావడం జరిగిందేమో ననిపిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే కృష్ణుడు మనకొరకు గీతను తెలుగులో వివరించి చెప్పినట్లు ఉంటుంది.

ప్ర : రాసలీల కావ్యం ప్రథమభాగం మాత్రమే వచ్చి నట్లుంది. మిగిలిన భాగాల ప్రచురణ ఇంకా జరగ లేదేమి? కావ్యం మాత్రం భాగవతాన్ని మరిపిస్తోంది.

జ : మాస్టరుగారు బి. ఏ., ఆనర్సు చదువుతున్న రోజుల్లో లభించిన దివ్యదర్శనంతో రాసలీల రచన ప్రారంభమైంది. ఆ దివ్య దర్శనాన్ని కావ్యపీఠికలో వివరించారు మాస్టరుగారు. ప్రథమభాగం తరువాత 12 వేల పద్యాల వరకూ రచన సాగింది. కాని ఆ పద్యాల వ్రాత ప్రతు లెక్కడో పోయాయి. మళ్లీ ఈ మధ్యన మేం అడిగాం రాసలీల కావాలని. ఆ పోయిన పద్యాలను తిరిగి డిక్టేటు చేస్తున్నారు. త్వరలో రెండవ భాగం వెలువడగలదు. సార్వకాలికమైన కృష్ణావ తార గాథ దిగివస్తుంది రాసలీలగా!

ప్ర : పతంజలి యోగ సూత్రాలకు ఆంగ్లంలో మాస్టరు గారు వ్రాసిన వివరణ అద్భుతంగా ఉంటుందట. చదువ గలిగిన వారంటున్నారు. అదేదో తెలుగులో కూడా వస్తే మాలాంటి వాళ్లు కూడా తరిస్తారు కదా ?

జ : పతంజలి వ్రాసిన యోగ సూత్రాలను మూడు భాగాలుగా మాస్టరుగారు కూర్పు చేశారు. అందులో మొదటి భాగానికి ఆంగ్లంలో రచించిన వివరణను గూర్చే మీరు విన్నది. మరి రెండు భాగాలకు వివరణ రావలసి ఉంది. ఈ మధ్యనే మొదటి భాగానికి తెలుగులో కూడా వివరణ చెప్పడం ప్రారంభించారు. కొద్ది కాలంలో గ్రంథ రూపంలో అది మన చేతి కందగలదు. నిండు మనస్సుతో మనం రావాలి అని కోరాము అంటే మాస్టరుగారి నుండి అది వచ్చుందన్న మాటే.

ప్ర : విద్యా విధానంలో మార్పు తీసుకు రావాలని ట్రస్టు కోరుతూ ఉన్నది కదా ! మరి విద్యా విధానానికి రూపకల్పన, ప్రచురణ ప్రారంభించారా ?

జ : మాస్టరుగారు రచించిన భారతీయ బాలశిక్షల ప్రచురణతో నూతన విద్యా విధాన రూపకల్పన ప్రారంభ మయింది. ఇప్పటికి భారతీయ బాలశిక్ష 1, 2, భాగాలు వచ్చాయి. ఇంకొక రెండు సంవత్సరాలలో మరో 5 భాగాలు వస్తాయి. మొత్తం 7 భాగాలుగా కులపతి బాల

బాలికలకు శిక్షణ యిచ్చేటందుకు నిర్ణయించారు. నీతి పథం 1, 2 భాగాలు, భారత భారతి, బాలరామాయణం బాలల కొరకై ట్రిస్టు ప్రచురించింది.

ట్రిస్టు సేవా కార్యక్రమాలు నిర్వహింపబడుతున్న ప్రతిచోటా బాలబాలికలకు పై గ్రంథాల సాయంతో శిక్షణ నీయడం జరుగుతుంది. ఈ శిక్షణ నిచ్చే విద్యాలయా లలో కొన్ని రోజూ నడుస్తాయి. ఇంకొన్ని వారం వారం నడుస్తాయి. అక్కడి వారి వీలును బట్టి ఈ యేర్పాట్లు చేసు కొంటారు. ఈ విద్యాలయాలన్నిటికీ ఆదర్శంగా విశాఖలో బాలభాను విద్యాలయం మాస్టరుగారి దర్శకత్వంలో నడుప బడుతోంది. ప్రపంచం నలుమూలలా పర్యటించిన మాస్టరు గారు ప్రపంచంలో నేడమలులోనున్న విద్యావిధానా లన్నిటిలోని మంచిని గ్రహించి, తమ అనుభవాన్ని, దర్శ నాన్ని జోడించి ఈ బాలభాను విద్యాలయానికి ప్రణాళిక యిచ్చారు. క్రమంగా ఇలాంటి విద్యాలయాలు తామర తంపరగా నెలకొల్పబడగలవు.

మాస్టరుగారి దగ్గర శిక్షణ పొందిన వారిలో ఆరితేరిన వారు కొందరు ఒక బృందంగా ఏర్పడి మన దేశానికి కావ ల్సిన సమగ్ర విద్యా విధానానికి రూపురేఖలు దిద్ది ప్రచు రణ చేయాలని సంకల్పించారు. సుమారు 5 సంవత్సరాలలో మన మీ ప్రణాళికను ఉపయోగించుకోగలం.

ప్ర: "ట్రస్టు" ప్రచురణలను ప్రజల కందించడానికి ఎలాంటి పద్ధతులను అవలంబిస్తున్నారు?

జ: ప్రధాన కార్యాలయం విశాఖ లోని ముప్పిడి కాలనీలో నున్న రాధామాధవమ్. ఇక్కడనుండే అన్ని వైపులకు ప్రచురణలు పంపబడుతున్నాయి. శ్రీ Ch. సత్తిబాబు శ్రీ B. రామకృష్ణరాజు శ్రీ K. శివశంకర్, లు ఈ ప్రచురణల పంపిణీ బాధ్యతను నిర్వహిస్తుంటారు.

దాదాపు అన్ని ముఖ్యమైన పట్టణాలలోనూ, చాలా గ్రామాలలోను ట్రస్టు సేవా కేంద్రాలు పనిచేస్తున్నాయి. ఆ కేంద్రాలలో ఈ ప్రచురణ లన్నీ దొరుకుతాయి.

గత 2 సంవత్సరాలుగా శ్రీ వినాయకరావు ఆంధ్ర దేశంలో నలుమూలలా పర్యటిస్తూ ఈ పవిత్ర గ్రంథాలను అభిరుచి గల వారందరికీ అందిస్తున్నారు. ఏ మైనా వినాయకరావుగారి వంటివారు మరో డజను మందైనా రంగంలోనికి దిగితే ట్రస్టు చేస్తున్న కృషిని కావల్సిన వారందరికీ అందించడం సాధ్యమవుతుంది.



ప్ర : మాస్టరుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయనలా అన్ని విద్యలూ ఒకే వ్యక్తి నేర్వగలగడం కష్టమే కాని ఒక్కొక్క విద్యను ఆయా విద్యల్లో అభిరుచిగల వాళ్లు స్వీకరించి ఆ విద్యలో ఆయనంతటివాళ్లు కావచ్చును. కదా! అలా ఎవరైనా కృషి చేస్తున్న వాళ్లున్నారా? ఉంటే వారిని గూర్చి తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది.

జ : మీ రన్నది నిజమే. ఆయనలా అన్ని విద్యలు ఒకే వ్యక్తిలో మన మెక్కడోగాని చూడలేము. ఆయన మాత్రం ప్రతి విద్యలోను పారం జూచారు. సిద్ధపడిన వారికి చూపిస్తున్నారు. ఆయన శిష్యులు కూడా సామాన్యులేమీ కాదు. ఎవరి సంస్కారాన్ని బట్టి వారు ఆయన దగ్గర విద్యలను గ్రహించి కృషి చేస్తున్నారు.

ప్ర : మాస్టరుగారి జ్యోతిర్విద్యానుభవం అద్భుతమైనది. అలా ఆయనలా తయారైన వారెవరైనా ఉన్నారా?

జ : మాస్టరుగారి దగ్గర జ్యోతిర్విద్యలో చాలామంది శిక్షణ పొందారు, పొందుతున్నారు. ఈ పొందిన వారిలో శ్రీ G. L. N. శాస్త్రి శ్రీ M. R. L. రావు శ్రీ E. V. రమణ, శ్రీ Ch. S. N. రాజు, శ్రీ N. S. S. రామ్ శ్రీ N. B. K. V. ప్రసాద్ ముఖ్యులు.

వీరిలో శాస్త్రిగారు బాగా అనుభవం గడించినవారు. మాస్టరుగారు విశాఖ వచ్చిన కొత్తల్లో ఆయన దగ్గర ప్రత్యేక మైన శిక్షణ పొందిన వ్యక్తి ఈయన. సున్నితమైన హాస్యం, సునిశితమైన మేధ. చురుకైన వ్యక్తి. అన్ని విధాలా ఈ విద్యలో మాస్టరుగారి తరువాత మాస్టరుగా రంతటి వారు.

ఈ శిక్షణ పొందిన వారిలో జ్యోతిర్విద్యా తరగతులు నడుపుతూ తమంత వారిని తయారుచేస్తున్నవారు కూడా ఉన్నారు. ఒక్క అయిదేళ్లలో శాస్త్రిగారి వంటి వారు కనీసం ఒక డజను మందైనా తయారుకాగలరు.

ప్ర : హోమియోలో మాస్టరుగారి లాగా మందులివ్వ గలిగిన వారు, ఎలాంటి పరిస్థితులెదురైనా నిలబడ గలిగిన వారు ఎంతమంది తయారయ్యారో చెబుతారా ?

జ : ఈ రంగంలో మాస్టరుగారి అనుయాయులను లెక్క పెట్టడం కష్టం. ఎక్కువతక్కువలు నిర్ణయించడమూ కష్టమే. మాస్టరుగారి వైద్యరంగం విశ్వమంతా వ్యాపించి ఉంది. ఎంత చెప్పినా చెప్పవలసిన వాళ్లు మిగిలిపోతూనే ఉంటారు. అయినప్పటికీ కొందరి పేర్లు చెబుతాను. శ్రీ పి. సాంబమూర్తి, శ్రీ బి. గోవర్థన్, శ్రీ ఎ. వి. ఆర్. శాస్త్రి ఆయన శ్రీమతి, శ్రీ కె. యస్. శాస్త్రి శ్రీ పి. జగన్మోహన రావు, శ్రీ టి. సత్యనారాయణ, శ్రీ శర్మ, శ్రీమూర్తి మొదలైన

వారెందరో మాస్టరుగారివలె చేయితిరిగిన వారున్నారు. ఇటీవలనే డి. హెచ్. ఎమ్. యస్. ప్యాసై సేవారంగంలో ప్రవేశించాడు మాస్టరుగారి రెండో అబ్బాయి వరాహామిహిరాచార్య. ప్రవేశించిన కొద్ది నెలల్లోనే తండ్రి తరువాత తండ్రంతటివాడనిపించుకో సాగాడు. ఈ విధంగా మాస్టరుగారి దగ్గర తయారైన వైద్యుల వివరాలు, వారిని గూర్చిన విశేషాలు చెప్పుకొంటూ పోతే ఒక పుస్తకం అవుతుంది.

ప్ర: వేదవాఙ్మయాన్ని తరచి లోతులుచూపిస్తూ ఉంటారు. మాస్టరుగారు. మరి ఆవిధంగా లోతులు చూపించగల వారెవరైనా సిద్ధమయ్యారా ?

జ: ఈ ప్రశ్న ఎవరెప్పుడడిగినా నాకు ముందుగా శ్రీ A. L. N. రావు గుర్తుకు వస్తారు. ఆయన మాస్టరుగారి వేదదర్శనాన్ని పుణికి పుచ్చుకొన్నవారు. నావాణిలో 'పద్మ' మనీ, 'సౌరాయణ' మనీ అద్భుతమైన వ్యాసాలు ప్రకటించారు. ఇంకెన్నో దర్శన గ్రంథాలు వ్రాయాలన్న సంకల్పం ఉంది. మాస్టరుగారు చెప్పుకొంటూ వస్తున్న దర్శనాత్మకమైన అంశాలన్నీ పుస్తకాలలో నింపబడి దొంతరలు దొంతరలుగా ఈయన దగ్గర ఉన్నాయి. అందులో ఏ దొంతర కదిలించినా దర్శన గ్రంథాలు కుప్పలు తిప్పలుగా వస్తాయి. రావుగారి తరువాత మాస్టరుగారి వేదదర్శనాన్ని పుణికి పుచ్చుకొన్న వారిలో శ్రీ మామిడన్న సత్యనారాయణమూర్తి,

శ్రీ G. L. N. శాస్త్రి, శ్రీ ధారా రాధా కృష్ణమూర్తి మొదలైన వారెందరో ఉన్నారు.

ఏమైనా మాస్టరుగారి నుండి ఈ వేదవాఙ్మయ దర్శ నాన్ని విని ఆనందించేవారు కోకొల్లలు. తిరిగి జాతికి అందించే వారి సంఖ్య బాగా పెరగవలసి ఉంది.

ప్ర : మాస్టరుగారు రామాయణ భారత భాగవతాలు అద్భుతమైన రీతిలో చెబుతూ ఉంటారు. ఆ అంత రార్థాలు, ఆ గ్రంథాల పరమార్థం, ఆ ప్రవచనపు తీరు ఆకళించుకొన్నవారెవరో చెబుతారా ?

జ : మీరడిగిన ప్రశ్నకు సమాధానంగా చాలా మందిని చెప్పవచ్చు. రామాయణ విషయంలో G. L. N. శాస్త్రిగారినే మళ్ళీ చెప్పాలి. రామాయణం ఆయన ప్రాణం. రాముడు – రామాయణమని నావాణిలో ఆయన వ్రాస్తున్న సీరియల్ మీరు చదివే ఉంటారు. భారతం విషయంలో చివుకుల రవిశర్మ పేరుబడ్డవాడు. నావాణిలో వస్తున్న “నిలకడమీద నిజం” లో ఇతని శక్తి మనకు బోధపడు తుంది. భారత కథను ఆధారంగా చేసికొని “రాజ సూయ మనే” దర్శనాత్మకమైన నవలను రచించాడితను.

భాగవతం, కృష్ణతత్త్వం విషయంలో ధారా రామ నాథ శాస్త్రిగారిని మొదట చెప్పవలసి ఉంది. ఆయన

గాత్రంలోనే వేణుగానం ఉంది. "తెలుగు సాహిత్యంలో శ్రీ కృష్ణతత్త్వము"నే ప్రామాణికమైన పరిశోధన గ్రంథాన్ని మాస్టరుగారి ఆశీస్సులతో ఈయన రచించారు.

శ్రీ రామనరసింహం, శ్రీమతి అనంతలక్ష్మి, శ్రీ N. దుర్గా ప్రసాద్, శ్రీ C. G. K. హరివిఠల్, శ్రీ P. కామేశ్వరరావు, శ్రీ M. సత్యనారాయణమూర్తి, శ్రీ C. L. N. మూర్తి మొదలైన వారెందరో మాస్టరుగారి శిక్షణలో పురాణేతి హాసాలను స్పష్టంగా దర్శించిన వారున్నారు.

ప్ర : ఇ) మాస్టరుగారు దివ్యజ్ఞాన వాఙ్మయాన్ని పరిపూర్ణ దర్శనం పొంది మన పవిత్ర గ్రంథాలకీ, ఆ వాఙ్మయానికీ చక్కని సమన్వయం చూపిస్తూ ఉంటారు. అటువంటి దివ్యజ్ఞాన వాఙ్మయంలో మాస్టరుగారి దగ్గర తర్ఫీదు పొందిన వారెంతమంది ఉంటారు ?

జ : ఈ వాఙ్మయంలో మాస్టరుగారి దగ్గర తర్ఫీదు పొందినవారు చాలామంది ఉన్నారు. తర్ఫీదు పొందినవారిలో కొందరు తమ శిష్యులకు శిక్షణనిస్తున్నారు కూడ. ఈ వాఙ్మయంలో కూడా అందె వేసిన చేయి శ్రీ A. L. N. రావు గారు. దివ్యజ్ఞాన గ్రంథాలను ఆమూలాగ్రము చదివిన

వా డా య న. యువతరంలో ఈ వాఙ్మయంలో దిట్ట Ch. S. N. రాజు. ఈ వాఙ్మయ దర్శనంలో కూడా ప్రావీణ్యం పొందిన వారి సంఖ్య పెరగవలసి ఉన్నది అని చెప్పక తప్పదు.

ప్ర : మాస్టరుగారు హస్త సాముద్రికంలో లోతులు చూచిన వారు. వారి దగ్గర నుండి ఈ విద్యను నేర్చినవారెందరుంటారు ?

జ : ఈ విద్యపై అభిలాషతో మాస్టరుగారి దగ్గర శిక్షణ పొందుతున్నవారు, పొందాలను కుంటున్నవారు చాలామంది ఉన్నారు. కాని పరిణితి చెందినవారు ఎక్కువమంది లేరు. కారణం ఏమిటంటే హోమియో విధానంలోను, జ్యోతిర్విద్యలోను శిక్షణ తరగతులు నడుపుతున్నట్లు హస్త సాముద్రికానికి, వాస్తు శాస్త్రానికి తరగతులు నడవటం జరగలేదు. అయినా ప్రొఫెసర్ K. V. రమణగారు, శ్రీ K. P. కుమార్ గారు, కళాధర్ మాస్టరుగారి సహాయంతోను, వారి స్వయం కృషితోను హస్తసాముద్రిక శాస్త్రాలలో ఎంతో పరిణితి చెందారు.

జ) మాస్టరుగారు సరదాగా మ్యాజిక్ చేస్తూ ఉంటారు కదా! సోదర బృందంలో ఎవరైనా దీనిలో నైపుణ్యం సాధించిన వారున్నారా ?

జ : మ్యాజిక్‌లో మాస్టరుగారి దగ్గర శిక్షణ పొంది చేస్తున్నవారు చాలామంది ఉన్నారు. ఈ రంగంలో ఉత్సా

హాము నైపుణ్యం కలవాడు మాస్టరుగారి మూడో అబ్బాయి అయిన శ్రీనివాస్. భవిష్యత్తులో ఇతను పెద్ద మెజీషియన్ కాగలడు. మన రామకృష్ణ చెట్టిగారబ్బాయి కృష్ణ కూడా మ్యాజిక్‌లో చక్కటి శిక్షణ పొందుతున్నాడు. కొన్ని ప్రదర్శనలు ఇచ్చాడు కూడా !

ప్ర : మాస్టరుగారు చిన్న తరహా పరిశ్రమలు స్థాపింప జేస్తున్నారు గదా ! వాటి నిర్వహణలో సిద్ధహస్తులైన యువకు లెందరుంటారు ? వీరందరినీ నడిపించడంలో మాస్టరుగారిలాగా చేయి తిరిగిన వారెవరైనా ఉన్నారా ? అన్నీ మాస్టరుగారే చూచుకోవాలా ?

జ : పరిశ్రమలు ప్రారంభింపజేసిన తొలిరోజుల్లో మాస్టరుగారు దగ్గర ఉండి శిక్షణనిచ్చేవారు. క్రమంగా సమర్థులైన యువకులు తయారయ్యారు. J. రవీంద్ర, P. కృష్ణమోహన్, R. S. కృష్ణమూర్తి, Ch. S. N. రాజు, E. అనంతకృష్ణ, కిషోర్, మొదలైన వారు ఈ యువకుల్లో ముఖ్యులు.

వీరిని, సోదర బృందం నడుపుతున్న వివిధ పరిశ్రమల్ని శ్రీ K. పార్వతీ కుమార్ తమ విశిష్టమైన అనుభవంతో జాగ్రత్తగా చూచుకుంటున్నారు. చాలా విషయాలలో మాస్టరు అవసరం రాకుండానే నిర్వహిస్తూ మాస్టరుగారికి

కాలం వ్యర్థం కాకుండా చూస్తూ ఉంటారు. W. T. T. కార్య వర్గంలో కేవలం చిత్రగుప్తులుగా కనబడే ఈయన ట్రస్టు కార్య నిర్వహణలో చిత్రంగాను, గుప్తంగాను చాలా బాధ్యతా పూర్వకంగా నడుచుకొంటున్న వ్యక్తి.

పరిశ్రమల విషయంలో మన యువకులకు తమ అమూల్యమైన అనుభవాన్ని, అండదండలను అందజేస్తున్న శ్రీ K. S. దత్తుగారిని మన మీ సమయంలో తప్పక స్మరించాలి. అలాగే ఇంకెందరో పెద్దలు అనేక విధాల ఈ పరిశ్రమల పెరుగుదలకు సహాకరించి కృషి చేస్తున్నారు.

ప్ర) మాస్టరుగారి ననుసరిస్తూ సేవా కేంద్రాలు నెలకొల్పి నడుపుతున్నవారు చాలామంది ఉన్నారు కదా! ఇందరిలోను, మాస్టరుగారి పరోక్షంలో మాష్టరు గారంతగా పనిచేస్తున్న వారెవరైనా ఉన్నారా?

జ: నెలకొల్పబడిన అన్ని కేంద్రాలంలోనూ నడుపుతున్న వారందరిచేత మాస్టరుగారి పాత్ర ధరింపబడుతూనే ఉంది. ఈ పాత్రను ధరించడంలో పరిపూర్ణత పొందిన వారుగా నాకు ఖర్గపూరు కామేశ్వరరావుగారు కనిపిస్తారు. రాముడికి ఆంజనేయుడు ఎలాంటివాడో ఈయన మాస్టరు గారికి అలాంటి వాడనిపిస్తుంది. ఆనాటి ఆంజనేయుడు చూచి రమ్మంటే కాల్చివచ్చాడు. ఈ నాటి ఈ ఆంజనేయుడు చూచిరమ్మంటే చేసివస్తాడు.

దేశంగాని దేశమైన ఖర్గపూర్‌లో రోజు రోజుకూ విస్తరిస్తున్న కేంద్రాన్ని నెలకొల్పారు కామేశ్వరరావుగారు ఆయన చదివినది F. A. అయినా ఆయన ఉపన్యాసాలలో వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, వివిధ దేశాల గ్రంథాలు దొర్లిపోతుంటాయి. తెలుగు ఇంగ్లీషు, బెంగాలీ భాషలలో అనర్గళంగా ఉపన్యసిస్తారాయన.

తోటి సోదరులను కన్నబిడ్డలవలె కనిపెట్టి చూస్తూ మాతృప్రేమను వర్షిస్తారు. ఆచరణే తప్ప ఆలోచనలేని వ్యక్తి. చేసినకొద్దీ శక్తి పెరుగుతుందనీ, చేయడంలోనే తృప్తి దొరుకుతుందనీ నిరూపిస్తున్న వ్యక్తి ఈయన. శిష్యుడంటే ఎలా ఉండాలో ఈయనను చూస్తే తెలుస్తుంది అనిపిస్తుంది నాకు.

ప్ర : అన్నీ చెప్పారు. మీ ప్రసక్తి మాత్రం తేలేదెక్కడా! మీ గురించి మాకు తెలుసుననుకోండి. అయినప్పటికి మీరేయే రంగాలలో శిక్షణ పొందుతున్నారో చెబితే విందామని కోరిక.

జ : మాస్టరుగారు నన్ను స్వీకరించేటంతవరకూ నే నే రంగానికి పనికివస్తానన్నది నాకు తెలియదు. మాస్టరుగారు నన్ను స్వీకరించిన తరువాత ఆవశ్యకతను బట్టి ఆయా రంగాలలో నానుండి వ్యక్తమవుతూనే ఉన్నారు.

వైద్య, వేదవాఙ్మయం, జ్యోతిర్విద్య, దివ్యజ్ఞాన దర్శనం మొదలైనవి నాకెంతో యిష్టం. వీటన్నిటిలోనూ మాస్టరుగారి దగ్గర, మాస్టరుగారి దగ్గర తర్ఫీదు పొందిన మా సోదరుల దగ్గర నేను పొందవలసిన శిక్షణ చాలా ఉంది. మాస్టరుగారు నా జీవితాన్ని క్రమబద్ధమయ్యేటట్లుగా చూస్తున్నారు. క్రమంగా ఆయా విద్యలలో ప్రావీణ్యం పొందగలనని నాకనిపిస్తూ ఉన్నది. ఎందువల్లనంటే తోటివారిని సేవించడమంటే నాకెంతో యిష్టం. సేవించడానికి కావలిసిన ఉపకరణాలే ఆ విద్యలన్నీ. కనుక ఆ విద్యలన్నీ దైవానుగ్రహంతో పొందాలని నా కోరిక.



ప్ర : మాస్టరుగారు మహిమ లేమైనా చేస్తారా, బాబా గారి లాగా? చేస్తునట్లు ప్రచారంలో లేదు. అయి నప్పటికీ ఆయనను ఇన్ని వేలమంది అనుసరించడం ఆశ్చర్యంగానే ఉంది.

జ : మహిమలు చూపకపోయినా ఇన్ని వేలమంది ఆయనను అనుసరిండమే ఆయన మహిమ. మీరనుకుంటూ న్నట్లు బాబాగారిని కూడా కేవలం మహిమలనుబట్టి ఎవరూ ఆరాధించడం లేదు. మహిమలను బట్టే ఆరాధిస్తున్నారనుకొని భ్రమపడి ఆయనలా మహిమల చూపి, జుట్టుపెంచి వేష ధారణచేసి, ఆశాభంగం చెందిన వారు చాలామంది ఉన్నారు. కేవలం మహిమలను చూచి ఎవరూ బాబాను అనుసరించ పోవటం లేదని వారే నిరూపించారు.

రాముడు తన ఋజువైన ప్రవర్తన ద్వారా ప్రజలను ధర్మమార్గంలోనికి ఆకర్షిస్తున్నాడు. కృష్ణుడు తన వేణుగానం, దివ్యవైభవం, సమన్వయ సందేశం ద్వారా జీవులను ధర్మ పథంలోనికి ప్రవేశింప జేస్తున్నాడు. ఇద్దరూ చేస్తున్న పని ఒక్కటే. కాని అనుసరించిన పద్ధతుల్లో వైవిధ్యం ఉన్నది. జీవులలో అందరూ ఒకే సంస్కారం గల వారుండరు. కాబట్టి ఈ వైవిధ్యం అవసరం. అలాగే మాష్టరుగారు బాబాగారు చేస్తున్నపని ఒక్కటే. అనుసరిస్తున్న మార్గాలలోనే వైవిధ్య మున్నది. నేటి సమాజానికీ వైవిధ్యం అవసరం.

ప్రః మాస్టరుగారు బాబాగారు పనిచేస్తున్న తీరులను కాస్త వివరించి చెబుతారా ?

జ : తప్పకుండా! నేటి సమాజం బాగుపడాలంటే కేవలం ప్రణాళికలు వేసి కోట్లుఖర్చు పెట్టి లాభం లేదు. ఈ సత్యం అడుగడుగునా ఋజువవుతూనే ఉంది. గవర్నమెంటువారు గేదెలను కొనుక్కోమని డబ్బులిస్తే గేదెనుకూడా కొనకుండా డబ్బు ఖర్చుపెట్టుకొని గేదె చచ్చిపోయినట్లు వ్రాయించేవారు, నైలాను వలలను పంచిపెడితే ఇంటికి కూడా చేర్చకుండానే వచ్చినధరకు అమ్ముకునేవాళ్లు ఇలాగ జరుగుతున్న ప్రయత్నాలను సద్వినియోగపరచుకోలేని వాళ్లను మనం నిత్యం చూస్తూనే ఉన్నాం. ఇలాంటప్పుడు డబ్బు సదుపాయాలు జాతిని బాగుచేయలేవు. ఇప్పుడు చేయవలసినది జాతిని నైతిక విలువలలోనికి మేల్కొల్పడం. ధర్మమార్గంలోనికి ఆకర్షించి ప్రేమమయ సహజీవనానికి ఇష్టపడేలా చేయడం. ఇలా చేయగలిగిననాడు మాత్రమే జాతి కుదుట బడుతుంది. ఇలా కుదుటబడకుండా జాతిపై డబ్బులు కురిపించడం చిల్లుల కుండలలోనికి మరింత పెద్ద బాల్చీలతో నీళ్లు తోడి పోయడం.

బాబా తనను వరించిన మహిమలద్వారా ఆబాల గోపాలాన్ని ఆకర్షించసాగాడు. దేవుని లీలలని సామాన్యులు ఆరాధించారు. శాస్త్రాలకు లొంగని సత్యాలని శాస్త్రజ్ఞులు విస్తుపోయారు. మొత్తం మీద క్రిందనుండి పైవరకు ఒకే

దెబ్బ కొట్టాడాయన. జనం అంతా చుట్టూ చేరి ఆయనలోని దివ్యప్రేమను అందుకొని ధర్మమార్గాన అప్రియత్నంగా నడవడం మొదలు పెట్టారు. గారడీవాడు మనుషులు చేరే దాకా డప్పులుకొడతాడు. జనం చేరగానే ప్రదర్శన మొదలు పెడతాడు. అలాగే బాబా కూడా ప్రజలదృష్టి తనవైపు మళ్లే వరకు మహిమలు విపరీతంగా చేశాడు. ఇప్పుడు మహిమల కన్నా సందేశానికీ, సత్కర్మాచరణకూ ప్రాధాన్యమిస్తున్నాడు. మొత్తం మీద బాబా చేస్తున్నది ఆధ్యాత్మికత లోనికి సామూహికాక్షరాభ్యాసాలు. వీలైనంతమందిని దివ్య జీవనంలోనికి మేల్కొలపాలి. ఇదే ఆయన గమ్యం.

ఇక మాస్టరుగారు రామునిలా ఋజువైన ప్రవర్తన ద్వారా జనాన్ని ఆకర్షిస్తారు. ఈయన వైభవమంతా ఈయన నడవడిలోను, వాక్కులోనూ, రచనలోనూ ఉంది. తనకున్న సమస్తశక్తి యుక్తులను దీనజన సేవకు సమర్పణచేసి ఆదర్శ ప్రాయమైన తన నడవడి లోకానికి మేలుబంతిగా చేశారు. బాబాగారి మహిమలకు ఎంత శక్తి ఉందో మాస్టరుగారి మాటలకు అంత శక్తి ఉంది.

బాబాగారు సామూహిక ఆధ్యాత్మిక అక్షరాభ్యాసాలు చేస్తూ ఉంటే మాస్టరుగారు తనలాంటి త్యాగ మూర్తుల బృందాలను సృష్టిస్తున్నారు. బాబాగారు గుంపులను మేల్కొలుపుతూ ఉంటే మాస్టరుగారా గుంపులను

నడప గలవారికి శిక్షణనిస్తున్నారు. ఇలా వారి ప్రణాళికలు పరస్పర పరిపోషకములైనవి. బాబా సంప్రదాయంపై ప్రజలకు గాఢమైన అనురక్తిని కలిగిస్తున్నారు. మాస్టరు గారు ఆ సంప్రదాయాన్ని ముడులు విప్పి ముచ్చటగా అందిస్తున్నారు. సంఘాన్నుండి ఏమీ అపేక్షించకుండా సంఘానికి తాము చేయదలచినది ప్రేమతో చేయడంలో ఇద్దరూ ఒక్కటే.

జరగవలసిన పనులను బట్టి ఒకే వెలుగు ఆయా తరహాలలో దిగివచ్చి నిర్వహిస్తూ నిర్వహింప జేస్తూ వుంటుంది. గాలి అవసరమైన చోట విద్యుత్తు పంకాను తిప్పుతోంది. వెలుగు అవసరమైనపుడు విద్యుత్తు బల్బు ద్వారా వెలుగుతోంది. మా విద్యుత్తు గాలి నీయగలదు. మీ విద్యుత్తు ఈయగలదా? మా విద్యుత్తు వెలుగు నీయగలదు మీ విద్యుత్తీయగలదా? అని వాదించుకోవడం ఎంతటి అవివేకమో అవతారమూర్తులను మన మనస్సులనే తక్కెడ సిబ్బెలపై తూకం వేయడం కూడా అంతే అవివేకం. అవసరాన్నిబట్టి విద్యుత్తు అభివ్యక్తమైనట్లు ఆవశ్యకతనుబట్టి దైవం ఆయా రూపులతో లీలగా దిగివస్తుంటాడు. ఆయా కర్తవ్యాలను నిర్వహిస్తూ ఉంటాడు.

ప్ర : జిల్లెళ్ళమూడి అమ్మకు మాస్టరుగారికి ఉన్న సామ్యమెలాంటిదంటారు?

జ : సత్యసాయి, మాస్టరుగారు, జిల్లెళ్ళమూడి అమ్మ భూమి మీదకు నెలలు తేడాలో అవతరించినవారు. మాతౄ తీతమైన విశ్వప్రేమలోనికి జీవులను మేల్కొల్పడమే వీరి ధ్యేయం. అమ్మ అందరిని అక్కున చేర్చుకుంటున్నది. ఆశీర్వాదిస్తున్నది. అపారమైన మాతౄ ప్రేమను మనపై వర్షించి మనలను పునీతులను చేసి రెండవ జన్మను (ద్విజత్వాన్ని) ప్రసాదిస్తున్నది. అమ్మ తన బిడ్డలు ఎలా ఉండాలని కోరుకుంటుందో అలా ఆ బిడ్డలను నడిపించడానికి అంకితమైనవారు మాస్టరుగారు. శాశ్వతమైన ధర్మాన్ని నేటి వారికి అనుగుణమైన తీరులో మలచి తాను నడిచి మనను నడిపిస్తున్నారు మాస్టరుగారు. ఆధ్యాత్మిక సాధనమనేది ఏ కొందరికో సాధ్యమయ్యేది మాత్రమే కాదని అసలందరూ ఉన్నది ఆ సాధనలోనే నని తెలుపుతూ వెలుగుదారిలో నడుపుతున్నారాయన. అమ్మ ఆదరణలో ఎంతటి ప్రశాంతి ఉన్నదో మాస్టరుగారి ఆచరణలో అంతటి పరిపూర్ణత ఉన్నది.

ప్ర : అరవిందయోగిని గూర్చి మాస్టరుగారి అభిప్రాయ మేమిటి ?

జ : మహానుభావుల విషయంలో మాస్టరుగారి కున్నది ఐక్యానుభవమేగాని అభిప్రాయం గాదు. " అరవిందయోగి ద్రష్ట. 20వ శతాబ్దంలో ఆంగ్లభాషలో సావిత్రి పేరుతో

వేదాన్ని అందించిన వాడాయన. ప్రాక్పశ్చిమములను కలిపి నడుపుటలో నేర్పు చూపినవాడు. దేశ స్వాతంత్ర్యానికై దీక్షతో పనిచేస్తూ దివ్యవాణి ప్రబోధంతో అంతర్ముఖత్వాన్ని పొంది దేశానికే కాక యావత్ మానవాళికే నిజమైన స్వేచ్ఛను ప్రసాదించడానికి తపస్సులోనికి వెళ్ళినవాడు. యోగమార్గాన్ని ఈ శతాబ్దానికి తగినట్లుగా రూపొందించి విద్యా విధానాన్ని తీర్చిదిద్దడానికై అసాధారణమైన కృషి చేసినవాడు. ఆయన వేసి వెళ్ళిన బాటలను విస్తృత పరుచు కొంటూ మనం నడవ గలిగితే మనం తృప్తిని, పరిపూర్ణతను అనుభవించగలం." ఇవి అరవిందుని గూర్చి మాస్టరుగారు ప్రాసంగికంగా పలికిన పలుకులు.

ప్ర : రమణ మహర్షిని గూర్చి మాస్టరుగారేమంటారు ?

జ : మాస్టరుగారి ఉపన్యాసాలలో తరచుగా రమణమహర్షి చోటు చేసుకొంటూ ఉంటారు. ఆయన ప్రసక్తి వచ్చినపుడు మాస్టరుగారు ఒకసారిలా ఉన్నారు "ఆయన మాటలు మాటలు కావు, మంత్రాలు. అంటే మనం మరచిపోదామన్నా మరచిపోలేనివి. కాగిన పాలలో మజ్జిగ చుక్క పడితే ఏమవుతుందో మన చెవుల్లో ఆయన మాటలు పడితే అదే అవుతుంది. ఎవరికెలా చెప్పాలో వారికలా చెబుతాడాయన. చూడటానికి అమాయకుడిలా ఉంటాడుగాని నిజానికి మహా గడుసువాడు. ఎంతటి భవరోగాన్నైనా మాటలనే మందులుగా వాడి పూర్తిగా నయం చేయగలడు."

ప్ర : షిరిడీ సాయిని గూర్చి ఏమంటారు మాస్టరుగారు ?

జ : " పెద్దవాళ్ళు ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క తరహాలో ఉంటుంటారు. విచిత్రమైన ప్రవర్తన వారిది. అర్థమయినట్లూ ఉంటుంది. మళ్ళీ అర్థంకానట్లూ ఉంటుంది. షిరిడీ సాయికూడా అంతే. దిగితేగాని లోతు తెలియదన్నట్లు మనని మనం సమర్పించుకుంటే గాని అలాంటివారి స్వస్వరూపం దర్శన మీయదు. ఎలాచూస్తే అలా కనబడేవాడు, ఎలాంటి స్థితిలోనున్న వాడినైనా పైకి లేవనెత్తేవాడు ఆయన " ఇది షిరిడీ సాయినిగూర్చి ఒకసారి మాస్టరుగారు చేసిన సంభాషణ.

ప్ర : మహేష్ యోగిని గూర్చి మాస్టరుగా రేమంటారు ?

జ : " సనాతనమైన యోగమార్గాన్ని ఆధునికులకు అందు బాటులోనున్న శాస్త్ర సహాయంతో బోధపరచటానికి ప్రయత్నిస్తున్నారు. పాశ్చాత్యులలో ఎక్కువమందికీ భారతీయులలో కొంతమందికి ఈ విధానం అనుకూలంగా ఉంటుంది " అంటారు మాస్టరుగారు.

ప్ర : ఈ మధ్య లక్ష్మణ యతీంద్రులవారు మాస్టరుగారు కలిసి లోకహిత కార్యక్రమాలలో పాల్గొంటు న్నారు. చూడగా వీరి తత్త్వాలకు పోలిక చాలా కనబడుతోంది.

జ : ఆ మాట వారే చెప్పారొకసారి. దుస్తులు వేరు గాని వస్తువొకటేనని. ఒకే పరమాత్మ పెక్కు మూర్తులతో వర్తించడమంటే ఏమిటో వీరి సన్నిధిలో మన కనుభవమవుతుంది. వీరిరువురు ఒకటిగా కార్యక్రమాలు నడిపిస్తూ మనలను అనన్య స్థితిలోనికి గొనిపోవడం నిజంగా మన అదృష్టం.

ప్ర : మీరు మహానుభావులలో చాలా మందిని గూర్చి సప్రమాణంగా, సాధికంగా ఉపన్యసిస్తూ ఉంటారు. ఆ ప్రసంగాలు వింటుంటే ఆ మహానుభావులందరితోనూ మీకెంతటి సన్నిహితత్వం ఉండాలి అనిపిస్తుంది.

జ : మీరన్నట్లుగా మహానుభావుల సందేశాలు ప్రణాళికలు నా ద్వారా దిగివస్తున్న మాట నిజమే. అయితే వారందరితో నాకు అంతటి సన్నిహితత్వం ఎలా సాధ్యమైనదంటారు మీరు? బావికి ఒక ప్రక్కన నిలబడి నీళ్ళుతోడి తాగిన వాడు ఆ నూతిలో నీళ్ళెలా ఉన్నాయో చెప్పగలడు. ఇంక మీరే ప్రక్కనుండి తోడినా ఆ నీళ్ళు ఆ రుచిలోనే ఉంటాయి. అలాగే మాస్టరుగారి సాన్నిధ్యంలోనే నాకు మీరనుకుంటున్న ఆ సన్నిహితత్వం కూడా లభించింది. ఆయనలో నా కందరూ దర్శనమిచ్చారు. అవతారమూర్తులందరికి వేదికగా ఆయన దేహం నాకు కనబడుతుంది. ఆ

దేహం ద్వారా వ్యక్తమవుతున్న దివ్యమూర్తి ఎప్పుడే తీరవసరమో అప్పుడా తీరుగో ఉంటారు. కనుక అన్ని తీరుల తీరు తెన్నులు తెలిసిపోతాయి.



ధర్మసూక్ష్మ మేమిటంటే ఏ మహానుభావుని పాదాలకు మనని మనం సమర్పణ చేసుకుంటామో ఆ మహానుభావునిలోనే భూమిపై అప్పటివరకు దిగివచ్చిన అవతారమూర్తులందరు సువ్యక్తమై మనలను ఆశీర్వాదిస్తారు. మనకు కావలసిన రూపుతో మనకు చేరువవుతారు గాని మన కావశ్యకత యేర్పడిన వేళల ఎన్నిరూపులైనా వారిలో మనకు దర్శనమిస్తాయి అర్జునునకు కృష్ణునిలో విశ్వరూప దర్శనం లభించినట్లు. 081